The one and only Magazine devoted to Humour & Music


పేజీలు : 68+8

వెల : రూ.10

16-28 ఫిబ్రవరి 2002


# హాసం

హాస్య-సంగీత పత్రిక



సెంటర్‌స్ప్రెడ్‌లో

నీ ప్రేమకై

అమృత

పాటల పుస్తకాలు

లోపలిపేజీల్లో...

చక్రవర్తి

దేవులపల్లి

స్పెషల్

3 ఫిబ్రవరి 2002న స్వరసురలోకానికేగిన

సంగీత దర్శకుడు **చక్రవర్తి**కి నివాళిగా సంగీత ప్రియుల కోసం...

హాసం



హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇదీ సంగతులు

Also available on net
www.haasam.com

## హాస్యం సంగీతం





















సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'నీ ప్రేమకై', 'అమృత'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో



ముఖచిత్రం: 'నీతో చెప్పాలని..' సినిమా నుండి ఆకాష్ కవర్ డిజైన్ : ఈరంకి




భరణీగారు
నమస్తే -

విశ్వపతి శాస్త్రి గారి గురించి తెలియని విషయాలు విడమరిచి తెలియజేశారు.

ఇంటి పేరు కూడా జోడించి వుంటే - పూర్తిగా తెలిసి వుండునుగా -

వ్యాసం చదువుతూంటే, ఇలా మరుగున పడ్డ మూల పురుషులను ముందుకు తీసుకు రావడం, ఆ జ్ఞాపకాలు నెమరువేసుకోడానికి దోహద పడడానికి కారణ భూతులు భరణిగారు ధన్యులు. వీరి ఇలాంటి రచనల వల్ల భావి తరిస్తుంది తెలుసుకొని.

**-యస్.జె.శాస్త్రి జి. విశాఖపట్నం - 530 002.**

ఈ పక్షంలో 'హాసం'లో ఆదివిష్ణుగారి 'చవకభర్త' సగభాగం చదివిన తరువాత ఈ ఉత్తరం రాయకపోతే 'హాస్యద్రోహి'నౌతాను. హాస్య రచనలో ఆదివిష్ణుగారి రూటే వేరు. అది ఎవరికీ పట్టుబడదు. రెండు దశాబ్దాల క్రితం ఆదివిష్ణు, జంధ్యాల గార్ల రచనల స్ఫూర్తితో హాస్యరచన ఆరంభించాను. సుమారు 80 కథలు వ్రాసిన తరువాత కూడా వారి ప్రభావాన్ని తప్పించుకోవడం నా తరం కావడం లేదు.

గిలిగింతలు పెట్టే ఆహ్లాదకర హాస్యం ఎలా ఉండాలో ఆదివిష్ణు గారి రచనలు ఢంకా కొట్టి చెబుతుంటాయి. చవకభర్తలోని ప్రతి డైలాగు విలువైన హాస్యపుతునక. ఒకసారి జంధ్యాల గారింట్లో ఓ కథ విషయం మాట్లాడుతున్నప్పుడు "మొదట్లో నేను ఆదివిష్ణు నుంచి ఇన్‌స్పైర్ అయ్యాను. నాకు బాగా నచ్చిన ఇద్దరు ముగ్గురు హాస్య రచయితల్లో ఆదివిష్ణు ఒకరు" అంటూ ఆదివిష్ణుతో తనకు గల అనుబంధాన్ని ఎంతో వివరంగా చెప్పారు. ఆదివిష్ణుగారు బాధ్యతల నుండి రిటైరయ్యాను అంటున్నారు. ఇకనైనా వారు నాలాంటి వారు అభిమానించే హాస్య రస కంపెనీలో పూర్తి స్థాయి హాస్యాధికారిగా చేరి విరివిగా హాస్య రచనలు చేయాలని, తద్వారా ఏవో నాలుగు వెకిలి రాతలు రాసి గొప్ప హాస్యం రాశామని మురిసి పోయే వారి నోళ్ళు కుట్టెయ్యాలని నా కోరిక, విన్నపం.

జనార్దన మహర్షి మధుమోహం కూడా చాలా బాగుంది. ఈ తరం సినిమా రచయితల్లో హాస్యం జనార్దన మహర్షి బాగా రాస్తాడని జంధ్యాల గారు నాతో చెప్పిన విషయాన్ని చాలా రోజుల క్రితమే మహర్షికి చెప్పాను.

**-ఇలపావులూరి మురళీమోహనరావు,**
**హైదరాబాద్**

ఫిబ్రవరి 1-15 సంచికలో శ్రీ బ్రహ్మానందం గారి జన్మదిన శుభ సందర్భంగా ఆయనకోసం వేసిన ఆర్టికల్‌లో తెలియని ఎన్నో విషయాలను తెలుసుకున్నాం. శ్రీ బ్రహ్మానందంగారు ఇన్నాళ్ళు కేవలం సినీ హాస్య నటులని మాత్రమే మాకు తెలుసు. కానీ 'హాసం' రెండవ పేజీలో వేసిన బొమ్మను చూసాక ఆయన గారొక మంచి చిత్రకారుడని తెలుసుకున్నాము. ఆయన గారికి ప్రత్యేకంగా అభినందనలు తెలియజేయాలను కున్నాను. ఆయన అడ్రస్సు మీరు తెలియజేయ లేదు. ఇకపై ఏ కళాకారుని గురించైనా మీరు ప్రత్యేక వ్యాసం వేసినప్పుడు తప్పక అతని చిరునామా పత్రికలో తెలియజేయ మనవి. హాసంలో సినీ మాటల రచయితల కథలే వేస్తు న్నారు. దయచేసి బయట వారి హాస్య కథలను కూడా ప్రచురిస్తే బాగుంటుందేమో కాస్త ఆలోచించగలరు. హాస్య నాటికలు చిన్నవిగా ఉండేటట్టు చూడండి. హైదరాబాద్ నుంచి శ్రేష్టగారు పేరడీ పెరేడ్‌లో రాస్తున్న పాటలు తెగ నవ్విస్తున్నాయి. ఆవిడ గారికి సినీ గేయ రచయిత్రి అయ్యే అవకాశాలు మెండుగా వున్నాయి.

**-కోనేరు ఆదినారాయణరావు**
**తర్లాగడివూరు.**

**(9వ సంచికలో వేసిన 'గోపాలబాలా....' కథ సినీ రచయిత వ్రాసినది కాదు.... -ఎడిటర్)**

'హాసం' బాగుంటున్నది అన్న మాట కొత్తగా చెప్పవలసిన పనిలేదు. ఆంధ్రావని ఆదరిస్తున్న ఏకైక సంపద అది.

పాత సంచికలు కావాలి. మాకే కాదు, చాలా మంది అడుగుతున్నారు. మొదటి నుంచి కావాలంటే ఎంత పంపాలి? దేవులపల్లి (25-2-80) వర్ధంతి సందర్భంగా ఆయన పాటల గూర్చి వ్రాస్తారనుకున్నాం. మర్చిపోయారే?

అంటే అన్నామంటారుగాని, టి.వి.లో ఓ యాడ్ పడేస్తే మీ సొమ్మేం పోయిందండీ! మా ద్వారా తెల్సుకొన్న పుస్తకాభిలాషులు ఆశ్చర్యం, ఆనందమూ పడి పరువులిడితే కాపీల కొరత. ఆర్టీసి బస్‌స్టాండ్స్ సెంటర్స్ (మా వూరితో సహా)కు వస్తున్నది. ఎన్నో తెలీదు. రెండవ రోజు నుంచి కనబడితే ఒట్టు - కొత్తగా కొనుక్కొనే వారికి తెలిసే ఛాన్సు, దొరికే ఛాన్సులేదు. అన్నట్టు పాత సంచికలు విషయం వ్రాస్తారు కదూ!

**-ఆర్.వి.రాఘవ, అద్దంకి.**

**దేవులపల్లి వర్ధంతి ఈ పక్షంలో వస్తుంది. అనుబంధం చూడండి. పాత సంచికలు మా కార్యాలయంలో భద్రపరిచాము. చందా కట్టేవారు మొదటి సంచిక నుండి పంపమని కోరితో ఆ విధంగా పంపగలము. 'హాసం' పంపిణీ 'ఈనాడు' గ్రూప్‌కి చెందిన 'మార్గదర్శి మార్కెటింగ్' ద్వారానే. స్థానిక ఈనాడు ఏజెంటునడిగితే పేపరుతోబాటు వేస్తారు.**

**-ఎడిటర్**

మళ్ళీ ఎదురుచూడ్డం అనే సాంప్రదాయాన్ని తిరిగి మీ పత్రిక ద్వారా మాలాంటి పాఠకులకు కల్గించినందుకు, మీ పత్రిక్కి కృతజ్ఞతలు.

చిన్నప్పుడు నెలనెలా వచ్చే 'చందమామ' కోసం, ఆ తరువాత, ప్రతి ఆదివారం 'ఈనాడు' ఏ వచ్చే 'ఆదివారం ప్రత్యేక అనుబంధం' కోసం యింకొంచెం సాహిత్యంతో పరిచయమయ్యాక, 'జ్యోతి, యువ, విజయచిత్ర, విజయ'ల కోసం అలా అలా ఎదురుచూస్తుండే వాళ్లం. కొన్నాళ్లకి అవన్నీ ఆగిపోయాయి. కారణం తెలీలేదు. ఆత్మీయుల్ని పోగొట్టుకున్నట్లు బాధ అలా వెంటాడుతూనే వుంది. అలాంటి సమయంలో కిళ్లీ కొట్లో వేళ్లాడుతున్న 'రచన'ను చూసేసరికి, తప్పిపోయిన వాళ్లు మళ్లీ దొరికినట్లు ఆనందపడ్డాను. అలా పడుతూ పడుతూ వుంటే, రచనలోని మీ 'హాసం' కోసం ప్రకటనను చూసి 'అబ్బో ఏవిట్రా గొప్ప' అనుకున్నాను. చూసిన తరువాత అర్థమయ్యింది.

వెల్లివిరిసిన తెలుగు సాహితీ సాంప్రదాయాన్ని
మరింత సుసంపన్నం చేయడాన్కి
కంకణధారులయిన కథానాయకులు ఈ
'రచన' 'హాసం'లని.

**-బి.గురునాధరావు, విశాఖపట్నం.**

మీరు వెలువరిస్తున్న 'హాసం' పత్రిక ఎంతో సమున్నతంగా యున్నది. ఇన్నాళ్ళకి సంగీత సాహిత్య హాస్యాల గురించి ఒక అద్భుతమైన మేళవింపు గల పత్రిక మన తెలుగు లోగిళ్ళలోకి రావడం ముదావహం.

ఫిబ్రవరి 1-15 పత్రికలో సద్గురు శ్రీ త్యాగరాజు వారి ఆరాధనోత్సవం 'మాఘ బహుళ పంచమి' అని అచ్చుయింది. కానీ అది "పుష్య బహుళ పంచమి" మరియు ఘంటసాల వారు కైవల్యం చెందినది ఫిబ్రవరి 11వ తేదీ 1974 న ఇటువంటి చిన్నతప్పులు దొర్లకుండా ఇంకొద్దిగా జాగరూకతతో మెలిగినా, మేమంతా సంతోషిస్తాము.

**-అక్కినేపల్లి శ్రీనివాసరావు, నల్లగొండ**

**మీరు కరెక్టు - భవిష్యత్తులో ఇంకా జాగ్రత్తగా ఉంటాం. -ఎడిటర్**

సంపుటి :1 సంచిక: 10

16-28 ఫిబ్రవరి 2002

పేజీలు: 76

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 10

గత పక్షంలో నల్గొండలో ఒక అరుదైన సమావేశం జరిగింది. ఒక పత్రికను అభిమానించిన పాఠకులు తమంతట తాము ముందుకొచ్చి ఒక సభను ఏర్పాటు చేసి ఆ పత్రిక సంపాదక వర్గాన్ని ఆహ్వానించి సమాదరించారు. ఒక ప్రొడక్టును అమ్మచూపడానికి విక్రేతలు అనేకరకాల క్యాంపులు, కాంపెయిన్లు పెట్టడం పరిపాటి. ఇబ్బడిముబ్బడిగా వస్తువులు ఉత్పత్తి అవుతున్న ఈ రోజుల్లో అది తప్పనిసరి కూడా. కానీ వస్తువినియోగదారులు ఒకచోట చేరి ఆ వస్తువుయెక్క ఉత్పాదనను, ఉత్పత్తిదారులను శ్లాఘించడం సాధారణంగా జరగని విషయం.

'హాసం' పత్రికకు ఆ అరుదైన సత్కారం లభించింది . ఫిబ్రవరి 9న నల్లగొండలో 'హాసం' పాఠకులు సమావేశమై 'హాసం' సంపాదక వర్గాన్ని ఆహ్వానించి వారితో తమ అనుభూతులను పంచుకున్నారు. ప్రశ్నోత్తరాల రూపంలో సంగీతానికి సంబంధించిన సమాచారాన్ని అడిగి తెలుసుకున్నారు. వాటి వివరాలు వచ్చే సంచికలో చూడవచ్చును. ఇది స్వోత్కర్షగా భావించి, కొట్టి పారేసేవారు కూడా ఈ సందర్భంలో ఆలోచించవలసిన విషయం ఒకటున్నది - 'హాసం' పత్రికకు ఎందుకింత మన్నన, గౌరవం లభిస్తోంది? పాఠకులకు ఇంత ఆదరం ఎందుకు కలుగుతోంది?

మొదటి ప్రశ్నకు ముందుగా సమాధానం చెప్పకోవాలి. నేటి సమాజంలోని దుర్భర పరిస్థితులు ప్రతీ వారినీ ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. బడ్జెట్ వస్తోందంటే భయం, విద్యుత్ ఛార్జీలు సమీక్షిస్తున్నారంటే భయం, మిగులు సిబ్బంది తొలగింపు గురించి ఆలోచిస్తున్నారంటే భయం, ఉగ్రవాదులపై చర్యలు తీసుకుంటున్నారని అంటే భయం. ఈ భయాందోళనల నుండి కాస్సేపు ఊరట పొందడానికి, సేద దీరడానికి 'హాసం' ఉడతాభక్తిగా సహాయ పడుతోంది. హాస్య రచనల ద్వారా ఆహ్లాదం కలిగించడమే కాక, అన్నితరాల వారూ 'ఐడెంటిఫై' చేసుకోగల సినీ గీతాల గురించి చర్చింది జ్ఞాపకాల పొరల్లోంచి మధురానుభవాలను గుర్తుకు తెస్తోంది 'హాసం'. అందుకే పాఠకులకు ఇంత ఆదరం. నిన్నటి పేపరు ఇవాళ చూడడానికి మనసొప్పని ఈ 'ఫాస్ట్' యుగంలో 'హాసం' పాత సంచికలకై వస్తున్న డిమాండ్ చూస్తూంటే ఆశ్చర్యం కలుగుతోంది. ఈ పత్రిక ఉనికిని గురించి ఆలస్యంగా తెలుసుకున్న వారు 'మా చందా మొదటి సంచిక నుండి లెక్కలోకి తీసుకొనవలసినది' అని కోరుతూ రాస్తున్నారు. ఊళ్లో ఉన్నవారైతే ఆలస్యాన్ని భరించలేక 'పోస్టులో పంపకండి, ఆఫీసుకి స్వయంగా వచ్చి తీసుకుంటాం' అంటారు.

ఇక మన్నన విషయానికొస్తే 'హాసం' కుటుంబంలోని, సమాజంలోని అందరూ కలిసి ఆస్వాదించదగ్గ, ఆలోచించదగ్గ, చర్చించదగ్గ పత్రికగా రూపొందింది. కొన్ని పత్రికలు ఎంత బాగున్నా వ్యక్తిగత ఆనందానికే అవి పరిమితం. సామూహికంగా అందులోని విషయాల గురించి సమీక్షించడం ఇబ్బందికరం. 'హాసం'లో విషయాలు సంగీతం గురించి, దాన్ని సృష్టించిన మహానుభావుల గురించి కాబట్టి వాటి గురించి పదిమందిలోనూ అడిగే సందేహాలు తీర్చుకొనే అవకాశం ఉంది. అదేవిధంగా హాస్య రచయితల గురించి కూడా.

ఈ ఒరవడి ఇలాగే కొనసాగితే 'హాసం' పత్రికకే కాదు. ఆరోగ్యకరమైన ధోరణులు అవలంభిస్తున్న పత్రికలన్నిటికీ మేలు జరిగినట్లే. తద్వారా సమాజానికి ఎంతో కొంత మేలు తప్పక జరుగుతుందని మాకు గట్టి నమ్మకం.



# నా కథా-గాథా

అసలు పేరు కొమ్మినేని అప్పారావు, కీ॥శే॥ కొమ్మినేని బసవయ్య, అన్నపూర్ణమ్మలకు ముగ్గురు సంతానం. హైమవతీదేవి, అప్పారావు, శేషగిరిరావు. పుట్టిన వూరు పొన్నెకల్లు. గుంటూరు పట్టణానికి తొమ్మిది మైళ్ళ దూరం. చదువు స్వగ్రామంలోనూ తాడికొండలోనూ, గుంటూరులోనూ. బి.ఏ. ఎకనామిక్స్ హిందీ విశారద, టైపురైటింగ్ హయ్యర్.

కూనిరాగాలతో ప్రారంభమైన సంగీతంపట్ల శ్రద్ధ కీ॥శే॥ ఘంటసాలగారి కుంతీకుమారి పద్యాలతో పెరిగింది. తెలుగు దేశానికి లలిత సంగీతం అంటే అర్థం చెప్పిన ఘంటసాల గీతాలను ఫాలో అయినాను.

ఏదో కొద్దిగా కీ॥శే॥ మహావాది వెంకటప్పయ్య గారి శిష్యరికం చేసినా సంగీతం పెద్దగా అబ్బలేదు. చదువుకూ, సంగీతానికి సామ్యం కుదరలేదు. అయితే మేల్కొని వున్నంతసేపు పాడుకోవడమే. అదే నాకు ధ్యాసగా అయిపోయింది.

గుంటూరులో వినోద్ ఆర్కెస్ట్రా స్థాపించి చాలా కచ్చేరీలు చేశాను. అయితే కచేరీలో ఎప్పుడూ సినిమా పాటలు పాడలేదు. భక్తిగీతాలైతే సినిమా పాటైనా పాడేవాణ్ణి. నేను స్వయంగా వరసకట్టిన పాటలనే ఎక్కువగా పాడుతుండేవాణ్ణి.

అలా నా కచేరీ ఒకటి విన్న గ్రామఫోను కంపెనీ మంగపతిగారు నన్ను ప్రయివేటు రికార్డు పాడటానికి మద్రాసు రప్పించారు. ఆ పాట విన్న ప్రసిద్ధ సంగీత దర్శక సోదరులు శ్రీ రాజన్- శ్రీ నాగేంద్రలు నాకు విఠలాచారిగారి చిత్రంలో పాడటానికి అవకాశం

చక్రవర్తి మంచి చమత్కారి. ఆడతాడు, పాడతాడు, ఆడిస్తాడు, పాడిస్తాడు. లయ చెప్పినట్లు వింటుంది. సాహిత్యంలో కూడా తాతకు దగ్గులు నేర్పుతాడు.

-కొసరాజు

# చక్కోరవర్తి



"ఏమి రూప మది... టింవ్ టింవ్ టింవ్
టింవ్ టింవ్ టింవ్
ఇంద్ర చాప మది... కి కిం కి కిం
ఏమి కోప మది... టకింగ్ ఛకింగ్ టకింగ్ ఛకింగ్"

1973లో ఓ రాత్రి మొదటాట వదిలిన తర్వాత పక్కనే ఉన్న పల్లెటూరులో హుషారుగా అంగలు వేసుకుంటూ బోతున్న ఓ నాయుడి కుర్రాడి ఆలాపన అది. ఈ పాటికి గ్రహించే ఉంటారు - ఆ పాట 'శారద' చిత్రంలోని టైటిల్ సాంగని.

ఇక్కడ చెప్పాల్సింది - టింవ్ టింవ్ అంటే సితార్ అని, కి కిం అంటే వయొలిన్ అని, టకింగ్ ఛకింగ్ అంటే డ్రమ్స్ అని తెలుసుకోలేని ఆ అమాయక ప్రాణి ఆయా శబ్దాలకు ఇచ్చుకున్న అక్షర రూపాన్ని గురించి కాదు. అతగాడి మనసులో అంతగా ముద్రించుకునేట్టు ఆ వాద్య పరికరాల్ని ఉపయోగించి, ఆ మాటలతో అ విధిగా గుర్తొచ్చేట్టు ఆ పాటని మలచిన సంగీత దర్శకుని మేధాశక్తి గురించి మాత్రం ఖచ్చితంగా పేర్కొనాలి.

1968 ప్రాంతాలలో వచ్చిన 'భలే గూఢచారి' అనే సినిమాకి సంగీత దర్శకుడి పేరు 'చక్రవర్తి' అని చూసి ఏ బెంగాలీ వాడో, హిందీ వాడో అనుకున్నారు కొంతమంది. సినీ సంగీతం మీద గురి ఉన్న వారికి 'కళ్యాణి' రాగం మీద మక్కువ ఎక్కువగా ఉంటుంది సర్వ సాధారణంగా ! ఆ చిత్రంలో 'లోకులంతా చూస్తారురా నా రాజా' అన్న పాట ఆ రాగంలోనే మలచబడడం విని 'బాగానే కట్టేడే ఇతనెవరో గాని' అని కూడా అనుకున్నారు.

అంతకు ముందే ఎం.ఎస్. రెడ్డిగారి డబ్బింగ్ చిత్రం 'కన్నె పిల్ల', కీ॥శే॥ పహిల్వాన్ కాంతారావుగారి డబ్బింగ్ చిత్రం 'సర్వర్ సుందరం'లలో నాగేష్ నటనకి, జోకులకి జోహార్లర్పించేసి, ఆకాశానికెత్తేసేరు ప్రేక్షక జనం! దానికి కారణం ఆ నటునినోట వినిపించిన 'కంఠ స్వరబలం' మాత్రమేనని తర్వాత ఆయా నిర్మాతలు ఆ కంఠం లేకుండా సమర్పించిన 'కొంటెపిల్ల', 'నువ్వే' చిత్రాల అపజయాలు ఋజువు చేశాయి. ఆ కంఠం ఎవరిదా అన్న ప్రశ్నకు కె. అప్పారావు అని సమాధానం వచ్చింది...

ఇలా ఉంటుండగా 'మూగప్రేమ' రిలీజయింది. అందులోని 'కళావతి' రాగంలో ఉత్తరాది కళలు సంతరించుకున్న ' ఈ సంజెలో కెంజాయలో' పాట 'మాది ప్రత్యేకమైన అభిరుచి' అని గీర్వాణంపోయే వారిని సైతం ఒక్క క్షణంపాటు "ఎవరీ చక్రవర్తి" అని ఆలోచించుకునేట్టు చేసింది. ఇంతలో 'తల్లీ కూతుళ్ళు' లో రాజబాబుకున్న రెండు పాటలు - 'రామా హరి రామ రామాహరి' , 'చిట్టిపొట్టి బేబి' విని (అప్పటికి ఎస్పీ బాలు రాజబాబుని స్పెషలైజ్ చెయ్యలేదు) రాజబాబుకి సరిపోయిందే అనుకొని, పాటల పుస్తకంలో 'చక్రవర్తి' అని చూసి 'ఒహో' అనుకొని, గొంతును బట్టి నాగేష్ గుర్తుకురాగా మళ్ళీ వాకబుచేస్తే "చక్రవర్తే అప్పారావు. అప్పారావే చక్రవర్తి" అని తేలింది.

అలా జనహృదయాలలో చోటు చేసుకున్న చక్రవర్తి 'ఇదాలోకం'లోని 'నీ మనసు నా మనసు ఏకమై', 'గుడిలోన నా సామి', 'నిత్య సుమంగళి నీవమ్మా' పాటలతోనూ 'శారద'లోని పాటలన్నిటితోనూ గూడుకట్టేసుకున్నాడు. జేబుదొంగ, బలిపీఠం, చీకటి వెలుగులు, జ్యోతి, నా పేరే భగవాన్, బాబు, కల్పన, ఆమెకథ, జీవితంలో వసంతం, జీవనతీరాలు, యమగోల, మల్లెపూవు, ప్రేమాభిషేకం, అమరజీవి, చంటబ్బాయ్ చిత్రాలు చక్రవర్తిని తిరుగులేని సంగీత దర్శకుడిగా వినువీధులలోనే కాదు ప్రేక్షకుల 'వీను వీధుల'లో నిలబెట్టేయి.

చక్రవర్తికున్న రాగాభిరుచికి - 'మోహన' రాగంలో 'నీ మనసు నా మనసు ఏకమై', 'మాల్‌కోస్'లో 'రాధా అందించు నీ లేత పెదవి', 'భీంప్లాస్'లో 'శ్రీమతి గారికి తీరనివేళ', 'కుశలమా నీకు కుశలమేనా', 'మేళ తాళాలతో వేదమంత్రాలతో', పాటలు జయజయావంతి,

కల్పించారు. వారికి, శ్రీ విఠలాచారికీ నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. ఆ తర్వాత చిత్ర పరిశ్రమలో నేను వివిధ శాఖలలో చాలా పనిచేశాను. అది అందరికీ తెలిసిందే. అయితే అప్పారావు చక్రవర్తి కావడం - నిర్మాత కె. ఛటర్జీ గారి సాహసం. నేను దర్శక శాఖలో స్థిరపడే అవకాశం వచ్చినప్పుడు ఆయన వారించారు. నేను సంగీత దర్శకుడిని కావాలని ఆయన ఆదేశించారు. అప్పట్లోనే కాదు యిప్పటికీ నామీద నాకున్న నమ్మకంకంటే, నామీద ఆయనకున్న నమ్మకం ఎక్కువ. చిత్ర పరిశ్రమ, విశాలాంధ్రులు నాకిచ్చిన ప్రోత్సాహం, అభిమానం తలుచుకుంటే - నాకు అనిపిస్తుంది, నేను కాదు - ఇది ఛటర్జీ. నా సాధన కాదు - ఛటర్జీ ఆత్మ విశ్వాసం. ఆ సర్వేశ్వరుడు ఆ ఛటర్జీ గారి ద్వారా చిత్ర పరిశ్రమలో ఈ మాత్రం స్థానం కల్పించాడు.

ఒకసారి ఎవరో అన్నారు - 'నీ కేమయ్యా సంగీత చక్రవర్తివి?' అని. అప్పుడు నే నన్నాను- 'పొరపాటు. నేను సంగీత చక్రవర్తిని కాదు, సంగీతం చక్రవర్తిని' అని ఎందుకంటే నాకు నిజం చెప్పే దురలవాటు కొంచెం ఎక్కువ. నాకు నిజంగా సరిగమల సంగీతం రాదు. భగవంతుడు నా నోట పలికించేదే నా సంగీతం, నేను చిన్నవాణ్ణి. ఇంతవరకూ నేను సాధించిందేమీ లేదని నా విశ్వాసం. ఇంకా ఏదో చెయ్యాలనే తపన, ఆశ ఎంతో వుంది. భగవంతుడి కృప, చిత్ర పరిశ్రమ ప్రోత్సాహం, ఆంధ్రుల అభిమానంతో ముందుకు సాగుతాననే నమ్మకం వుంది.

**- చక్రవర్తి**

**(1978లో ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్‌ల భవన నిర్మాణ సహాయార్థం జరిపిన చక్రవర్తి నైట్ సందర్భంగా ప్రచురించిన సావనీర్‌లోని వ్యాసమిది)**



చక్రవర్తిని అతని పుట్టిన రోజున "పాపాత్ముడు" అన్నాను నేను- సమాసం తప్పయినా సామ్యం ఒప్పుతుంది కనక!. పాపలాంటి ఆత్మకలవాడు!

**-ఆత్రేయ**

కామవర్ధిని, కానడరాగాలలో 'కెరటానికి ఆరాటం', పాట కానడ, శహనా రాగాలలో 'ఏ రాగమని పాడను', మాల్‌కోస్, జయజయావంతి, చారుకేశి, సారంగ రాగాలలో 'ఆడవే అందాల సురభామిని', యమన్ కలిసిన 'కళ్యాణి' రాగంలో 'మన్నించు మా ప్రియా', 'ఓ చంద్రమా ఒకనాటి ప్రియతమా', 'చిన్నమాట ఒక చిన్న మాట', 'మరుమల్లెకన్నా తెల్లనిది' పాటలు 'మెచ్చుతునకలు'గా ఉండిపోతాయి.

'నాగులేటి వాగులోన', 'గుడిలోన నాసామి', 'కలిసి పాడుదాం తెలుగు పాట', 'చూశానుపొద్దంతా', 'సిరిమల్లెపువ్వల్లే నవ్వు', 'దిక్కులు చూడకు రామయ్యా', 'పువ్వుల నడుగు గువ్వల నడుగు', 'ఓరయ్యో చంద్రయ్య కొడకా', 'ఓలమ్మి తిక్కరేగిందా', 'వయసు ముసురుకొస్తున్నది వాన మబ్బులా', 'రావయ్య ఓ తెలుగు బావ', 'రాయిరా దేవుడు, తాగినా ఊగడు', 'నీలాల నింగిలో మేఘాల తేరులో', 'ఎవరీ చక్కని వాడు', 'ఓహో లలితా నా ప్రేమ కవితా', 'చకచకలాడే చక్కని బుల్లెమ్మా', ' ఎవరికి తెలుసు చితికిన మనసు', పాటలు ఎఫెక్ట్ కోసం రాగపరిమితిని దాటి రక్తి కట్టించే చక్రవర్తికున్న 'రసపట్టుదల'కి తార్కాణాలుగా నిలచిపోతాయి.

కేవలం భక్తి పాటలకు మాత్రమే వాడే 'భూపాల' రాగాన్ని 'తిరుపతి'లో 'పోయిరారా తిరుపతి' లాంటి హాస్యగీతానికి, విషాద సన్నివేశాలకు వాడే శివరంజని, శుభపంతువరాళి రాగాల్ని శృంగార గీతాలైన 'చలిచలిగా ఉందిరా హోయ్‌రామా', ' నా స్నేహంపండి... చెలియా కనరావా' పాటలకుపయోగించడం, యువ్వనంకాటేసింది, బొమ్మరిల్లు, ప్రేమపూజారి మరియు మరో అహల్య సినిమాలలో పేర్లు చూపుతున్నప్పుడు వినిపించిన రాగమాలికాలాపనలు, 'ఆమెకథ'లో ప్రభ పెట్టెసర్దుకుంటున్నప్పుడు వినిపించిన 'స్వరనేపథ్యం', 'సిరిమల్లె పువ్వల్లె నవ్వు' పాటలో జానకి చేత పలికించిన 'స్వరహాసాలు', చక్రవర్తి సినీ సంగీత చరిత్రలో చేసిన ప్రయోగాలుగా చెప్పుకోవచ్చు.

ఇదివరలో ఒక్క మాస్టర్ వేణు తప్ప అన్యులెవ్వరూ అంటని అరుదైన 'చారుకేశి' రాగాన్ని విరివిగా ఉపయోగించి ఆ ఆలాపనలో ఏ వరస విన్నా 'మ్యూజిక్ చక్రవర్తే' అనిపించేటంతగా ఆ రాగాన్ని పాపులర్ చేసిన ఘనత చక్రవర్తిదే అనడానికి దన్నుగా - 'ఏటి ఒడ్డున నిలుచుంటే', 'నడిరేయి అవుతూ ఉన్నా నిదురేలరాదు నీకు', పాటలు 'మదనుని పిలుపే నా నాట్యమూ' అనే చరణం నిలబడతాయి.

ఓ వైపు సంగీతాన్నిస్తూనే, 'తల్లీకూతుళ్లు'లో ముందు ఉదహరించిన రెండు గీతాలూ, 'తిరపతి'లో 'ఆడవాళ్ళే ఆడాలోయ్', 'పోయిరారా తిరపతి', 'జీవన తీరాలు'లో మకుట గీతం, 'అల్లరిబుల్లోడు'లో 'లేచిందిరా గొడుగు', 'మల్లెపువ్వు'లో 'రాందాను మాలీము', 'బొమ్మరిల్లు'లో 'చల్లని రామయ్యా', 'అతనికంటె ఘనుడు'లో 'చెప్పింది చేస్తా', 'శారద'లో 'అటో ఇటో తేలిపోతుంది' పాటలు పాడేరు.

ఒక పక్క సంగీతాన్నిస్తూ, పాటలు పాడుతూ : వేరొక పక్క 'ఊర్వశి'లో 'సంజీవ్‌కుమార్'కి , 'కల్పన'లో వరప్రసాద్‌కి, 'మన్మథలీల', 'ప్రేమ పూజారి'లలో కమలహాసన్‌కి, 'ప్రేమలేఖలు'లో అనంత నాగ్‌కి, 'ఆమెకథ'లో రజనీకాంత్‌కి 'సీతారామకళ్యాణం'లో రాముడిగా వేసిన రవికి 'మనీ'లో పరేష్‌రావల్‌కి గాత్రదానం చేసి 'గోపాలరావుగారి అమ్మాయి'లో చెవిటి లాయరుగా, 'పక్కింటి అమ్మాయి'లో తమిళ సంగీతం మేష్టారుగా, 'ఆమెకథ'లో ఇన్సూరెన్సు ఏజెంటుగా, 'అల్లరి బుల్లోడు'లో రేషన్ ఆఫీసరుగా, 'సీతాపతి సంసారం'లో తిండిపోతు ఆఫీసర్‌గా, 'అతనికంటె ఘనుడు'లో మోటారుషాపు యజమానిగా పాత్రధారణచేసి, ఇటీవల టీవీ ద్వారా మళ్ళీ మరింత చేరువైన చక్రవర్తి అంతలోనే అందనంత దూరానికి వెళ్లిపోతారని ఎవరూహించగలిగారు? ఆ బహుముఖ ప్రజ్ఞాశాలికి, ఆ అజాత శత్రువుకు ఇంతత్వరలో నివాళి అర్పించవలసి వస్తుందని ఎవరు అనుకున్నారు?

**-రాజా**

## రాగానురాగాలు



మద్రాసులో ఎప్పుడూ వుండే బిజీ వాతావరణం నుండి, రొటీన్ వర్క్‌నుండి తప్పించుకుందామని సంగీత శాఖకు సంబంధించిన కొందరు ప్రముఖులు పిక్నిక్‌లాగా వెళ్ళేరు. ఆటలు, పాటలు చెరువులో ఈతలు, కేరింతలు అంతా ఒకటే ఆనందం. రోజుకి ఎక్కువ గంటలు కష్టపడే చక్రవర్తి షటిల్‌కాక్ ఆడి ఆడి అలసిపోయి నిద్రలోకి జారుకున్నారు. భోజనాల వేళ అయింది. సంగీత దర్శకుడు కె.వి. మహదేవన్ "బాలూ! చక్రవర్తి ఎక్కడ నాయనా" అంటూ వెతికి ఆయన నిద్రపోతూండటం చూసి, "పాపం చక్రవర్తి భోంచెయ్యకుండా పడుకున్నాడ్రా" అంటూ మజ్జిగ అన్నం కలుపుకొని తీసుకొని వెళ్ళి "నాయనా... చక్రవర్తీ! కాస్త తినరా" అంటూ లేపి తినిపించి మళ్ళీ పడుకోబెట్టివచ్చారు.

తన పాట మననోట
పలికించ గలిగినవాళ్ళు
శ్లాఘనీయులు. చక్రవర్తి
ఆ కోవలో చేరాడు.
-ఆరుద్ర



## ప్రేమాభిషేకంలోని 4 పాటలు
## ఒక్కరాత్రిలో...

"నాకు మూడ్ అంటూ రావాలే గానీ పాటకు అయిదు నిమిషాలు చాలు" అన్నారు సంగీత దర్శకుడు, నటుడు చక్రవర్తి.

"మ్యూజిక్ కోసం ఊటీలకు, కాశ్మీర్‌లకు వెళ్ళడంలో నాకు నమ్మకం లేదు. ఫ్లాష్ అంటూ రావాలే గాని అదెక్కడయినా ఒక్కటే. మూడ్ రానప్పుడు అర్నెల్లు కూచున్నా అంతే. ఇవాళ అందరూ మెచ్చుకుంటున్న 'ప్రేమాభిషేకం'లోని పాటలలో నాల్గింటిని ఒక్కరాత్రిలో కంపోజ్ చేశాను".

"ఆరోజు నాకు బాగా జ్ఞాపకం" అంటూ జ్ఞాపకాల తెరలు కనులముందు కదలాడుతుండగా కొనసాగించారు చక్రవర్తి. "సుమారు రాత్రి పదకొండు గంటలకు అన్నపూర్ణ స్టూడియోస్‌లో టెలిఫోన్ రూమ్‌పక్క రూమ్‌లో పాటల కంపోజింగ్ మొదలయింది. నాగేశ్వరరావుగారు, అన్నపూర్ణ గారు చలినాపుకుంటూ టీలుతాగుతూ పాటల కంపోజింగ్ అయ్యేవరకు అలాగే ఉన్నారు. అలా నాలుగు పాటలు పూర్తయ్యాయి. అవి - తారలు దిగివచ్చిన వేళ, వందనం అభివందనం, కోటప్ప కొండకు వస్తానని మొక్కుకున్నా, నా కళ్ళు చెబుతున్నాయి నిను ప్రేమించానని. అందరి తృప్తి మేరకు అవి పూర్తయ్యేసరికి తెల్లవారుఝాము మూడున్నర అయింది. చెబితే నమ్మరు కాని మెదడంతా జివ్వుజివ్వున లాగుతున్న ఫీలింగు. అలాగే ఉదయం ఫ్లయిట్‌లో మద్రాసు బయల్దేరి వెళ్ళిపోయాను 9 గంటలకి అక్కడ మరో రికార్డింగ్ ఉందని" అని చెప్పారు.

## దర్శకుడు కాబోయి...

సంగీత దర్శకుడు చక్రవర్తి ఒకప్పుడు డబ్బింగ్ వర్క్‌తో పాటు సహాయ దర్శకత్వం కూడా చేసేవారు. ఒకసారి సత్తెనపల్లి నుంచి కొందరు మిత్రులు డబ్బుతోనహా మద్రాసువచ్చి ఒక చిత్రాన్ని తీసి పెట్టమని అడిగారు చక్రవర్తిని. మర్నాడే చటర్జీగారు 'మూగ ప్రేమ' చిత్రానికి నువ్వే సంగీత దర్శకుడివి అన్నారాయన్ని. ఆ రోజు రాత్రి చక్రవర్తి విపరీతంగా మధనపడ్డారు. అప్పుడు ఆయన భార్య శ్రీమతి రోహిణీదేవి 'కరణేషు మంత్రి...' అనే సూక్తిని నిజం చేస్తూ "దర్శకుడిగా ఒక చిత్రం ఫెయిలయితే మరో చిత్రం రావటం కష్టం. సంగీత దర్శకుడిగా ఒక పాట పోయినా ఇంకో పాటతో ఆకట్టుకోవడానికి అవకాశం ఉంటుంది. ఒక్కో చిత్రంలో కనీసం నాలుగు పాటలైనా ఉంటాయి కాబట్టి సంగీత దర్శకుడిగానే మంచి భవిష్యత్తు ఉంటుంది" అనే దివ్యమైన సలహా ఇచ్చారు. చక్రవర్తికి ఆ సూచన బ్రహ్మాండంగా ఉందనిపించింది. అంతే సంగీత దర్శకుడయిపోయారు మర్నాటినుంచీ. అయితే ఆయనతో ఆ రోజు చిత్రం తీద్దామనుకునే ఆ సత్తెనపల్లి మిత్రులు ఇప్పటికీ చిత్రం తియ్యలేదు - ఎప్పటికైనా చక్రవర్తే దర్శకత్వం చెయ్యాలంటూ!.

## చక్రవర్తి స్వరపరిచిన నాటకం-నాటిక

కొన్నాళ్ళ క్రితం హైదరాబాద్ 'సాంగ్ అండ్ డ్రామా' డివిజన్ వారు 'కబీర్' నాటకాన్ని తయారుచేశారు. ఈ నాటకం కోసం ఒక్కపాటను తప్ప తక్కిన పాటలన్నిటినీ వేటూరి సుందరరామమూర్తి రాశారు. ఆ నాటకంలో మొత్తం పాటలన్నిటినీ స్వరపరిచింది చక్రవర్తే! అంతకు ముందు సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌వారు సమర్పించిన 'భాగ్యనగర్' నాటికకు కూడా చక్రవర్తే సంగీతాన్ని సమకూర్చారు.

## చిన్న ముక్క



సంగీత దర్శకుడు చక్రవర్తి 'మల్లెపువ్వు' చిత్రానికి స్వరరచన చేస్తున్నప్పటిమాట. ఆ చిత్రంలో 'చిన్నమాట ఒక చిన్న మాట' అనే పాట పుట్టడానికి ముందు మాట! వేటూరి పాట రాయటం... చక్రవర్తి స్వరకల్పన చేయటం... అలా పన్నెండు రోజుల పాటు సుమారు పదిహేను పాటల దాకా ప్రయత్నించారిద్దరూ. ఏ ఒక్కటీ సన్నివేశపరంగా సంతృప్తిని కలిగించలేదిద్దరికీ. "ఛస్! చిన్న ముక్క కూడా రావటం లేదు" అని బాధపడ్డారు వేటూరి. "అదే ఆ ముక్కని పేపరు మీద పెట్టు" అన్నారు చక్రవర్తి. వేటూరి పేపరు మీద "చిన్న ముక్క చిన్న ముక్క" అని రాసేరు. ఓ నిముషం తేరిపార చూసుకున్నారిద్దరూ. వెంటనే వేటూరి దాన్ని మార్చి "చిన్న మాట ఒక చిన్న మాట" అన్నారు. అంతే! గంటలో మొత్తం పాట తయారయింది.



## తప్పని అలవాటు

సంగీత దర్శకుడు చక్రవర్తి కొన్ని సంవత్సరాలుగా ఒక అలవాటుని పాటించేవారు. అది - ప్రతీ సంవత్సరం జనవరి ఒకటవ తేదీన బాలసుబ్రహ్మణ్యం, సుశీల పాడగా ఒక యుగళ గీతాన్ని రికార్డు చేయటం. ఇది ఇంచుమించుగా ఆయన సంగీత దర్శకుడుగా తన జీవితాన్ని ప్రారంభించినది మొదలుగా ఆ అలవాటుని అవలంబిస్తూ వచ్చారు. బాలసుబ్రహ్మణ్యం, సుశీల కూడా తమ డైరీలలో జనవరి ఒకటవ తేదీన చక్రవర్తి రికార్డింగు అని రాసేసుకుంటూ ఉండేవారు - వాళ్ళకి చివరి నిముషం వరకు కబురు చెయ్యకపోయినా! ఒకసారి మాత్రం చక్రవర్తికి చిన్న చిక్కొచ్చి పడింది. శ్రీమతి సుశీల దగ్గర అదే రోజుకి ఎమ్మెస్ విశ్వనాథం డేట్ తీసుకున్నారు. చక్రవర్తి, ఎమ్మెస్ విశ్వనాథం రికార్డింగులు గమనిస్తే చక్రవర్తి రికార్డింగులు కొంచెం త్వరగా అయిపోతాయి. ఆ సంగతి శ్రీమతి సుశీల చక్రవర్తితో చెప్పి 'మీ రికార్డింగు కొంచెం ముందుగా అయ్యేట్టు చూడగలరా' అని అడిగారు. చక్రవర్తి సరే అన్నారు. డిసెంబరు ముప్పయి ఒకటి అనగానే పాత సంవత్సరానికి వీడ్కోలు చెప్పి, కొత్త సంవత్సరానికి స్వాగతం చెబుతారు కనుక చాలా హడావుడిగా ఉంటుంది ఆ రోజు. ఫిలిం ఇండస్ట్రీలో అయితే ఇంకా ఎక్కువగా ఉండుంది. అదీగాక చక్రవర్తి బిజీ సంగీత దర్శకుడు కాబట్టి మొహమాటాలు ఇంకా ఎక్కువ మోతాదులోనే ఉంటాయి. ఉదయాన్నే రికార్డింగు అయిపోవాలంటే మ్యూజిక్‌కి సంబంధించిన బిట్‌లు అవీ అన్నీ గాయనీ గాయకులు రాకముందే సిద్ధంచేసుకొని ఉండాలి. రాత్రి పన్నెండు ఒంటిగంటవరకు పార్టీలో పాల్గొని, తిరిగి విజయా గార్డెన్స్‌కి వచ్చి నిద్రపోకుండా ఉదయం ఎనిమిదిన్నరకల్లా సుశీల, బాలు పాడవలసిన పాట మొత్తం బిట్‌లతో సహా పూర్తి చేసేసి అనుకున్న ప్రకారం జనవరి ఒకటవ తేదీనే వారిచేత పాడించి రికార్డు చేసి, ఆమెను ఎమ్మెస్ విశ్వనాథం రికార్డింగ్ కోసం కరెక్ట్ టైమ్‌కి పంపించారు చక్రవర్తి.

## సొంత బారసాల

చక్రవర్తి సంగీత దర్శకుడు కాక ముందు డబ్బింగ్ చిత్రాల్లో గాత్ర ధారణ చేస్తూ ఉండేవారు. అప్పుడు ఆయన పేరు అప్పారావు. సావిత్రి మాతాపిక్చర్స్ పేరిట 'చిన్నారి పాపలు' చిత్రం నిర్మిస్తున్న రోజులవి! విరామ సమయంలో బైటికొచ్చిన సావిత్రి లోపల రికార్డింగు జరుగుతుండగా 'ఎవరిది రికార్డింగు?' అని అడిగింది - అటువైపు వెళ్తున్న అప్పారావుని చూసి. 'చక్రవర్తిది' అన్నాడాయన ముఖంలో ఏ ఎక్స్‌ప్రెషనూ లేకుండా. ఎవరో చూద్దాం అనుకొని లోనికి వెళ్ళిన సావిత్రికి సూచనలిస్తున్న అప్పారావు కనిపించాడు. ఆశ్చర్యపోతున్న సావిత్రితో 'నేనే చక్రవర్తిని' అన్నాడు అప్పారావు. 'అదిసరే పేరెందుకు మార్చుకొన్నావు' అని అడిగిందామె.



'ఏంలేదు ఇదే నామొదటి సినిమా! ఇదే ఆఖరి సినిమా అయిపోతుందేమో, తర్వాత ప్రజలు సన్మానాలు చేసి బిరుదులు ఇవ్వరేమోనని ఇప్పుడే చక్రవర్తి అన్న పేరు పెట్టేసుకున్నాను' అన్నాడు చక్రవర్తి చలోక్తిగా.

## స్వర కిరీటికి కిరీటం

సంగీత దర్శకుడు చక్రవర్తి తను సంగీతం ఇచ్చే చిత్రాల రికార్డింగులు, రీరికార్డింగులు అన్నీ విజయా డీలక్స్ రికార్డింగ్ థియేటర్లోనే చేస్తూ ఉండేవారు. కొన్ని సంవత్సరాలుగా చక్రవర్తి విజయా రికార్డింగ్ థియేటర్నే ఎన్నుకుంటున్నందుకు కృతజ్ఞతాసూచకంగా, స్నేహపూర్వకంగా విజయా సంస్థ అధినేత బి. నాగిరెడ్డి చక్రవర్తికోసం ప్రత్యేకంగా ఆ ఆవరణలోనే మరో కొత్తరూమ్ నిర్మించారు ఆరోజుల్లో.

చక్రవర్తి నిండుకొలను
లాంటివాడు. చవిటి
పర్రల్లో
హరితశాద్వలాల్లో
కొండకోనల్లో యథేచ్ఛగా
ఒరుసుకుంటూ, తన
ఉరవడితో అవరోధాలను
పక్కకు జరుపుకుంటూ
చిమ్ముకు పోయే
ఏరులాంటి వాడు.
ఔపమ్యంతో పనిలేదు.
అతణ్ణి చూస్తేనే
తెలుస్తుంది
క్షణమైనా నిలువని
ప్రవాహలక్షణం
కలవాడని.

-సి. నారాయణరెడ్డి

## అదే మన ప్రత్యేకత

డబ్బింగ్‌లో చక్రవర్తి చెప్పే పద్ధతులు ఎందర్నో ఆకర్షించేవి. సాధారణంగా డబ్బింగ్ చెప్పేటప్పుడు ఎదురుగా తెరమీద పడే చిత్రాన్ని చూస్తూ చెప్పాల్సి ఉంటుంది. ఒకసారి చక్రవర్తి "నేను అటు తిరిగి లిప్ మూమెంట్‌కి తగ్గట్టు డబ్బింగ్ చెప్తాను చూస్తారా?" అన్నారు నరదాకి. ఇదెలా ఉంటుందో చూద్దాం అని అందరూ సరే అన్నారు. తెరమీద ఫిల్మ్ వేసారు. చక్రవర్తి సంభాషణలు అటు వైపు తిరిగి పలికారు. కరెక్ట్‌గా సరిపోయింది. అందరూ 'అద్భుతం' అన్నారు. 'ఎలా చెయ్యగలిగావు' అని అడిగారు. 'సీక్రెట్' అంటూ బైటకి నడిచారు చక్రవర్తి. ఎంతో మురిపించుకొని తర్వాత అసలు రహస్యం బైటపెట్టారిలా - "ఏం లేదు! అవతలవైపు అద్దం ఉంది. అందులోంచి నాకంతా కనబడుతూనే ఉంది. అంతే తమాషా. అదే మన ప్రత్యేకత".



## దటీజ్ చక్రవర్తి!

చక్రవర్తికి సహాయకులుగా ఉన్నవారెందరో సంగీత దర్శకులుగా నిలబడ్డ సంగతి అందరికీ తెలుసు. ఆయన సహాయకులలో ఇద్దరు 'జంట సంగీత దర్శకులు'గా తమ కెరీర్‌ను ప్రారంభించబోతున్న రోజులవి. వారు యస్. రాజేశ్వరరావుగారి నాలుగవ అబ్బాయి కోటి, టి.వి. రాజు గారబ్బాయి సోమరాజు, వారిద్దరూ కలిసి 'రాజ్-కోటి' అనే పేరుతో పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వం వహించనున్న ఒక చిత్రానికి సంగీతాన్నివ్వ బోతున్నారు. చక్రవర్తి తన దగ్గరకొచ్చిన నిర్మాతలతో "నాకయితే ఫలానా తారీఖువరకు ఖాళీ లేదు. ఈలోగా కావాలనుకుంటే ఇలా నా అసిస్టెంట్లే స్వంతం గా మ్యూజిక్ ఇస్తున్నారు. మీ నమ్మకం కోసం కాకపోయినా నా బాధ్యతకోసమైనా నేను వాళ్ళపక్కనే ఉంటాను. వాళ్ళని బుక్ చేయండి" అని రికమెండ్ చేసేవారు.

చక్రవర్తి సంగీతం ఛందోరాహిత్యంలో ఛందస్సును సృష్టించుకున్న సహజ సాహిత్యం వంటిది. సాహిత్య రాహిత్యంలో సరస హృదయాలను అలరింపగల ఆమని కోయిల తీయని పిలుపు వంటిది.

**-వేటూరి సుందరరామమూర్తి**



## ముఖేష్ అప్పారావు

అవి చక్రవర్తి అప్పారావుగా ఉండే రోజులు. పాటలు ఎంతో బాగా పాడేవారాయన. అందులో ముఖేష్ పాటలయితే మరీను. అప్పట్లో పాటగాడిగా సినిమా ఛాన్సుల కోసం తెగతిరిగేవారాయన. ఇలా ఉంటుండగా యస్. రాజేశ్వరరావుగారి అబ్బాయి సాలూరి బాబు (రామలింగేశ్వరరావు)తో ఆయనకి స్నేహం కలిసింది. ఓరోజు ఇద్దరూ రాజేశ్వరరావుగారింట్లో ముఖేష్ పాటలు సాధన చేస్తున్నారు. చక్రవర్తి పాడడం, సాలూరి బాబు పియానో మీద ఇంటర్ లూడ్స్ వాయించడం. అంతలో వారున్న గది తలుపు ఓరగా తెరుచుకుంది. ఓ కన్ను వారేం చేస్తున్నారో చూసింది. ఆ కన్ను వెనకాల ఉన్న చెవి ఆ పాటల్ని విన్నది. ఆ చెవి పక్కనేవున్న మేధస్సు చక్రవర్తిలోని వర్తును గమనించింది. వాటి ఓనరు అయిన యస్.రాజేశ్వరరావు మర్నాటినుంచీ చక్రవర్తిని 'ముఖేష్ అప్పారావు' అని పిలవడం మొదలుపెట్టారు. చక్రవర్తి మొదట్లో గతుక్కుమన్నా తర్వాత తమాయించుకొని అలవాటుపడిపోయారు. చాలా కాలంవరకు చక్రవర్తిని అలాగే పిలిచేవారు రాజేశ్వరరావు.

## అది పొదుపు చేయబోతే...

సంగీత దర్శకుడు చక్రవర్తి ఒకప్పుడు నివసించిన ఇల్లు జెమినీ రికార్డింగ్ థియేటరుకు చాలా దగ్గిరగా ఉండేది. ఇంటి నుండి రికార్డింగ్ థియేటరుకి నడిచి వెళ్ళిపోవచ్చు.

ఒకరోజు రికార్డింగ్‌కు బయల్దేరారు చక్రవర్తి. ఆ రోజే ఆయన కారు సర్వీసింగ్‌కు వెళ్ళింది.

'సరే. సర్దాగా బస్సెక్కుదాం. రిక్షా అయితే అనవసరంగా రెండు రూపాయలు ఖర్చు' అనుకుని బస్సెక్కారు. ఇది పాతికేళ్ళ క్రితం సంగతి. చక్రవర్తి బస్సు ఎక్కారో లేదో మొదలైంది... ఉధృతమైన వాన. ఆ వానలో జెమినీ స్టాప్‌లో దిగలేక 'సరే చూద్దాం' అనుకొని బస్సులోనే ఉండిపోయారాయన. కొంతదూరం వెళ్ళాక వాన తగ్గినట్టనిపించి బస్సు దిగేశారు. అయినా సన్న తుంపర పడుతూనే ఉంది. ఆ తుంపరలో తడుస్తూ ఆటో దగ్గరకు వచ్చేసరికి ఆటో ఆసామి తన రేటుని పెంచేశాడు. మొత్తానికి ఇరవై రూపాయలు సమర్పించుకొని నిలువెల్లా తడిసిపోయి జెమినీ స్టూడియోకు చేరుకున్నారు చక్రవర్తి లేటుగా. 'రిక్షా ఎక్కినా రెండు రూపాయల్లో పోయేది' అనుకుంటూ 'ఇక మీదట అతి పొదుపుకి పోరాదు' అని నిర్ణయించుకున్నారాయన.

# చక్రవర్తి ఔదార్యం

మా 'అభినందన' సంస్థ గత 18 సంవత్సరాల్లో ఎంతో మంది కళాకారులను, సంగీత దర్శకులను అవార్డులతో సత్కరించింది. అయితే చాలామంది, అవార్డు తీసుకోవటానికి ఒప్పుకుని ఫ్లయిట్ ఛార్జెస్ తెప్పించుకుని - రాకుండా, కనీసం ఫోన్ అయినా చేయకుండా ఎగ్గొట్టిన వాళ్ళున్నారు.

4-12-2001న ఘంటసాలగారి జన్మదిన సందర్భంగా ఆయన అవార్డును యిస్తామని ఫ్లయిట్ ఛార్జెస్ పంపుతామని చక్రవర్తి గారికి ఫోన్ చేస్తే ఆయన తను సీనియర్ సిటిజన్‌ను అని, 4,600/-రూ॥ పంపితే చాలునంటూ ఫోన్‌లో చెప్పారు. నేను పంపాను.

అనారోగ్య కారణాల వల్ల ఆయన ఆ అవార్డు ఫంక్షన్‌కి రాలేకపోయారు. నేను చాలా బాధపడ్డాను. 15 రోజుల తరువాత ఆయన హైదరాబాదు వచ్చినప్పుడు నాకు ఫోన్ చేసి, "భవానీగారు మీ ఫంక్షన్‌కు నేను రాలేకపోయాను. మీరిచ్చిన 4,600/-రూ॥ ఫ్లయిట్ చార్జెస్ మీకు తిరిగియిస్తాను" అని, నన్ను పిలిపించి నాకు ఆ డబ్బు వాపసు యిచ్చేశారు. ఈ 18 సం॥ అభినందన అనుభవంలో డబ్బు వాపసు రావటం నాకు యిదే మొదటిసారి. ఆశ్చర్యంతో, ఆనందంతో ఏం మాట్లాడాలో తెలియక, ఆ అవార్డును ఆయనకు అందచేసి యింటికి వచ్చేశాను.

భవాని, అభినందన

## నట 'చక్రవర్తి'

'అనుపమ' సంస్థ తిలక్ దర్శకత్వంలో 'అత్తా ఒకింటి కోడలే' చిత్రాన్ని నిర్మిస్తున్న రోజులవి. ఆరోజు 'జోడుగుళ్ళ పిస్తోలు ఠా' అనేపాట రికార్డింగు కావాలి. గాయకుడు ఘంటసాల. సంగీతం పెండ్యాల. అప్పటికే చక్రవర్తి కొన్ని కన్నడ చిత్రాలలో 'సోలో'లు పాడి ఉన్నారు. ఈ 'జోడుగుళ్ళ పిస్తోలు ఠా' పాటలో కోరస్ పాడడానికి చక్రవర్తిని రమ్మన్నారు. ఆయనకది ఇష్టంలేదు. "అంత పెద్ద సంస్థలో పెద్ద సంగీత దర్శకుడి నేతృత్వంలో గొప్పగాయకుడి పక్కన అవకాశం" అంటూ అందరూ తెగపోరి బలవంతాన చక్రవర్తిని రికార్డింగుకి పంపించారు. రిహార్సల్స్ మొదలయ్యాయి. అంతే! చక్రవర్తిలోని నటుడు విజృంభించాడు. మొహం వికారంగా పెట్టి, కడుపు పట్టుకొని, బలవంతాన వస్తున్న వాంతిని ఆపుకుంటున్న ఎక్స్‌ప్రెషన్ ఇచ్చేస్తూ, శాంపిల్‌కి ఓ రెండు డోకు సౌండ్సు కూడా సృష్టించేసి, అందరిచేతా "పాపం" అనిపించుకుని అక్కడినుంచి బయటపడ్డారు చక్రవర్తి.

## అదీ సంగతి

"అప్పుడప్పుడు మీ సంగీతంలో మహదేవన్ రిథమ్స్, సంగీత ఛాయలు కనిపిస్తాయి. కారణం ఏమిటంటారు?" అని చక్రవర్తిని అడిగితే "నేను మహదేవన్‌కి అసిస్టెంట్‌గా పనిచేసాను కదా" అన్నారు చక్రవర్తి.

"అదెప్పుడు చేసారు?" అన్న ప్రశ్నకు- "కొంతకాలం పుహళేంది అనారోగ్య కారణంగా మహదేవన్‌కి స్వర సహాయం చేయలేకపోయారు. అప్పుడు నేను 'మనుషులు మారాలి', 'భలే రంగడు', 'కంచుకోట' చిత్రాలకు ఆయనకు సహాయకుడిగా పనిచేశాను" అన్నారు చక్రవర్తి.



పూర్వం కాశీ మజిలీ కథల్లో ఉత్తర దిక్కు వెళ్ళొద్దంటే వెళ్ళిన రాకుమారుడిలాగ ఎలాంటి అసాధారణ గమ్యమైనా చేరుకోవాలనే పట్టుదల వుంది. కనుకనే చక్రవర్తి సంగీతం చేస్తే చిత్రంలో కనీసం సగం పాటలైనా 'హిట్' అవుతాయనే 'హామీ' నిర్మాతలకూ, 'ధీమా' ప్రేక్షకులకూ ఏర్పడింది.

-వేటూరి

## రెండో పెళ్ళాన్ని తెచ్చుకోకు!

చక్రవర్తి గాయకుడిగా పైకి వద్దామని చిత్ర పరిశ్రమలో విపరీతంగా శ్రమపడుతున్న రోజుల్లో స్వర్గీయ ఘంటసాల వద్దకు ఛాన్సు కోసం తరచూ వెళ్ళేవారు. అయినా ఫలితం కనిపించలేదు. తనకు పెళ్ళయిన వెంటనే ఘంటసాలను భోజనానికి పిలిచి బట్టలు పెట్టి, పాదాలకు నమస్కరించారు చక్రవర్తి. అప్పుడు ఘంటసాల మనసు ద్రవించిపోయింది. "చూడు అప్పారావ్ నేను సంగీతం ఇచ్చే సినిమాలలో తప్ప మిగిలిన సినిమాలలో నీకు ఛాన్సు ఇచ్చే అవకాశం నాకులేదు. నేను సంగీతం ఇచ్చే చోట కూడా నన్నే పాడమంటారు నిర్మాతలు. పోనీ ఇంకో పాత్రకి నిన్ను తీసుకుందామంటే పి.బి.శ్రీనివాస్, మాధవపెద్ది, పిఠాపురం ఇంతమంది ఉన్నారు. వీరందర్నీ దాటుకుని నీకు ఛాన్సు ఎప్పటికైనా ఇస్తానో ఇవ్వలేనో కానీ, ఒక్క సలహా మాత్రం ఇవ్వగలను. ఏనాడూ రెండో భార్యను జీవితంలోకి తెచ్చుకోకు. దయచేసి ఆ విషయంలో మాత్రం జాగ్రత్తగా ఉండు. మిగతావి వాటంతట అవే కలిసివస్తాయి." అని దీవించారు ఘంటసాల. ఆ తర్వాత తను సంగీత దర్శకత్వం వహించిన 'పరమానందయ్య శిష్యుల కథ' చిత్రంలో 'పరమగురుడు చెప్పినవాడు పెద్దమనిషి కాదురా' అనే పాటలో చక్రవర్తికి పాడే అవకాశాన్ని ఘంటసాల ఇవ్వడం ఆ తర్వాత చక్రవర్తి తను సంగీత దర్శకత్వం వహించిన 'ఇదాలోకం' చిత్రంలో 'నిత్య సుమంగళి నీవమ్మా' పాటని ఘంటసాలచేత పాడించటం జరిగాయి.

ఆపాత మధురమై
సంగీతాన్ని
ఆలోచనామృతమై
సాహిత్యాన్ని
గుండె నిండా నింపుకుని -
శ్రోతల
హృదయ వీణలపై
సరస్వతిచే
స్వరాక్షరాలు పలికించే
సంగీతదర్శకుడు -
చక్రవర్తి

-ముళ్ళపూడి
వెంకటరమణ



# ఎదురు తిరిగిన చక్రవర్తి



చక్రవర్తి ఫలింపరిశ్రమలో అడుగుపెట్టకముందు, చదువుకుంటున్న రోజులలో జరిగిన సంగతి ఇది. ఓ సంవత్సరం వేసవిసెలవులలో సరదాకి ఉద్యోగం చెయ్యాలనిపించి ఓ చిన్న ఉద్యోగం టెంపరరీగా సంపాదించారు ఆయన. ఆ ఆఫీసులో ఆయన సీనియర్ ఒకాయన 'నువ్వు లంచ్‌కెళ్ళి, మూడు-మూడున్నర తర్వాత రావచ్చు. ఫర్వాలేదు' అన్నాడు. 'ఇదేదో బావుందే' అనుకుని పన్నెండుకల్లా వెళ్ళిపోయిమూడున్నరకి వచ్చేవారు చక్రవర్తి. ఎవ్వరూ అడిగేవారు కాదు. అలా రెణ్ణెల్లుగడిచాయి. ఒకసారి ఆ సీనియర్ ఒంట్లో బావుండక సెలవుపెట్టాడు. వర్కు చక్రవర్తిమీదపడింది. లంచ్‌కి కూడా కదల్లేనంత పని. ఆ సమయంలోనే ఫైల్స్ పైకి పంపించమని అడగడానికి ఎక్కువమంది జనం వచ్చి పదో పరకో అడగకుండానే ఆయనచేతిలో పెట్టేసేవారు. మొదటిరోజు 'ఇదింకా బావుందే' అనుకున్నారు చక్రవర్తి. రెండోరోజు కూడా అలా గడిచేసరికి 'ఇదాసంగతి' అని అనుకున్నారు. మూడోరోజు ఆ సీనియర్ వచ్చేశాడు. ఆరోజు చక్రవర్తి లంచ్‌కి వెళ్ళలేదు. 'ఏం వెళ్ళలేదు?' అని అడిగేడు ఆ సీనియర్. "నాకు చాలా పని ఉంది సార్" అంటూ వర్కులో మునిగిపోయారు చక్రవర్తి. దాంతో ఆరోజు సీనియర్ ఆటలు సాగలేదు. ఆ మర్నాడు కాళ్ళబేరానికి వచ్చేశాడు సీనియర్. "సగం వాటా ఇస్తే మామూలు ప్రకారం లంచ్ మూడుగంటలు తీసుకుంటాను" అని బెట్టుచేశారు చక్రవర్తి. ఈ సంగతి మొత్తం మేనేజరుకి తెలిసింది. ఆయన సీనియర్‌ని ఏమీ అనలేక చక్రవర్తిని పిలిచి చీవాట్లెయ్యబోయాడు. చక్రవర్తి ఎదురుతిరిగారు వెంటనే. 'అలా అయితే తీసేస్తాం' అన్నారు ఆఫీసువాళ్ళు. "నాకు తెలుసు నాది టెంపరరీ ఉద్యోగం అనీ, మూణ్ణెల్లే చెయ్యాలనీను. ఇవాళ్టితో లెక్క ప్రకారం ఆ మూణ్ణెల్లు కూడా అయిపోయాయి. అదికూడా నాకు తెలుసు. రేపట్నుంచి నేను రావటంలేదు. మీరేం నన్ను తీసేయనక్కర్లేదు" అంటూ విజయగర్వంతో బైటికినడిచారు చక్రవర్తి.

# సరిలేరు నీకెవ్వరూ...

'కంచుకోట' చిత్రంలో 'సరిలేరు నీకెవ్వరూ' పాట ఇప్పటికీ ఎవరూ మరవలేరు. ఆ పాట వెనక ఓ చిన్న పిట్ట కథ ఉంది. అప్పట్లో కొన్ని అనివార్య, వ్యక్తిగత కారణాల వలన సంగీత దర్శకుడు కె.వి. మహదేవన్ కొంత అనారోగ్యాన్ని నటించవలసి వచ్చింది. డాక్టర్లు 'రెస్ట్' అన్నారు... 'వాతావరణం మార్చాలి' అన్నారు. ఇవతల పిక్చర్లు పూర్తిచేయాలి... అవతల రెస్ట్ తీసుకోవాలి. సరే... ఎవరికీ తెలియకుండా మహదేవన్‌ని మహాబలిపురంకి తరలించారు. అప్పుడు మహదేవన్‌కి అసెస్టెంట్‌గా ఉండేవారిలో చక్రవర్తి కూడా ఒకరు. మహదేవన్‌ని ఉంచిన ప్రదేశం ఒక్క చక్రవర్తికే తెలుసు.

ఆరోజు 'సరిలేరు నీకెవ్వరూ' పాటని కంపోజ్ చేయాల్సి వచ్చింది. చక్రవర్తి ఒక ట్యూన్‌ని వినిపించేసి 'గురువుగారు మొన్న అనుకున్నది ఇదే' అని చెప్పేరు. అందరూ బావుందన్నారు. ఆరాత్రే చక్రవర్తి మహాబలిపురం వెళ్ళి, జరిగింది చెప్పి ఆ ట్యూన్‌ని వినిపించారు. మహదేవన్ బావుందని ఇంటర్‌లూడ్‌లు అరేంజ్ చేసేసి ఇచ్చారు. తర్వాత రికార్డింగ్‌లో ఆరోజు చక్రవర్తి వినిపించిన ట్యూనే రికార్డ్ అయింది. అలా పుట్టింది 'సరిలేరు నీకెవ్వరూ' పాట.

# 'ఆపాట ఎందుకంత బాగా పాడావు?'

ఏదయినా ట్యూన్‌ని కాపీ చెయ్యమంటే సంగీత దర్శకుడు చక్రవర్తి చాలా బాధపడేవారు. వీలయినంతవరకూ నిర్మాతలకు నచ్చజెప్పి ఆ ప్రయత్నాన్ని విరమించపజేయడానికే చూసేవారు. 'పదహారేళ్ళ వయసు'లో 'సిరిమల్లె పువ్వా...' పాటకి తమిళంలో హిట్ అయిన 'సిందూర పూవై...' అనే పాటని యథాతథంగా తెలుగీయం చెయ్యమన్నారు చక్రవర్తిని. వేరే పాటను ప్రత్యేకంగా, బాగా చేస్తానని ఎంతగానో నచ్చజెప్పారు చక్రవర్తి. ఇంతలో ఢిల్లీ నుంచి ఒక వార్త వెలువడింది. అది విని అందరూ సంతోషించారుగానీ చక్రవర్తి మాత్రం ముఖం ముడుచుకున్నారు. ఇంతకీ ఆ వార్త ఏమిటంటే జాతీయ బహుమతికి గాను యస్.జానకి తమిళంలో పాడిన 'సిందూర పూవై...' పాటనే ఎన్నిక చేశారట. ఇక ఆ పాటను తెలుగులోకి అనుకరించక తప్పదని తెలిసిపోయింది చక్రవర్తికి. "అసలా తమిళపాటని అంతబాగా ఎందుకు పాడేవు?" అని జానకితో అంటూ ఆయన నిస్సహాయంతో కూడిన బాధతో మధనపడ్డారు కూడా. ఏది ఏమైనా చివరకు ఆ పాటను అనుకరించక తప్పలేదు చక్రవర్తికి.

# ధైర్య 'చక్రవర్తి'

కొన్నేళ్ళ క్రితం స్వర్గీయ ఘంటసాలగారింట్లో సినిమా పరిశ్రమలో సంగీత విభాగానికి సంబంధించిన ఒక సమావేశం జరిగింది. దానికి ఘంటసాల అధ్యక్షులు. రికార్డింగు టైములో గాయనీ గాయకులు పదిగంటలకొచ్చినా, వాద్య కారులు బిట్లు మొదలయినవాటితోసహా తయారయ్యేసరికి ఫస్ట్ టేక్‌కి పన్నెండుకొట్టేరోజులవి. ఆ మీటింగులో దానికి సంబంధించిన చర్చ ప్రారంభమయింది. తమిళ నేపథ్యగాయకుడు టి.యం. సౌందర్‌రాజన్ 'గాయకులు ముందరరోజు రిహార్సల్స్‌కి వస్తారు కదా! మర్నాడు టేక్‌లో ఏ పదకొండున్నరకో వస్తే సరిపోదా?' అనే ఓ ప్రతిపాదనని లేవదీసారు. దాని గురించి తర్జన భర్జనలు మొదలయ్యాయి. చక్రవర్తి స్వరకర్తగా జీవితాన్ని ప్రారంభించి ఎక్కువ రోజులు కాలేదప్పటికి.

ఆ ప్రతిపాదనని విన్నవెంటనే ఆయన "అలాగే... మేం బిట్లు అవీ రిహార్సిల్స్ చేసుకొని రెడీగా ఉంటాం. మీరు రాగానే వాయిస్ రూంలోకి వెళ్లి పాట పాడెయ్యాలి. మీకు అంగీకారమేనా?" అని అడిగారు టి.యం.సౌందర్‌రాజన్‌ని.

ఆయన కిమ్మనలేదు. కారణం ఏంటంటే ముందు రోజు ఎన్ని రిహార్సల్స్ చేసినా సరిగ్గా పాడబోయేముందు మరో రెండుసార్లు ప్రాక్టీస్ చేస్తేనే గాని పాడేవారు కాదాయన. అలా అయితేనేగాని ఆయనకు ఆత్మవిశ్వాసం కలిగేది కాదు. ఇది అందరికీ తెలిసిన 'రహస్యమే'. అంతే! సౌందర్‌రాజన్ ప్రతిపాదన వీగిపోయింది. అందరికీ భలేగా అయిందనిపించినా సౌందర్‌రాజన్ ఎదురుగా ఎవరూ ఏమీ అనలేదు. ఆయన వెళ్ళిపోయిన తర్వాత చాలామంది సంగీత దర్శకులు చక్రవర్తిని, ఆయన ధైర్యాన్ని ప్రశంసించారు.

## ఓ పక్క సంతోషం మరోపక్క బాధ

సాధారణంగా ఒకే వృత్తి చేసుకునేవారి మధ్య ప్రొఫెషనల్ జెలసీలు ఎక్కువగా ఉంటాయనుకుంటారు చాలామంది. కానీ సంగీత దర్శకులు చక్రవర్తి, సత్యం కలుసుకున్నప్పుడు వారిద్దర్నీ చూస్తే అటువంటి ఊహే అబద్దమేమోననిపిస్తుంది. ఓసారి వేసవికాలం మూలంగా పవర్‌కట్ ఉండడంవల్ల విజయాడీలక్స్ థియేటర్‌లోంచి బయటికి వచ్చారు చక్రవర్తి. పక్కనే గార్డెన్‌లో సిగరెట్ కాల్చుకుంటున్నారు సత్యం. ఇద్దరూ ఒకర్నొకరు విష్ చేసుకున్న తర్వాత చుట్టూ చేరిన మిత్రులతో చక్రవర్తి ఇలా అన్నారు "సత్యాన్ని చూస్తే నాకు ఒక్కొక్కపుడు సంతోషం, ఒక్కొక్కప్పుడు బాధ. ఎందుకంటే నేను కాస్త పొట్టి. అందుకని నాకన్నా పొట్టిగా ఉన్న సత్యాన్ని చూస్తే సంతోషం. మరి ఆయన ట్యూన్‌లు వింటుంటానా? నాకంటే ఇంతబాగా మెలొడియస్‌గా ఎలా కడతాడా అని మరోపక్క బాధ".

## ముఖస్తుతి

ఆమధ్య చక్రవర్తి ఒక చిత్రంలో నటిస్తున్నప్పుడు సన్నివేశపరంగా కొన్ని స్టెప్పులు వేయాల్సి వచ్చింది. కాళ్ళు నొప్పులు పెడుతున్నా ఎలాగోలాగ వేసేసి అయిందనిపించాడాయన. షూటింగు చూట్టానికి వచ్చినవాళ్ళు "అద్భుతం, బ్రహ్మాండం" అంటూ తెగపొగిడేసారు. ఆయనతో పాటు ఆ సన్నివేశంలో పాల్గొన్న మరొక చిన్న నటుణ్ణి (పేరు ఉయ్యూరు రామకృష్ణ) "ఇంకా బాగా ప్రాక్టీస్ చెయ్యాలి నువ్వు" అంటూ సలహాలివ్వడం మొదలు పెట్టారు. అది దూరం నుంచే గమనిస్తూన్న చక్రవర్తి గబగబా వారి దగ్గరికొచ్చి "చూడండి! మీరందరూ నా పొజిషన్ చూసి నన్నింతసేపూ పొగిడారు. ఇతను చిన్న నటుడు కాబట్టి తెగ సలహాలిచ్చేస్తున్నారు. నిజానికి ఇతను చేసిన దాంట్లో సగం కూడా నేను చెయ్యలేకపోయాను" అంటూ చుట్టూ చేరిన వాళ్ళని మందలించి, ఆ నటుణ్ణి పిలిచి "చూడు నాయనా! నిన్ను చూసి నిజంగా నేను సిగ్గుపడుతున్నాను. చాలా బాగా వేసేవు స్టెప్పు. వీళ్ళ మాటలు పట్టించుకోకు" అంటూ ఆ నటుడికి ధైర్యం చెప్పారు.



## చక్రవర్తి తపన

ప్రతిభావంతుడైన దర్శకుడు ఇండస్ట్రీకి వస్తే అతడు తనకన్నా చిన్న అయినా సరే అతని సినిమాకి తన మ్యూజిక్ ఉండితీరాలని తెగ తపనపడే వారు చక్రవర్తి. రచయితగా జంధ్యాల, సంగీత దర్శకుడిగా చక్రవర్తి కాంబినేషన్‌లో ఎన్నో చిత్రాలు వచ్చినా జంధ్యాల దర్శకుడయ్యాక నాలుగైదు చిత్రాలదాకా ఇద్దరి కలయిక కుదురలేదు. ఓ రోజు చక్రవర్తి తనకు తానుగా అడిగారు జంధ్యాలని. అందుకు జంధ్యాల "నా సినిమాల్లో అన్నీ మెలోడీ ఓరియెంటెడ్ సాంగ్స్ ఉంటాయి. మీవన్నీ రిథమేటిక్‌గా ఉంటాయి కదా!?" అని అన్నారు. "ఓసారి అవకాశం ఇచ్చి చూడరాదూ!?" అన్నారు చక్రవర్తి నవ్వుతూ. సరేనన్నారు జంధ్యాల అలా 'అమరజీవి' చిత్రంలో వారిద్దరూ కలిసి పనిచేయటం జరిగింది. ఆ చిత్రంలో- అసుర సంధ్యవేళ ఇది. ఎలా గడుపను ఈ మాసం, మల్లెమారాణికి బంతిపూల పారాణి పాటలన్నీ మెలోడీ ఓరియెంటెడ్‌వే. నిజానికి 'మల్లెపూల మారాణికి' పాట 'అమరజీవి' సినిమాకోసం ట్యూన్ చేసిన పాట కాదు. ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ వారి కోసం చేసిన పాట అది. యధాలాపంగా తనకిష్టమైన మంచిపాటల్లో ఇదొకటని చక్రవర్తి వినిపించిన జంధ్యాల ముచ్చటపడి ఆ పాటను ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ వారి దగ్గర్నుంచి తీసుకోవటం జరిగింది. 'అమరజీవి' తర్వాత జంధ్యాల, చక్రవర్తి కలిసి 'చంటబ్బాయ్' చిత్రానికి పనిచేశారు. ఆ సినిమాలో కూడా పాటలు హిట్టే.



ఎదట వాళ్ళ గురించి
ఏమాత్రం ఆలోచించక
అన్ని పాటలకీ
అద్భుతమైన ట్యూన్‌లు
చేసేస్తే - ఏదని
పాడుకోవాలి వాళ్ళు...!?

-సత్యానంద్

# చవక భర్త



## రచన: ఆదివిష్ణు



ఆదివిష్ణు

**జరిగిన కథ**

**రామకృష్ణ, మీనాక్షి భార్యాభర్తలు. సంసారానికి కావలసిన సామాన్లు భర్త కొనుక్కు వచ్చాక వాటిని పక్కిళ్ళ వాళ్ళు కొన్న ధరలతో మీనాక్షి పోల్చిచూస్తూ ఉంటుంది. పక్కింటి బాబాయ్ సలహా మీద తనుకొన్న సామాన్ల రేట్లన్నీ భార్యకి తగ్గించి చెప్పడం మొదలు పెడతాడు రామకృష్ణ. ఆ తర్వాతేం జరిగిందో చదవండి....**

**(లైట్స్ ఆఫ్ అండ్ ఆన్)**

**(అదే ఇల్లు. ఆ ఇంట్లోంచి రామకృష్ణ వీధిలోకి వెళ్ళబోతుంటే - ఆనందం బిక్కుబిక్కుమంటూ మాటామంతీ లేకుండా రామకృష్ణకి నమస్కరించేడు. రామకృష్ణ కూడా చేతులు జోడించి నమస్కరించాడు. ఆనందం రామకృష్ణకి పాదాభివందనం చేస్తున్న స్టయిల్లో అతని పాదాల ముందున్న నేలకి నమస్కరించాడు. రామకృష్ణ కూడా తిరిగి అదే చేసేడు. ఆనందం ఇప్పుడు సాష్టాంగ నమస్కారం చేసేశాడు. లేచాడు. రామకృష్ణ కూడా సాష్టాంగ నమస్కార భంగిమలో వున్నాడు. ఆనందం అరిచేడు.)**

ఆన: లేవరా! లేచి నించో!

(ఆ మాటకి రామకృష్ణ తట్టుకోలేక గబుక్కున లేచాడు. లేచిన వాడిని కొట్టేందుకు చెయ్యెత్తాడు ఆనందం. ఆ చేతిని గబుక్కున పట్టుకుని గంభీరంగా అడిగేడు రామకృష్ణ)

రామ: వాటీజ్‌దిస్! ఏమిటిది; ఏదో మనసుపడి నమస్కరిస్తున్నావని - నేనూ ఆ పనే చేస్తుంటే - అకస్మాత్తుగా చెయ్యెత్తేవేటి? కొడతావా?

ఆన: (చెయ్యి విడిపించుకుని అన్నాడు) నేనా? మిమ్మల్ని? కొట్టడమా? లేను. కొట్టలేను.

రామ: మరెందుకు సడన్‌గా చెయ్యెత్తేవ్?

ఆన: మా ఆవిడ జ్ఞాపకమొచ్చింది.

రామ: ఏమిటీ? నన్ను చూస్తే నీకు మీ ఆవిడ జ్ఞాపకమొచ్చిందా?

ఆన: అంతే? మా ఆవిడ జ్ఞాపకమొస్తే బిందెనో, చెంబునో కాల్తోనో, చేత్తోనో, చితక బాదేస్తాను! అది నా హాబీ!

రామ: చెత్త హాబీ! అసలింతకీ ఎవరు నువ్వు?

ఆన: పేరు ఆనందం. కొత్తగా పెళ్లయింది. ఈ వీధి చివరింట్లో వుంటున్నాం. ఎల్లయిసీలో ఉద్యోగం.

ఆన: నేను మీ కోసమే వచ్చేను. చవక రామకృష్ణ గారంటే మీరేగా?

రామ: (షాకు తిన్నాడు) చవక రామకృష్ణా?

ఆన: మీరు కాదాండి?

రామ: కారా అంటే ఏం చెబ్తాను! రామకృష్ణ వరకు కరెక్టే! చవకేమిటి? మా ఇంటి పేరు చవక కాదు!

ఆన: మీకు తెలీదులెండి! అది మీ బిరుదు!

రామ: బిరుదా! బిరుదంటే అదొక లెవెల్లో వుండాలి గానీ చవకేమిటి చీపుగానూ?

ఆన: అయిదు కిలోల పంచదార రూపాయిన్నరకి తెచ్చారంటే - అది అందరివల్లా అవుతుందా చవక రామకృష్ణగారూ?

రామ: అదుగో మళ్లా! బిరుదులొద్దు! రామకృష్ణ అనుచాలు! అవునయ్యా! తెస్తాను! రూపాయిన్నరక్కాకపోతే రూపాయికే తెస్తాను! నేనెంతకి తెస్తే నీకెందుకు?

ఆన: అంత చీప్‌గా మాటాడకండి రామకృష్ణగారూ! మీరు తెస్తారు. బాగానే వుంటుంది. అక్కడ్తో ఆగిపోతుందా కథ? ఆగదే? మీరెంతకి తెచ్చేరో మీ శ్రీమతి మా ఆవిడకి చెబ్తుంది. చెప్పింది కూడానూ!

రామ: ఊ... చెబితే?

ఆన: ఇంకేముంది? ఫినిష్! నన్ను కూడా అదే ధరకి తీసుకురమ్మంది మా ఆవిడ! అంత చీపు ధరకి ఈ భూలోకంలో నాకెవరిస్తారండీ పంచదార!

రామ: తపస్సు చేసి తెలుసుకో, నన్నడుగుతావేం?

ఆన: అందుకు తపస్సే చేయాలా చవక రామకృష్ణగారూ-

రామ: అదుగో మళ్లా! బిరుదులొద్దు!

ఆన: పంచదార మీరెక్కడ కొంటున్నారో చెబితే అక్కడే నేను కూడా చీపురేటుకి కొందామని...

రామ: ఇదుగో - మాటకు ముందు చవకా, చీపూ అని విశేషణాలు వాడొద్దు. నేనెక్కడ కొంటున్నానో చెప్పవలసిన అవసరం నాకు లేదు.

ఆన: అప్పుడు నాకు బతుకు అధ్వాన్నమైపోతుంది. ఇప్పటివరకు మేం దంపతులిద్దరం విడివిడిగానైనా ఒకే గదిలో నిద్రపోతున్నామండి! ఈ పంచదార సమస్యకి పరిష్కారం దొరక్కపోతే - మీ దయ వల్ల

- రేపట్నుంచి నన్ను వీధిలో పడుకోమంటుంది మా ఆవిడ!

రామ: ఆ మాటకొస్తే - ఇంట్లో కంటే వీధే బెటరు!

ఆన: మీలాంటి సీనియర్ భర్తలకి వీధిలో పడుక్కోడం బాగానే వుంటుందండి! నా సంగతి అట్లా కాదే! పెళ్లయి ఏడాది పూర్తి కాకుండానే నా బతుకు వీధి పాలై పోవడం, న్యాయమా చెప్పండి రామకృష్ణగారూ! నేనేం కావాలి!

రామ: తిన్నగా హిమాలయాలకి వెళ్లిపోవాలి!

(సరిగ్గా ఆ మాట మీదే ప్రవేశించాడు జగన్నాధం. వచ్చి అన్నాడు)

జగ: సరిగ్గా నేను కూడా అదే అనుకుంటున్నాను! హిమాలయాలకు వెళ్లాలంటే ఏ



రైలెక్కాలో చెబుతారా మాస్టారు?

రామ: (ఖంగారుగా) మీరెవరండి బాబూ?

జగ: (మంట మీదున్నాడు) జగన్నాధం! మీ డోరు నెంబరు పద్నాలుగు! మా డోరు నెంబరు నలభై ఒకటి!

రామ: (అతన్ని చల్లబరిచేందుకు) గమ్మత్తుగా ఉందే? పద్నాలుగు! నలభై ఒకటి! అటుదిటైతే - మీ నెంబరే మా నెంబరు!

జగ: (కోపం తమాయించుకొని) నెంబరు ప్లేటు మారినంత మాత్రాన సరిపోదు రామకృష్ణగారూ! మొహమ్మీద రాసిన ఫేటు కూడా మారాలి! కిలో మంచినూనె - మీరు ఆరున్నరకి కొంటున్నారంటే - అది అందరివల్లా అవుతుందా?

ఆన: మంచినూనె మాత్రమే కాదండీ! పంచదార కూడా అంతే! అయిదు కిలోలు రూపాయిన్నర! ఆ ధరకే తీసుకు రమ్మంటోంది మా ఆవిడ!

జగ: నా సంగతెవడికి చెప్పుకోనూ? మా ఆవిడ్ని సంతోష పెట్టాలనే సదుద్దేశంతో - ఆవిడ నన్ను గొప్పగా, అపారంగా గౌరవించాలనే అభిప్రాయంతో - అయిదూ పదీ వరకు రేట్లు తగ్గించి ఇన్నాళ్లు వెచ్చాలవీ తెచ్చేవాడిని! ఇదుగో వీరి దయ వల్ల ఇరవై ముప్పైల్లో రేట్లు తగ్గించి చెప్పాల్సి వస్తోంది! ఒకటీ రెండు కాదండీ - ఇరవై ముప్పై!

రామ: చెప్పండి! ఇరవై ముప్పై కాకపోతే - అరవై తొంభై చొప్పున తగ్గించి చెప్పండి! ఎవడొద్దన్నాడు?

జగ: చాల్లే ఊరుకోవయ్యా! అయిదు పదీ తగ్గించి చెప్పేందుకే అల్లాడి పోతున్నాను. అందిన చోటల్లా అప్పులు చేసి గుల్లయి పోయేను తెలుసా? ఎల్.ఐ.సీ.లో పదివేలకి మునిగిపోయేను. ప్రావిడెంట్ ఫండ్ ఎప్పుడో ఫినిషై పోయింది. ఇక నువ్వు తెచ్చే ధరల్లో వెచ్చాలు కొనాలంటే - చేతికి చిప్పే! నెత్తిన ముసుగే!

రామ: ఇంతకీ నన్నేం చేయమంటారండీ?

ఆన: ఏవైనా చేయండి! నన్ను వీధి పాలు మాత్రం చేయకండి!

రామ: అది మీ సొంత విషయం! దానికి నేనేం చేస్తాను?

జగ: నేనేం చేస్తాను, నాకేం తెలుసూ అని వంకాయ్ ఖబుర్లు చెప్పద్దు రామకృష్ణగారు - వళ్లు మండిపోతోంది! మనసుంటే మార్గముంటుం దండీ! తక్కువ రేట్లు చెప్పి - ఆ గిమ్మిక్కుల్తో ఆడవాళ్లని సంతోష పెట్టడం మగాడి డ్యూటీయే కావచ్చు. అంతమాత్రాన వళ్లపై తెలీకుండా పరమ నీచ నికృష్ట రేట్లతో చెరిగిపారేస్తుంటే తోటి మగ పురుగు ఏం కావాలి? మీ సుఖం మీరు చూసుకుంటే లోక కళ్యాణం జరిగిపోయినట్టేనా? యావత్తు మగజాతి క్షేమం కూడా ఆలోచించాలి గదండీ!

రామ: జగన్నాధం గారూ! నోరు కొంచెం కంట్రోల్ చేసుకోండి!

జగ: చేసుకుంటామండీ! మీరు ధరలు కంట్రోల్ చేసుకుంటే - మేమే మా నోరు కూడా కంట్రోలు చేసుకుంటాం.

రామ: సలహా యివ్వడానికి వచ్చేరా? సాధించడానికి వచ్చేరా? అది చెప్పండి. ముందు!

జగ: పాటిస్తానంటే సలహానే యిస్తాను. సాధించడం దేనికి? మీరు ఏదైనా వస్తువు కొనేముందు వీధిలో వున్న మన మగాళ్లందర్నీ సంప్రదించాలి. ఎవరెవరు ఏ ఏ రేట్లు ఇళ్ళల్లో చెప్పి బతుకు బండి లాక్కొస్తున్నారో తెలుసుకోవాలి. ఆయా రేట్లకి కొంచెం అటూ ఇటూగా కొనుక్కొచ్చేనని చెప్పాలిగాని - మరీ బేవార్సుగా తెచ్చి నట్టు యింతింత చీపు రేట్లు ఇంట్లో చెప్పద్దు! మా కొంప మీదికి తేవద్దు.

ఆన: రామకృష్ణగారూ! మీకంటే చిన్నవాడ్ని! నేనో మాట చెప్తావినండి!

రామ: ఛాన్సు దొరికింది కదా! చెప్పండి వింటాం!

ఆన: మార్కెట్టు రేటూ, మగాడు చెప్పే రేటూ అని రెండు రేట్లుంటాయండి. అది గుర్తుంచుకుని అద్భుతమైన రేట్లు చెప్పకుండా వుంటే - నేను వీధి పాలు కానక్కర్లేదు. ఈ జగన్నాధం గారు హిమాలయాలకు వెళ్లక్కర్లేదు.

(సరిగ్గా అప్పుడే గుర్నాధం పిచ్చి అవతారంతో ఆయాసపడుతూ వచ్చి అన్నాడట)

గుర్నా: హిమాలయాల్లో నాకు హనుమంతుడు కనిపించేడు. మీక్కూడా కనిపించేడా?

రామ: ఈయనెవరండీ బాబూ! హిమాలయాలూ, హనుమంతుడూ అంటాడేమిటి?

జగ: మా పక్కింటి బ్రదరే! పేరు గుర్నాధం! హనుమంతుడు, దుర్యోధనుడు, కర్ణుడు వగైరా పురాణ పురుషులంతా ఈయనకి డియరెస్టు ఫ్రెండ్స్!

గుర్నా: అంతేకాదు! ఇంద్రుడు నాకు రైట్ హ్యాండ్! చంద్రుడు నాకు లెఫ్ట్ హ్యాండ్!

రామ: ఇదెక్కడి ఫ్రెండ్ షిప్పండి బాబూ!

గుర్నా: మొన్నేం జరిగిందో తెలుసా?

జగ: వాళ్లకి తెలీదు! నువ్వు చెప్పు!

గుర్నా: ధర్మరాజుతో పేకాట ఆడేను!

రామ: అమ్మో!

గుర్నా: పాతిక వేలు బాకీ పడిపోయేడు పూర్‌ఫెలో! ఫర్లేదులేండి గు(ర్రాల్నో
ఏనుగుల్నో అమ్ముకుని మెల్లిమెల్లిగా అప్పు తీర్చుకుంటాడు లెండి!
అతని కేరెక్టరు మీద నాకు ఆ పాటి నమ్మకముంది!

రామ: (కోపంగా) ఒక వేళ మొండి చెయ్యి చూపించేడనుకోండి!
అప్పుడో?

గుర్నా: అపుడు వాళ్ల బ్రదరు భీముడితోనో, బ్రదరిన్లా కిష్టుడితోనో చెప్పేస్తా!
ప్రస్తుతానికి పాతిక రూపాయిలుంటే సర్దండి- ఆ డబ్బుతో పది
బస్తాలు సిమెంటు కొనాలి.

జగ: (రామకృష్ణతో) విన్నారా? పది బస్తాల సిమెంటు ధర పాతిక
రూపాయిలు! అన్నీ మీ వైపు రేట్లే చెబ్తున్నారు!

రామ: (అసహనంగా) మీరేం జోక్ చెయ్యక్కర్లేదు!

జగ: జోక్ కాదండీ! నిజం... పచ్చి నిజమే చెబ్తున్నా! రెండేళ్ల క్రితం -
ఇతను కూడా మీలాగానే తొందరపడి పోయి చవక - కారు చవక
రేట్లు ఇంట్లో చెప్పి ఆనందించేవాడు. అది వ్యాపకంగా మారింది.
తర్వాత అలవాటుగా రూపుదిద్దుకుంది. ఆపైన పిచ్చెక్కిపోయింది.
ఏ స్థాయిలో పిచ్చెక్కిందో మీరే స్వయంగా చూస్తున్నారుగా! నే చెప్పడ
మెందుకు!

రామ: (గుర్నాథం) ఇదుగో - గుర్నాధం గారూ!

గుర్నా: డిస్టర్బ్ చేయొద్దు! యమధర్మరాజూ, విక్రమార్కుడూ సింహాసనం
కోసం పోటాడుకుంటున్నారు. అశోక చక్రవర్తి అల్లాఉద్దీన్‌కి
అర్ధరాజ్యమిచ్చేసేడు గదా! దాంతోపాటు సింహాసనం కూడా అల్లా
ఉద్దీన్‌కి వెళ్లిపోయింది! దాన్ని మనం టూరూపీస్‌కి కొనుకోవచ్చు!
చీప్‌గా!

జగ: చూడు బ్రదరూ! ఈ బేరాలన్నీ మనం కాశ్మీర్లో సెటిల్ చేసుకోవచ్చు!
నువ్వు నాతో వచ్చేయ్!

గుర్నా: కాశ్మీర్‌కి ఎల్లా వెడతాం?

జగ: పుష్పక విమానముందిగా!

గుర్నా: వద్దు. జట్కా బండెక్కుదాం! స్పీడుగా వెడుతుంది.

జగ: మరి పద! పోదాం!

(అని గుర్నాధాన్ని తీసుకెడుతున్నాడు జగన్నాధం. ఆనందం మెలికలు
తిరుగుతున్నాడు. రామకృష్ణ అయోమయంగా చూస్తున్నాడు. అతన్ని
పలకరించేడు ఆనందం)

ఆన: వీళ్లు ఎక్కడికి వెడుతున్నారండీ!

రామ: మీకు వినపడ్లేదా?

ఆన: వినపడింది! కానీ - అర్జునుడు హాల్లో అంటే హవార్యూ అని అడిగేను
కదా - ఆ సందడిలో వీళ్లెక్కడికి వెళ్లేది మరిచిపోయేను.

రామ: అమ్మో!

ఆన: ఏ ఊరు వెడుతున్నారో!

రామ: కాశ్మీరు!

ఆన: మరి చెప్పరే? కాశ్మీర్లో పంచదార పరమ చీపు! అయిదు కిలోల
పంచదార పది పైసలే! రైలు ఛార్జీల్తో కలుపుకుంటే పదిహేను పైసలు!
ఇదే ఛాన్సు! అర్జంటుగా వెళ్లాలి.

(అని అతనూ వెళ్ళిపోయేడు కూ అని కూత పెట్టుకుంటూ. రామకృష్ణ
గుమ్మం వరకు వెళ్లి - చూస్తూ నిలబడ్డాడు)

మీనా: (హాల్లోకి వచ్చి - భర్తని గమనించి అడిగింది) ఏమిటి? అక్కడ
నిలబడ్డారే!

రామ: (అక్కడ్నించి వచ్చేస్తూ) ఏం లేదు మీనాక్షీ! భవిష్యత్ కార్యక్రమం
గురించి ఆలోచిస్తున్నా!

మీనా: భవిష్యత్ కార్యక్రమమా! అంటే?

రామ: నీకంత ఈజీగా అర్థం కాదులే!

మీనా: సర్లెండి! సాయంత్రం వచ్చేప్పుడు మినపప్పు నాలుగు కిలోలు
తీసుకురండి.

రామ: మొన్నేగా - తెచ్చేను! అప్పుడే నిండుకుందా?

మీనా: మీరు తెచ్చిందాంట్లో ఎదురింటి పార్వతమ్మగారికి సగమిచ్చేను!

రామ: అమ్మో! సగం! సగమిచ్చేసేవా? ఎంత సింపులుగా చెప్పేవు మీనాక్షి!
ఏ రేటుకిచ్చేవ్!

మీనా: మార్కెట్ రేటుకైతే ఆవిడ మనల్ని భాగమెందుకడుగుతుందీ?
చవగ్గా కిలో ఆర్రూపాయలకే మనం తెచ్చుకున్నామని తెలిసి ఆ
లెక్కనే సగభాగం తీసుకుంది!

రామ: (నసుగుతూ) అంటే - నేను చెప్పిన రేటు ప్రకారం - నేను
తెచ్చిందాంట్లో సగం ఆవిడకిచ్చేసేవా మీనాక్షి!

మీనా: ఇరుగూ పొరుగూ అన్న తర్వాత తప్పుతుందాండి? ఆ మాటకొస్తే
మీరుతెచ్చిన కందిపప్పు మొత్తం - పెద్దావిడ అడిగేరని - శాంతమ్మ
గారి కిచ్చేసేను!

రామ: ఏ రేటుకి?

మీనా: మాటకు ముందు రేటు అడుగుతారే? లాభంతో అమ్ముకోడానికి
మనమేమైనా చిల్లరకొట్టు పెట్టుకున్నామా ఏమిటండీ? మీరు తెచ్చిన
ధరకే - కిలో ఎనిమిది రూపాయలు చొప్పున యిచ్చేసేను!

రామ: (అసహనంగా) మీనాక్షి!

మీనా: ఎందుకరుస్తారూ? అంత చవగ్గా కందిపప్పు యిచ్చినందుకు
శాంతమ్మ గారు ఎంతో సంతోషించేరనీ? పన్లోపని - మీ అయనకి
చెప్పి ఒక బస్తా కందిపప్పు అదే ధరకి తెప్పించమ్మా మీనాక్షీ తల్లీ
అని నా చేతులు పట్టుకుని అడిగింది పెద్దావిడ!

రామ: (నీరసంగా) అంటే? నేను చెప్పిన ధరకి - కిలో ఎనిమిది రూపాయలు
చొప్పున - బస్తా... బస్తా కందిపప్పు - నువ్వేమన్నావ్? ఓ.కే. అనేసేవా?

మీనా: రిక్షా ఛార్జి కూడా మనమే పెట్టుకుంటామని చెప్పేనండి!

రామ: అయ్యింది - ఆ వరం కూడా యిచ్చేసేవా?

మీనా: ఎంత దూరమైనా ఎంత బరువున్నా రూపాయి మాత్రమే తీసుకునే
అప్పల్సామి వుండనే వున్నాడుగా! అంచేత చెప్పేను!

రామ: (కోపంగా) మీనాక్షీ!

మీనా: అబ్బ! గట్టిగా అరవకండి! వంటింట్లో అన్నపూర్ణమ్మ గారున్నారు!

రామ: అన్నపూర్ణమ్మగారా! ఆవిడెవరు!

మీనా: శాంతమ్మగారు - అదే - ఆ పెద్దావిడ చెల్లెలు!

రామ: ఎందుకొచ్చింది?

మీనా: అబ్బ! మెల్లిగా మాటాడండి! ఆవిడగారు వింటే బావుండదు!

రామ: (మెల్లిగా) మన వంట గదిలో సెటిలైపోవాలా?

మీనా: మీ చేత నెయ్యికొనిపించమని బతిమలాడుతోంది. వుండండి -
ఆవిడకోమాట చెప్పి వస్తాను!

రామ: ఏమని చెప్తావు?

మీనా: మా వారిని అడిగేను - ఏభై కాక పోతే వంద - వంద కిలోల నెయ్యి
రేపో మాపో పట్టుకొస్తానన్నారూ-

రామ: (అరిచేడు మళ్లా) మీనాక్షి!

మీనా: అబ్బ! అరవకండి! ఆవిడేవనుకుంటారో ఏమో

(అని ఆమె వంట గదిలోకి నడిచింది. రామకృష్ణ అటూ ఇటూ చూసేడు.
పిచ్చెక్కినట్లు - జుట్టు పీక్కుంటూ - బాబోయ్ అని అరిచేడు. ఆ
కేకకి ప్రత్యక్షమైనట్టు బాబాయి వెలిసేరు)

బాబా: పిలిచేవా రామకృష్ణా!

రామ: (బాబాయిని ఎగాదిగా చూస్తూ) పిలవలేదు. అరిచేను. అది పిలుపు
కాదు. అరుపు. గాండ్రించేనన్న మాట. అంటే - తమరు
పరమశివుడిలాగా ప్రత్యక్షమై పోయేరు!

బాబా: ఏదో షాక్ తిన్నట్టుందే?

రామ: (వ్యంగ్యంగా) అరె! అల్లాగా! ఎల్లా కనిపెట్టేసేరో?

బాబా: సింపులు! పెట్రోలు బంక్‌కి వెళ్లి బస్తా బియ్యమెంత అని అడిగితే సరైన సమాధానం వస్తుందా?

రామ: రాదు! తెలుసు మాకు! అల్లాగే - రైసు మిల్లుకి వెళ్లి బెంగుళూరు బస్సు ఎన్నింటికని అడిగినా సరైనా సమాధానం రాదు! మీ బేవార్సు పోలికలన్నీ మాకు తెలుసు!

బాబా: మంచి హీటుమీదకూడా వున్నట్టున్నావ్!

రామ: తమ ఉచిత సలహాలు విని ఉరి బిగించుకుని వున్నానుగదా! హీటుగా వుండక స్వీటుగా ఎందుకుంటాను. అదే చవగ్గా చెప్పు.... చవగ్గా చెప్పని నా ప్రాణాలు తీసేరు గదండి! ఇప్పుడేమైంది? వాడకట్టు వాడకట్టంతా - పప్పుకీ ఉప్పుకీ నేతి డబ్బాలకీ - ఇండెంట్లు పెడుతున్నారండీ! ఇండెంట్లు ఎక్కడ్నించి తేనూ? ఎంత నష్టపడను? అయిదు పదికాదండి... హండ్రడ్స్ థౌజెండ్స్... వందల్లో వేలల్లోకి పడిపోతున్నాను!

బాబా: పడిపోతావ్! అది రూలు! బార్బరు షాపుకెళ్లి బందరు లడ్డూలు కొన్నానని అద్భుత వార్తలు చెప్పద్దని అప్పుడే హెచ్చరించేను గదా! మరిచిపోయేవా రామకృష్ణా? రూపాయో, రెండో తక్కువ చేసి రేటు చెప్పవయ్యా అంటే - సగానికి సగం తగ్గించేసి చెబితే ఎంత మొనగాడైనా సరే - ఫినిష్!

రామ: (నీరసంగా) అమ్మో! ప్లేటు మారుస్తున్నారా బాబాయి గారూ? అప్పుడేమో - రెచ్చిపో... రెచ్చిపొమ్మని చెప్పి ఇప్పుడేమో చచ్చిపో... చచ్చిపొమ్మని చెప్పడానికి వచ్చేరా?

బాబా: అప్పుడు ఇప్పుడు నాదెప్పుడూ ఒకే మాట రామకృష్ణా! నువ్వు చెప్పే చవక ధరలు కేవలం నీ ఇంటి వాళ్లని మాత్రమే సంతోష పెట్టాలి గానీ - వాడకట్టు వాడకట్టంతా నీ యింటి ముందు సంచుల్తో క్యూలో నిలబడి - మాకది కొనిపెట్టు - మాకిది తీసుకురా అనే లెవెల్లో కట్టుకతలు నిన్నెవరు చెప్పమన్నారు?

రామ: ఈక్లాజెదో అప్పుడే నొక్కి నొక్కి చెప్పివుంటే ఎంత బావుండేది? (నీరసంగా)

బాబా: అంతటైమెక్కడిచ్చేవ్? మాకు తెలుసు - మీరు వెళ్లండన్నావ్? వెళ్లిపోయేను. కొనే వస్తువుల్లో కూడా తేడాలుంటాయి రామకృష్ణా! వెచ్చాలూ, కూరలూ, చీరలూ, చొక్కా గుడ్డలు ఇత్యాది నిత్యావసర వస్తువులు విషయంలో మనం జాగ్రత్త పడాలి. అసలు ధరకి రూపాయో రెండో మాత్రమే తగ్గించి చెప్పాలి! అదే - నువ్వొక కలర్ టీ.వీ. కొన్నావనుకో! దాని ఒరిజనల్ రేటెంత?

రామ: వుంటుంది. పాతికవేలు!

బాబా: అవునా? పాతికవేలు - ఈ ధర అందరికీ అందుబాటులో వుండదు. గదా! అందుబాటులో వున్న వాళ్లు నీకంటే ముందే కొనేసి వుంటారు గదా! ఇదుగో ఇక్కడ - ఇక్కడయ్యా నువ్వు రెచ్చిపోవచ్చు. పాతిక వేలక్కొని పదివేలని చెప్పు! ఢోకా వుండదు. ఎవరూ భాగమడగరు! మాక్కూడా అదే ధరకి కొనిపెట్టమని ప్రాణాలు తీయరు. ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా? స్వానుభవమన్నమాట! రెండు నెలల క్రితం కలర్ టీ.వీ కొన్నానోయ్ రామకృష్ణా. ఎంతకీ?

రామ: పాతిక వేలకి!

బాబా: కరెక్టు! ఎంతక్కొన్నానని ఇంట్లో చెప్పి వుంటాను?

రామ: పదివేలకి!

బాబా: ఇదీ కరెక్టే! అప్పుడు మా ఆవిడేం చేసింది?

రామ: అది నేనెట్లా చెప్పగలను?

బాబా: నే చెబ్తావిను! అంత చవగ్గాకొన్నందుకు, ఆ టేలెంట్‌లో పండి పోయినందుకు నాకు దిష్టితీసింది! మాట వరసకి అడుగుతున్నాను. - నే తెచ్చిన కలర్ టీ.వి. నీ నీ వైపు మాకు అమ్మండి. పిన్నిగారు అని అడిగితే - పది వేలిచ్చి తీసుకెళ్లు తల్లీ అని వరమిస్తుందా?

రామ: ఇవ్వరు! అంత డబ్బు మా దగ్గర లేదు గనుక మా ఆవిడ కూడా అడగదు!

బాబా: కనీసం - అదే ధరతో మాక్కూడా కలర్ టీ.విని కొనిపెట్టమని బాబాయిగార్తో చెప్పండి పిన్నిగారూ అని ఇండెంటు పెడుతుందా?

(రామకృష్ణ సమాధానం చెప్పేలోగా - వంటింటిలోంచి ఏవండీ అని మీనాక్షి పిలిచింది)

రామ: మా ఆవిడ పిలుస్తోందండి!

బాబా: వెళ్లచ్చులేవయ్యా! పిలిచీ పిలవగానే పరుగెత్తికెళ్లి వచ్చేసా అన్నావనుకో - పెళ్లానికి అలుసై పోతావ్! అక్కడ్నించి ప్రతి చిన్న విషయానికీ

పిలుపులే పిలుపులు! వాటికీ నీ పరుగులే పరుగులు!

(ఆవేశంగా మీనాక్షి వచ్చేసింది)

మీనా: మీరా బాబాయి గారూ! నమస్కారం!

బాబా: సుఖీభవ!

మీనా: సమయానికి మీరు యిక్కడే వున్నారు!

బాబా: అంతేనమ్మా! నేను ఎప్పుడు అంతే! ఎవరెప్పుడు తలుచుకున్నా ధనామని వెలుస్తుంటాను. ఇందాక మీ ఆయన కూడా ఈ కామెంట్





చేసేరు! అవునూ - నాతో అంత అవసరమేమిటమ్మా?

మీనా: మీరేదో కలర్ టీ.వీ. చవగ్గా కొన్నారటగా!

బాబా: (ఖంగారుగా) ఎవరు చెప్పేరమ్మా?

మీనా: పిన్నిగారు!

బాబా: అయితే ఏమిటి?

మీనా: డబ్బవసరమైంది అమ్మడూ - మీ బాబాయి చవగ్గా తెచ్చిన టీ.వీ. సెట్టు నువ్వు కొనుక్కొని ఆ పది వేలు యిస్తే - నీకు ఇవి చవగ్గా వచ్చినట్టూ వుంటుంది. నాకు డబ్బవసరం గడుస్తుందని అన్నారండి! అంచేత-

బాబా: రామకృష్ణా! నా కొంప మీదికి వచ్చిందయ్యా! అర్జంటుగా వెళ్లి మీ పిన్ని కాళ్లమీద పడకపోతే నాకు తోచదు! వస్తా!

(అని వేగంగా వెళ్లిపోయాడు)

మీనా: రామరామ! అంత పెద్దమనిషీ ఇల్లాలి కాళ్ల మీద పడటమేమిటండీ బొత్తిగా!

రామ: (నీరసంగా) ఏం చెప్పమంటావ్? ఆ టీ.వి.ని పాతిక వేలక్కొని పిన్నిగార్తో పది వేలకే పట్టుకొచ్చేనని చెప్పేట్ట! ఆవిడ గారేమో దాన్ని నీకు పదివేలకే అమ్ముతానని పంతం పట్టింది గదా! ఆ వార్త ఆటం బాంబులాగా - పదిహేను వేలు నష్టమని - అసలు నిజం చెప్పడానికి పరుగెత్తి వుంటాడు! పాపం!

మీనా: అమ్ముకునేదీ, నష్టపోయేది వాళ్లు! మధ్య మీరెందుకు అల్లాడి పోతారు?

రామ: అదే అంటే? అదొక థియరీ అన్నమాట! జనరల్ థియరీ! మగాళ్ల థియరీ!

(అటు ఇటూ చూసి గబుక్కున మీనాక్షి చేతులు పుచ్చుకున్నాడు)

మీనా: అయ్యయ్యో! ఏమిటండీ ఇది?

రామ: (నసుగుతూ) మీనాక్షి! నేను కూడా ఈ బోడి థియరీలలో నలిగి పోతున్నాను. క్షమించేను అని ఒక్కమాట నువ్వంటే - ఫ్లాష్ బ్యాక్ మొత్తం చెప్పేస్తా - మీనాక్షి!

మీనా: (చేతులు విడిపించుకుని) ఏమీ చెప్పక్కర్లేదు! మీ ఫీట్సన్నీ ఈ వీధి ఆడవాళ్లందరికి తెలిసి పోయేయి!

రామ: (ఖంగారుగా) మీనాక్షీ!

మీనా: మేము ఆడ వాళ్లమే కావచ్చుండీ! మరీ మీరనుకునేంత అమాయ కులం కాదు! విచ్చలవిడిగా ఖర్చు చేసే గుణం మగాళ్లకి సహజం గనక - మీకు బ్రేకులు వేయాలనే ఉద్దేశంతో - అదెంత క్కొన్నారు, ఇదెంత కొన్నారని అడుగు తుంటాం. అంతకెందుక్కొన్నారు, ఇంతకెందు క్కొనలేరని సున్నితంగా మందలిస్తాం! అంత మాత్రాన మమ్మల్ని తబ్బిబ్బు చేసేయాలని - మరీ చవకబారు రేట్లు మాకెందుకు చెబ్తారు?

రామ: అదే! అప్పుడు మీరు సంతోషించి - అహో ఓహో అంటారనీ -

మీనా: అట్లా అనం! అయ్యో పాపం అనుకుంటాం!

రామ: అంటే - ఇప్పుడు - కందిపప్పు - మినపప్పు-

మీనా: మీ రిక్షా అప్పల్స్వామి గోల - అంతా తెలుసండి! ఎంతవరకు వెడతారో చూద్దామని ఇన్నాళ్ళు మిమ్మల్ని నేనే ఎంకరేజ్ చేసేను!

రామ: (సంతోషంగా) అట్లా వచ్చేవా! ముందే ఆ సంగత్తెలుస్తే మీనాక్షి - తాజ్‌మహల్ కొనేసి దాని ధర వంద రూపాల ముప్పావలా అని చెప్పి వుండేవాడిని!

మీనా: బజార్లో ఆ బొమ్మని డెబ్బయి అయిదుకే అమ్ముతున్నారు! అది గుర్తుంచుకోండి!

రామ: (నెత్తిమీద చేతులెట్టుకుని) ఓర్నాయనో! (అన్నాడు)

- ఫ్రీజ్ -

శుభం

# న్యూస్ వ్యూస్

## జిరాక్స్ మిషన్‌ని నమ్ముకున్న సునీల్



యూత్‌లో విపరీతమైన క్రేజ్‌ని సంపాదించుకున్న సునీల్ "ఈ సినిమా వరకు నేను కానన్ జిరాక్స్ మిషన్‌ని నమ్ముకున్నాను" అన్నారు. ఇదేంట్రా అంటూ చుట్టుపక్కన ఉన్నవాళ్లు ఆశ్చర్య పోయారు. "ఏం లేదు... శ్రీనువైట్ల ఏం చెబితే అది జిరాక్స్ మిషన్‌లా దించెయ్యటమే" అంటూ నవ్వించాడందర్నీ. ఫిబ్రవరి 28న పుట్టిన రోజు జరుపుకోబోతున్న సునీల్ చెప్పింది జెడి ఆర్ట్స్ వారి సినిమాగురించి. ఇవీవీ గారబ్బాయి ఆర్యన్ రాజేష్ ఈ సినిమాకు హీరో. పారిశ్రామిక వేత్తలుగా ఉంటూ పలు విజయాలు సాధించిన ఎస్.సోంపల్లి, వి.యర్. కన్నెగంటి ఈ చిత్రానికి నిర్మాతలు. గత సంవత్సరం మిస్ ఇండియాగా ఎన్నికైన నమిత ఈ సినిమాలో హీరోయిన్‌గా నటిస్తోంది. 'ఆనందం' సినిమా ద్వారా కామెడీని అద్భుతంగా పండించిన రచయిత చింతపల్లి రమణ మాట్లాడుతూ "ఎంటర్‌టెయిన్‌మెంటుతో పాట్లు కొత్త ఎమోషన్‌ని దర్శకుడు శ్రీనువైట వర్క్ అవుట్ చేశాడు. జనాలకి బాగా పట్టుకుంటుంది ఆ పాయింట్" అన్నారు.

### ఉవాచ



కార్యసాధకుడు కృషితో
విజయాన్ని సాధిస్తాడు.
సోమరిపోతు
ఆ విజయాన్ని
అదృష్టానికి
అంటగడతాడు.

-'నీప్రేమకై' ఆడియో ఫంక్షన్‌లో ఎమ్మెస్‌రెడ్డి

## త్యాగరాజస్వామి వారి తల్లి పాడేది భక్తరామదాసు కీర్తనలనే...

భక్తరామదాసు రాసిన కీర్తనలన్నిటినీ సంపాదించి వాటిని జన బాహుళ్యంలో తగిన ప్రచారం కల్పించటం కోసం ఖమ్మంలో 'భక్తరామదాస ప్రాజెక్ట్' వెలిసింది. కాసెట్ల ద్వారా సంగీత కార్యక్రమాల ద్వారా గత మూడేళ్ళుగా ఎంతో కృషి చేస్తున్న ఈ ప్రాజెక్ట్ నిర్వాహకులు ఫిబ్రవరి 11వ తేదీన హైదరాబాద్‌లో పత్రికా విలేకరుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఇప్పటివరకు జరిపిన కృషిని చక్కగా చిత్రీకరించి, నేర్పుగా ఎడిట్ చేసి అతి తక్కువ సమయంలోనే ఎక్కువ సమాచారాన్ని ప్రాజెక్టర్ ద్వారా చూపించారు. ఈ ప్రాజెక్ట్‌కి ఛీఫ్ పాట్రన్, రోడ్స్ అండ్ బిల్డింగ్స్ శాఖామాత్యులు అయిన తుమ్మల నాగేశ్వరరావు ఈ సందర్భంగా మాట్లాడుతూ ఇప్పటికి 206 కీర్తనలు లభించాయని వీటన్నిటిని జనంలోకి తీసుకు వెళ్ళటమే ఈ ట్రస్ట్ లక్ష్యమని అన్నారు. ప్రముఖ లలిత సంగీత దర్శకుడు, ఈ ప్రాజెక్ట్‌కి సలహాదారు అయిన శ్రీ పాలగుమ్మి విశ్వనాథం మాట్లాడుతూ డొక్కశుద్ధి, చిత్తశుద్ధి ఉన్నవారు ఈ ట్రస్ట్‌లో ఉన్నారని, త్యాగరాజస్వామి తల్లిగారు రామదాసు కీర్తనలను పాడే వారని, రామదాసు కీర్తనలు జనంలోకి వెళ్ళాలంటే పోటీలు నిర్వహించాలని అన్నారు. రామదాసు రచించిన కీర్తనలన్నిటినీ గ్రంథస్తం చేస్తామని ఎవరికీ ఏ సమాచారం తెలిసినా తమకు తెలియజేయాలని ట్రస్ట్ కార్యదర్శి పి.విజయసారథి కోరారు.



## ప్రజల చందాలతో ఘంటసాల సంగీత కళాశాల భవనం

విజయవాడ ప్రజలు సుదీర్ఘకాలంగా ఎదురుచూస్తున్న ఘంటసాల సంగీత, నాట్య కళాశాల భవనం ఫిబ్రవరి 7వ తేదీన ప్రారంభమైంది. ప్రముఖ కర్ణాటక గాత్ర సంగీత విద్వాంసుడు మంగళంపల్లి బాలమురళీ కృష్ణ ఈ సంగీత కళాశాల భవనాన్ని ప్రారంభించారు. ఈ భవన నిర్మాణం నిధులు లేక ఎన్నోఏళ్ళుగా నిలిచిపోయింది. స్థానికులు చందాలు వేసుకొని ఎట్టకేలకు ఈ భవనాన్ని పూర్తి చేశారు. మహనీయుడు ఘంటసాల పేరు మీద సంగీత కళాశాల భవనం ఏర్పాటు చేయడం నిజంగా హర్షదాయకమని అన్నారు మంగళంపల్లి బాలమురళీకృష్ణ. ఈ భవనంలో ఏటా ఘంటసాల స్మృతి చిహ్నంగా ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటు చేయాలని ఈ సందర్భంగా కోరారాయన.



## సినారె, వేటూరి పక్కన తన పేరు చూసుకుని థ్రిల్లయిన సిరివెన్నెల

'హిందుస్థాన్ ది మదర్' సినిమాని తీసిన జె.హరిబాబు దర్శక నిర్మాతగా లేటెస్ట్ సినిమా 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను" సినిమా ఆడియో ఫంక్షన్ ఇటీవల జరిగింది. ఈ సినిమాలో సినారె, వేటూరి, సిరివెన్నెల పాటలు రాశారు. ఈ ముగ్గురి పేర్లు ఒక చిత్రంలో ఉండడం అన్నది ఓ రికార్డు. ఆ విషయాన్నే చెబుతూ ఆ ఇద్దరి పేర్ల పక్కన నా పేరు చూసుకుంటుంటే ఇండస్ట్రీకి వచ్చి 16 ఏళ్ళయినా థ్రిల్‌గా ఉంది" అన్నారు సిరివెన్నెల. సినారె మాట్లాడుతూ "ఇవాళ తెలుగు సినిమా క్యాసెట్లు వినాలంటే భయం వేస్తోంది. శ్రవణానికి గ్రహణం పట్టింది. మాట మీద బీట్ ఎక్కకూడదు. ఇటీవల నేను విన్న పాటలలో 95% మాటలు వినిపించిన పాటలున్న క్యాసెట్ ఇదే" అని అన్నారు. శశిప్రీతమ్ సంగీత దర్శకత్వం వహించిన ఈ సినిమా ఆడియో ఫంక్షన్‌కి అక్కినేని, రామానాయుడితోపాటు హాజరైన ఎమ్మెస్‌రెడ్డి, డివియస్‌రాజు మొదలైన వారు ఈ చిత్రంలో పాడిన రాజేష్‌గొంతు విని అచ్చు బాలులా పాడిన ఇతనెవరని అడగటం కూడా జరిగింది.



## విశాఖలో ఫల్గుణి పాథక్

మేరీ చునీర్ ఉడ్ ఉడ్ జాయే తదితర హిట్ గీతాల ద్వారా భారతీయ పాప్ సంగీత అభిమానుల మనసులను దోచిన ఫల్గుణి పాథక్ ఫిబ్రవరి 9న విశాఖపట్నం ప్రజలకు తన గానామృతాన్ని పంచారు. ఇప్పటికి 5 ఆల్బమ్స్ విడుదల చేయటమే కాక పలు పంజాబీ, గుజరాత్ సినిమాల గీతాలను కూడా ఆలపించిన పాథక్ ఎక్కువగా రాజస్థానీ జాన పద సంగీతాన్ని ఆధారంగా చేసుకునే తన ఆల్బమ్స్ రూపొందిస్తుంటారు.

# "నా దేశం ఇలా అయినందుకు బాధగా వుంది"

## 'ఆప్ జైసా కోయీ(కుర్బానీ)' పాట ఫేమ్ బిడ్డు




★ బిడ్డు అప్పయ్య బెంగుళూరులో జన్మించారు. తన 15వ ఏట నుండే ప్రదర్శనలివ్వడం మొదలుపెట్టారు. ఐరోజాన్స్ పేరుమీద ఓ టీమ్ తయారుచేసుకుని ఓ ఆల్బమ్ విడుదల చేశారు. ఇండియాలో అలా చేయటం అదే ప్రథమం.

★ లండన్ వెళ్ళిన తొలినాళ్ళలో హంబర్టన్ బార్‌లో షెఫ్‌గా పనిచేసేవారు. తర్వాత అమెరికన్ యంబసీ ముందు డఫ్‌నట్స్ అమ్మేవారు.

★ 'రైన్ ఫాల్స్ ఆన్ ది లోన్లీ సాంగ్' ద్వారా బిడ్డు ఇంటర్నేషనల్ స్టార్ అయ్యారు. అతని బ్యాండ్ పేరు టైగర్స్. మ్యూజిక్ చార్ట్‌లో అతి టాప్‌కు చేరుకుంది.

★ 1974లో కార్ల్ డగ్లస్‌ను కలుసుకుని కుంగ్‌ఫూ ఫైటింగ్ నిర్మించారు. అది తొమ్మిది మిలియన్ కాపీలు ప్రపంచవ్యాప్తంగా అమ్ముడయ్యాయి.

★ నాజియా హసన్-బిడ్డు కనుగొన్న మంచి గాయని. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన డిస్కో దివానే ఆల్బమ్ ఇండియాలోనే 9 లక్షల కాపీలు అమ్ముడయ్యాయి.

★ 1995లో ఆలీషా, బిడ్డు కాంబినేషన్‌లో వచ్చిన మేడిన్ ఇండియా ఆల్బమ్ 50 లక్షల కాపీలు అమ్ముడయ్యాయి. అదో రికార్డు.

ఒకసారి మీరు 'బిడ్డు' వంక చూస్తే ఆయనకు 60 సంవత్సరాలు అంటే నమ్మరు. సంగీతంతో ఈ సమాజాన్ని ఆనందింపజేయాలన్న అతని తపన ముందు వయసు కూడా వెనక్కి వెళ్ళిపోతుంది. 'బిడ్డు' పేరు వినగానే ఇండియన్‌పాప్ సింగర్స్‌ను తయారుచేసిన వ్యక్తిగానే అందరికీ స్ఫురణకు వస్తుంది. అలీషా చినాయ్, శ్వేతాశెట్టి, సోను నిగమ్, షాన్, సాగరిక తదితరులైన ఎందరో పాప్‌సింగర్స్‌ను మనకు పరిచయం చేసింది ఆయనే. తాజాగా ఆయన పరిచయం చేసిన మరి తార నికిత.

**'నికిత'ను ప్రమోట్ చేయడం కోసం మీరు ఇండియాకు వచ్చారు కదా, మీరు ఆమెను ఎలా కనుగొన్నారు? ఆమెతో మీ పరిచయం తదితర వివరాలు చెబుతారా?**

రెండు సంవత్సరాల క్రితం లండన్‌లోని ఓ ఫంక్షన్‌లో ఆమెను మొదటిసారిగా కలిశాను. ఆమె, తన తండ్రితో కలిసివచ్చి నన్ను కలిసి, నేను బాగా పాడగలనని చెప్పింది. నన్ను కలుస్తూ వుండమని చెప్పాను. ఎనిమిదినెలల తర్వాత వారు డెమో టేప్‌తో వచ్చారు. ఆ క్యాసెట్ విన్న తర్వాత పదహారేళ్ళ అమ్మాయి గొంతు అంత అందంగా వుంటుందా అన్పించింది. ఆ ఏజ్‌లోనే ఆమె గొంతు బాగా మెచ్యూర్ అవ్వటమే కాక ప్లే-బాక్,, పాప్ గీతాలను కూడా బాగా పాడగలదనిపించింది. అయితే పాప్ పాటలకన్నా, ప్లే-బ్యాక్ సింగర్‌గా ఆమె గొంతు బాగుంటుంది. అప్పటినుండి మేం ఇద్దరం కలిసి 'ఇక్‌రార్' కోసం పనిచేశాం. త్వరలోనే అది విడుదల కానుంది.

**'నికిత' లాంటి కొత్త సింగర్స్‌తో పాడించేటప్పుడు మీరు ఏ అంశాలు దృష్టిలో పెట్టుకుంటారు?**

ఆ సింగర్ గొంతులోని క్వాలిటీకి ప్రథమ స్థానం ఇస్తాను. 'నికిత' గొంతులో ఎన్నో రకాల ఎమోషన్స్ వినిపించగలదు. అందువల్ల నేను స్వేచ్ఛగా కంపోజ్ చేయటానికి ఆస్కారం కలిగింది. కానీ ముందుసారి నేను ఆమె గొంతు విన్నప్పుడు ఆమె పాప్‌సింగర్‌గా కన్నా ఓ మంచి ప్లేబాక్ సింగర్ అవుతుందనిపించింది. ఈ విషయాన్నే నేను దృష్టిలో పెట్టుకున్నాను. ఈ ఆల్బమ్‌లో ఎక్కువ పాటలు హిందీ సినిమా పాటలలానే ఉంటాయి.

**ఆలీషా, సోనూ, షాన్, సాగరికలాంటి మేటి ఇండియన్ పాప్ సింగర్స్‌ను మీరు అందించినా మీకు అంతగా పేరు రాకపోవడానికి కారణం?**

దానికి రెండు కారణాలున్నాయి. ఒకటి నేను లండన్‌లో ఉండటమైతే, రెండు - ఇండియాలో స్టార్‌కున్న వేల్యూ, స్టార్ మేకర్‌కు లేకపోవడం. నేను లండన్‌లో ఉండడంతో, ఇక్కడ నా పేరు ఎక్కువగా వినిపించడానికి ఆస్కారం లేదు. ఓ మ్యుజిషియన్‌గా నేను ఎప్పుడూ ప్రోత్సహించడానికే ఇష్టపడతాను. నేనో నిర్మాతను, రైటర్‌ను, ఎరేంజర్‌ను కూడా. అయితే నేనెప్పుడూ ఆల్బమ్స్‌ను అమ్మలేదు. మీరు చెబుతున్న వారందరూ నిజమైన స్టార్స్, ఎందుకంటే పాడేది, దానికి అనుగుణంగా పెర్‌ఫార్మ్ చేసేది వారే. అదృష్టవశాత్తు ఇండియాలో నన్ను కూడా గుర్తుంచుకోవడం ఆనందంగా

వుంది.

**'దిల్ కీ రాణీ' ద్వారా అలీషా మరో 'మేడ్ ఇన్ ఇండియా' ఇద్దామని మీతో కలిసి పనిచేసినా అది అంతగా ఎందుకు క్లిక్ కాలేదు?**

మీకు మరోసారి చెబుతున్నాను 'మేడిన్ ఇండియ లాంటి ఆల్బమ్ తయారుచేయాలని నేనెప్పుడూ కోరుకోను. క్రిందట వారం ఏంచేసానో కూడా నాకేమీ గుర్తుండదు. అలాంటప్పుడు ఎనిమిది సంవత్సరాల క్రితం చేసిన ఆల్బమ్ ఎలా గుర్తుంటుంది?' అలీషా, వర్జినియా రికార్డు వారు మేడిన్ ఇండియా టీమ్‌తోటే ఈ ఆల్బమ్ రూపొందించి క్యాష్ చేసుకోవాలనుకున్నారు. కాని ఈ విషయంలో 'వర్జినియా' రికార్డ్స్‌ను నిందించవలసి వుంది. ఎందుకంటే వారు సరైన విధంగా ఆల్బమ్స్‌ను మార్కెట్ చేయలేకపోయారు.

**అలీషా, శ్వేత, సోను లాంటి ఎందరో గాయనీ, గాయకులను మీరు తయారు చేశారు. అయితే ఒక్క అలీషా తప్ప మిగిలిన వారు మీతో పనిచేయకపోవడానికి కారణం?**


నికిత

నిజమే. వారు ఆవిధంగా పేరు తెచ్చుకోవడంలో నేను కూడా కీలక పాత్ర వహించాను. నేను కేవలం వారి పాటలకు కంపోజర్‌ను మాత్రమే. ఒకసారి ఆల్బమ్ తయారైన తర్వాత నాకు వారితో సంబంధం లేదు. ఓ హిట్ ఆల్బమ్ వచ్చిన తర్వాత, దానికన్నా మేలైన ఆల్బమ్ తయారుకావాలని, ఆ గాయకులు భావించడంవల్ల కూడా అలా జరిగుండవచ్చు.

**మీరు స్వంతంగా 'ఫరేబీ' ఆల్బమ్ ఇటీవల విడుదల చేసారు. ఇంకా ఏమైనా చేస్తున్నారా?**

లేదు. నాకున్న ప్రధాన సమస్య హిందీ సరిగా రాకపోవడమే. నాకు నేనుగా హిందీ పాట పాడితే చాలా సమయం తీసుకుంటుంది. అసలు ఆ భాష నాకు సరిగ్గా అర్థం కాదు కూడా. 'ఫరేబీ' సాంగ్ కంపోజ్ చేసేదాక నాకు ఆ పదం అర్థం తెలియదంటే మీరు నమ్ముతారా? అదే విధంగా నికిత కోసం చేసిన 'ఇక్‌రార్' అర్థం కూడా నాకు తెలీదు. అందుకని నాకు నేనుగా ఓ హిందీ ఆల్బమ్ చేయాలంటే దానిమీద చాలా శ్రద్ధ వహించాల్సి వుంది. అయితే, త్వరలోనే ఓ హిందీ ఆల్బమ్ చేయవచ్చు.

**ఇండియన్ పాప్ పుట్టినప్పటి నుండి మీరు వున్నారు. ఓ దశాబ్ద కాలంగా మీరు ఈ పరిశ్రమలో ఎన్నో మార్పులను కూడా గమనిస్తున్నారు. దీనిపై మీ అభిప్రాయం?**

ఇండియన్ పాప్ నేడు ఈ విధంగా వుండడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి ప్రస్తుత దేశ ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా వుండడంవల్ల సంగీతం కూడా లగ్జరీ ఐటమ్స్‌లో చేరిపోయింది. అందుకనే సినీ సంగీతపు సేల్స్ కూడా గత కొద్ది సంవత్సరాలుగా బాగా పడిపోయాయి. ఇక రెండోది టాలెంట్ వున్నవాళ్ల ప్రస్తుతం అంతగా లేకపోవడం, మంచి సంగీతం రాకపోవడం. ఇండియన్ పాప్‌కు ప్రధానమైన పోటీదారు బాలీవుడ్. టాలీవుడ్ నుండి ఇండియన్ పాప్ నేర్చుకోవాల్సింది చాలా వుంది. అప్పుడే దానిని అధిగమించగలం. లేకపోతే అల్కా, కుమార్‌సాను, కవితా కృష్ణమూర్తి ఉదిత్‌లాంటి గాయకులు వెంటే శ్రోతలు పడతారు.

**అయితే ఇండియాలో ఇండియన్ పాప్‌కు భవిష్యత్తు లేదని మీరంటారా?**

కాదు. నేను చెప్పేదేమిటంటే కంపెనీలు, సింగర్స్ తమ ఆల్బమ్స్‌ను క్వాలిటీతో విడుదలచేయాలి. అద్నన్ సామీని చూడండి. ఒక్కసారిగా అతను వార్తల్లోకి వచ్చాడు. ప్రస్తుతం బాలీవుడ్‌లో కూడా మంచి అవకాశాలు అతనికున్నాయి. మనకు కావల్సింది అతనిలాంటి ఆర్టిస్ట్‌లు.

**'కుర్బాని' సినిమా ద్వారా బాలీవుడ్‌లోకి ప్రవేశించి పలు సక్సెస్‌లు సాధించినా, మీరు ఇక్కడ చిత్రాలకు పనిచేయకపోవడానికి కారణం?**

నేనెప్పుడూ బాలీవుడ్‌కు పనిచేయాలని అనుకోలేదు. నిజం చెప్పాలంటే ఫిరోజ్‌ఖాన్ లండన్‌లో నన్ను కలిసి ఓ చిత్రం చేయమన్నప్పుడు నేను చేయనని చెప్పేశాను. కానీ తర్వాత చేస్తే తప్పేం లేదుగా అనిపించి అప్పుడు నా దగ్గర వున్న నాజియా హసన్ చేత 'ఆప్‌జైసా కోయీ మేరి జిందగీ' పాట పాడించాను. ఆ పాటను కేవలం అరగంటలో రికార్డుచేయడం జరిగింది. అప్పుడే ఆ విషయాన్ని నేను మర్చిపోయాను కూడా. ఆశ్చర్యకరంగా ఆ పాట మంచి సక్సెస్ అవడమే కాక, ఇప్పటికీ అదో మంచి పాటగా వెలిగిపోతోంది. అయితే బాలీవుడ్ నుండి సరైన ఆఫర్ ఏదీ నాకు రాలేదు. అంతేకాక నేను లండన్‌లో వుండడంచేత ఫిల్మ్ మ్యూజిక్ పట్ల అంతగా శ్రద్ధ వహించలేదు. ఎందుకంటే ఇవి చాలా సమయం తీసుకుంటాయి.

**ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఇప్పుడున్న స్థాయితో మీరు సంతృప్తిపడుతున్నారా?**

ఖచ్చితంగా. మూడు దశాబ్దాలుగా నేను లండన్‌లో వుంటున్నప్పటికీ, నేను ఇక్కడ పేరు సంపాదించుకోవడం అంతంతగానే వుంది. ఇక ఆర్టిస్ట్‌గా నేను సంతృప్తిపడ్డా, ఓ మనిషిగా మాత్రం ఇక్కడ పరిస్థితులకు బాధపడుతున్నాను. ఇప్పటికీ ఇక్కడ దారిద్ర్యం, నిరక్షరాస్యత రాజ్యమేలుతున్నాయి. దీనికి తోడు ప్రతిచోట అవినీతి రాజ్యమేలడమేకాక, తుచ్ఛ రాజకీయాలు చోటుచేసుకుంటున్నాయి. నా దేశం ఇలా అయినందుకు చాలా బాధగా ఉంది. త్వరలోనే నా ప్రజలకు నేను ఏదో రూపంలో సేవ చేయడానికి ప్రయత్నిస్తాను. దానికి సంబంధించిన ప్లాన్స్ ప్రస్తుతం రెడీ అవుతున్నాయి.

**ఓ స్టార్ మేకర్‌గా స్టార్స్ కోసం మీ వెదుకులాట కొనసాగుతుందా?**

40 సంవత్సరాలుగా సంగీతాన్ని చూస్తున్నాను. అంతేకాక నా వయసు కూడా బాగా పెరిగింది. 60 సంవత్సరాల వృద్ధుని నుండి 20 సంవత్సరాల యువకునికి కావల్సిన కొత్త సంగీతం మీరు ఊహించలేరు కదా. నా వయసు పెరుగుతున్న కొద్దీ ఈ సమాజానికి ఏదో ఒకటి చేయాలన్న భావన వెంటాడుతుంది కానీ నేను సంగీత ప్రపంచాన్ని వదిలివెళ్ళే లోపు భారతీయ సంగీతాన్ని ప్రపంచానికి రుచి చూపించే అద్భుతమైన ఆల్బమ్ చేస్తాను. అది నాకల. ఆ కల నిజమయ్యే రోజుకూడా దగ్గర్లోనే వుంది.

\- శ్రీ విక్రమ్



# నువ్వు లేక నేను లేను

ఎందరో కొత్త దర్శకులని పరిచయం చేసిన ప్రతిష్ఠాత్మక సురేష్ ప్రొడక్షన్స్ సంస్థ నుంచి వెలువడ్డ మరో యువతరంగం యనమదల కాశీ విశ్వనాథ్. సంక్రాంతి రేసులో ముందంజ లో వున్న ఈ చిత్రంలో 'ఏదో ఏదో' పాటను దర్శకుడే స్వయంగా రాయడం జరిగింది. ఈ పాట గురించి ఆయన చెప్పిన విశేషాలు.



"ఈ సినిమా కథ మొత్తం హీరోయిన్ కేరెక్టర్ మీదే నడుస్తూ వుంటుంది. ఎప్పుడూ హీరోతో తగవులాడే హీరోయిన్ ఒక సందర్భంలో అది ప్రేమో, ఏమో తెలియని వింత ఫీలింగ్‌కి గురవుతుంది. ఈ సిట్యుయేషన్‌ని సంగీత దర్శకుడికి చెబుతూ నా ఫీలింగ్స్ వివరించాను. నా ఫీలింగ్స్‌కే పట్నాయక్ ట్యూన్ కట్టాడు. అది అందరికీ నచ్చింది. చరణాలు కూడా నన్నే రాయమని అడగడంతో రాసాను. అంతేగానీ ఏదో క్రేజ్ కోసం మాత్రం రాయలేదు. ఈ పాట రాయడంలో వేటూరి గారు నాకు స్ఫూర్తి. ఆయనకీ పాట వినిపిస్తే షేక్‌హేండ్ ఇచ్చి 'ఈ మధ్య కాలంలో ఇంత మీనింగ్‌ఫుల్ సాంగ్ నేనూ రాయలేదు, ఎక్కడా వినలేదు' అని అభినందించారు. ఈ పాటతో నాలో కూడా ఓ రచయిత వున్నాడని నాకర్థమైంది" అని తెలిపారు యనమదల కాశీవిశ్వనాథ్.

# నీ ప్రేమకై



మెలోడి సాంగ్‌ల స్పెషలిస్ట్ అయిన యస్.ఎ. రాజ్‌కుమార్‌కు ఈ మధ్య తెలుగులో జోరు తగ్గింది. 'నీ ప్రేమకై' సినిమాతో తిరిగి తన సత్తా నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. సురేష్ ప్రొడక్షన్స్ బేనర్‌లో చేసిన 'కలిసుందాం రా' తనని స్టార్ మ్యూజిక్ డైరెక్టర్‌ని చేసిన విషయాన్ని గుర్తు తెచ్చుకుంటూ, ఈ సినిమాతో మళ్ళీ తన ప్రాభవాన్ని పెంచుకుంటానంటున్నారు రాజ్‌కుమార్.

'నీ ప్రేమకై' సినిమాలో నచ్చిన పాట గురించి అడిగితే 'అన్నీ ఇష్టపడే చేసాను. అన్నీ బెస్ట్ సాంగ్సే' అన్నారు. ఈ ఆరుపాటల్లో తొలుత మీ మనసు దోచుకున్నదేదని అడిగితే - రాజ్‌కుమార్ ఇలా చెప్పుకొచ్చారు.

" 'ఓ ప్రేమ స్వాగతం' నాకు బాగా నచ్చింది. నా స్టైల్ పరిపూర్ణంగా వున్న పాట అది. వినగానే వెంటనే మనసుకి ఎక్కుతుంది.".




# మనసంతా నువ్వే



ఈ యూత్ ట్రెండ్ పుణ్యమా అని సునీల్ కామెడీ స్టార్ అయిపోయాడు. కేవలం సునీల్ కామెడీ కోసం మళ్ళీ మళ్ళీ సినిమాలకు వెళ్ళే ప్రేక్షకులున్నారు. ఈ భీమవరం కుర్రాడి స్లాంగ్ అందరికీ తెగ నచ్చేసింది. ఇప్పుడు ఇతని పని 'మూడు సినిమాలు - ఆరు కాల్షీట్లు' అన్నట్టుగా వుంది. 'మనసంతా నువ్వే'లో తన కామెడీతో అందరి మనసుల్లో నిండిపోయిన సునీల్ ఈ సినిమాలో తన ఫేవరెట్ సాంగ్ గురించి ఇలా చెప్పుకొచ్చారు. "చెప్పనా ప్రేమ చెలిమి చిరునామా' నా ఫేవరెట్ సాంగ్. సినిమాలో ఈ పాట రెండుసార్లు వస్తుంది. ఒకసారి మంచి ఫీల్‌తోనూ, రెండోసారి కమర్షియల్ గానే వస్తుంది. రెండుసార్లూ నాకు ఈ పాట నచ్చింది".

# కలుసుకోవాలని



ఉదయ్‌కిరణ్ క్రేజ్, దేవీశ్రీప్రసాద్ మ్యూజిక్‌లోని నావెల్టీతో 'కలుసుకోవాలని' ఆడియో బాగా పాపులర్ అయ్యింది. ఈ ఆడియో గురించి దేవిశ్రీ ప్రసాద్ ఏమంటున్నారంటే "మంచి యూత్‌ఫుల్ ఆడియో ఇది. మొత్తం 8 పాటలున్నాయి. ఇందులో ఆకాశం, ఉదయించిన సూర్యుడు. ఈ రెండు పాటలూ నేనే రాసాను. ఈ ఆడియోలో ప్రయోగాలు చేసాననే అనుకుంటున్నాను. ఉదయ్‌కిరణ్‌కున్న క్రేజ్‌ని దృష్టిలో పెట్టుకుని డిఫరెంట్ కైండ్‌లో సాంగ్స్ చేసాను. ఒక్కొక్క ఫీల్‌తో వుంటుంది. ఈ ఆడియోలో ఏది బెస్ట్ అనేది తేల్చి చెప్పడం కష్టం. ముఖ్యంగా "ఉదయించే సూర్యుడు" మాత్రం తెలుగులో ఒక డిఫరెంట్ సాంగ్ అవుతుంది" అని చెప్పారు దేవిశ్రీ ప్రసాద్.

## ఓ చినదాన



ఈ చిత్రంలో 'దొంగ' పాత్రతో మంచి హాస్యాన్ని పండించగలిగారు శ్రీకాంత్. మారిన ట్రెండ్‌ని దృష్టిలో పెట్టుకుని ఎంటర్‌టైన్‌మెంట్ పాత్రల వైపు మొగ్గు చూపుతున్న శ్రీకాంత్ కెరీర్‌కిది మరో ప్లస్. మంచి ఆడియో అనిపించుకున్న ఈ చిత్రంలో శ్రీకాంత్‌కి నచ్చిన పాట ఏమిటో తెలుసుకుందాం. "తన చిరునామా అడిగితే ప్రేమ నిను చూపెడుతుంటే టైటిల్ సాంగ్ నాకు బాగా నచ్చింది. మంచి సాహిత్యం, మంచి ట్యూన్‌కి తోడు పెక్యులర్ వాయిస్ వుండటంతో త్వరగా ఆకట్టుకుంటోంది. దేవాశిష్ కాకుండా వేరే ఎవరైనా పాడివుంటే ఎలా వుండేదో తెలీదుగానీ, ఈ పాట క్రెడిట్ మాత్రం అతనికే చెందుతుంది".

## నువ్వు నాకు నచ్చావ్



ఈ చిత్రంలో మల్లిఖార్జున్‌రావు పాత్ర నిడివి తక్కువే అయినా గానీ, మంచి హాస్యాన్ని పండించగలిగారు. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి ఆయన తెలిపిన అభిప్రాయం. "ఆకాశం దిగివచ్చి మబ్బులతో వెయ్యాలి మన పందిరి' అంటూ మన సంస్కృతీ సాంప్రదాయాలతో జరిగే పెళ్ళి వేడుక గురించి వెంకటేష్ పాట చాలా ఎక్కువగా నచ్చింది. ఆ ట్యూన్‌కి, వెంకటేష్ పెర్‌ఫార్మెన్స్‌కి బాగా ఇంప్రెస్ అయ్యాను. అన్ని రకాలుగానూ గమ్మత్తుగానూ, లవ్లీగానూ అనిపించింది పాట. 'సాహిత్యం కూడా చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది".

## నువ్వు - నేను



ఇంతకుముందు చాలా సినిమాల్లో చేసినాగానీ వైజాగ్ ప్రసాద్‌కి సరైన బ్రేక్ రాలేదు. 'నువ్వు - నేను'లో ఉదయకిరణ్ ఫాదర్‌గా వేసిన విలనీ పాత్రతో ఈయన కెరీర్ మొత్తం టర్న్ అయ్యింది. ఇప్పుడాయన ఓ పది, పదిహేను సినిమాల్లో చేస్తూ ఫుల్ బిజీగా వున్నారు. 'నువ్వు - నేను'లో తనకు నచ్చిన పాట గురించి ఆయన చెబుతూ - "ప్రియతమా... ఓ ప్రియతమా, ఈ మౌనరాగాలనే పలికే హృదయం' పాట నాకు బాగా నచ్చింది. ఓ అమ్మాయి, అబ్బాయి తన మనసు విప్పి చెప్పుకోవడానికి ఎన్నుకున్న మార్గం బాగుంది. ప్రేమ గురించి ఓ స్వీట్ టచ్ ఈ పాటలో వుంది. యూత్‌కే కాకుండా అందరికీ నచ్చిన పాట ఇది" అని తెలిపారు.

## నీతో చెప్పాలని



ఆకాష్ హీరోగా రూపొందిన ఈ చిత్ర దర్శకుడు సత్యనాయుడు. మంచి క్రేజ్‌ని సంపాదించుకున్న ఈ ఆడియోలో దర్శకుని పాట కూడా వుంది. ఆ వివరాలు: "ప్రముఖ రచయితతో ఈ పాట రాయించాలని ప్రయత్నించాను. కానీ కుదర్లేదు. ఆ సందర్భానికి తగ్గట్టుగా నేను రాసుకున్న భావాలు చూసి సంగీత దర్శకులు కోటి నన్నే రాయమన్నారు. 'ప్రేమంటే అమ్మాయి లుక్స్ కాదు. అమ్మాయి లిప్స్ కాదా, చీక్స్ కాదు, షేప్స్ కాదు - కాదల్ అంటే అమ్మాయి థైస్ కాదు, టైట్స్ కాదు, హైట్స్ కాదు, వెయిట్స్ కాదు - లవ్ అంటే ఇవేమీ కానే కాదు మనసొకటే. ఆ మనసునే ప్రేమించరా, ప్రేమించడం ఒక వరంరా' అనే పల్లవితో నేను పాట రాసాను" అంటూ తన రాసిన పాట గురించి చెప్పుకొచ్చారు సత్యనాయుడు.

## నువ్వుంటే చాలు



ప్రసిద్ధ సంగీత దర్శకులు సత్యం కూతురు కొడుకైన 'వసంత్' 'ప్రియమైన నీకు' చిత్రంలో 'నచ్చెనురా నచ్చెనురా' పాటలో పాటల రచయితగా తన కెరీర్‌ని ఆరంభించారు. స్మిత పాప్ ఆల్బమ్ 'కోయి లమ్మ'లో మొత్తం పాటలన్నీ వ్రాసి మంచి పేరు తెచ్చుకున్న ఈ నవయువ రచయిత 'నువ్వుంటే చాలు'లో తను రాసిన పాట గురించి ఇలా చెబుతున్నారు. "దర్శక నిర్మాత అచ్యుతరెడ్డి గారు నన్ను పిలిపించి సిట్యుయేషన్ చెప్పారు. నలుగురు కుర్రాళ్ళు, ఒకమ్మాయి కలిసి క్లబ్‌కి వెళ్తారు. అక్కడ జరిగే గలాటా సాంగ్‌గా యూత్‌ఫుల్‌గా ఓ పాట రాయమన్నారు. నే నేపాట రాసినా ఓ థీమ్ పెట్టుకుంటాను. ప్రేమించమని చెప్పాలనంటే దానికి తగ్గట్టుగానూ, ప్రేమించొద్దంటే ఆ రీతిలోనూ.... ఇలా ఒక పాయింట్‌ని బేస్ చేసుకుని మెసేజ్ భరితంగా రాయాలనుకుంటాను. 'తాతల నాటి నేతుల వాసన' అని నేను రాసిన ఆ పాటలో జీవితంలో ఓ కొత్త కోణాన్ని ఆవిష్కరించడానికి ప్రయత్నించాను".

## నేను నిన్ను ప్రేమిస్తున్నాను

ఈ చిత్రం మ్యూజిక్ గురించి యువ సంగీత దర్శకుడు శశిప్రీతమ్ ఏమంటున్నారంటే- "టైటిల్‌కి తగి నట్టుగా యూత్‌ఫుల్ మ్యూజిక్ చేసాను. ఈ మధ్య దేశభక్తి ప్రేరిత పాటలు శ్రోతల్నీ ఎక్కువ అలరిస్తున్నాయి. 'హలో ఇండియా' పాట ఆ కోవకు చెందుతుంది. యూత్ పాడుకునే విధంగా విభిన్న కోణంలో ఈ పాటని తీర్చిదిద్దడం జరిగింది. డా. సినారె, వేటూరి, సిరివెన్నెల మూడు పాటలు రాసారు. వాళ్ళు ముగ్గురూ కలిసి ఇంతకుముందు ఏ ఆల్బమ్‌లో రాసారో తెలీదుగానీ, నాకు మాత్రం ఫస్ట్‌టైమ్. సినీ సాహిత్యంలో ఉత్తమ విలువలు పాటించే రచయితలు వాళ్ళు. ఈ ముగ్గురు అగ్ర రచయితలతో పాటు విజయాదిత్య, గుండేటి రమేష్ అనే ఇద్దరు కొత్త రచయితలు కూడా పాటలు రాసారు. హిందీలో షారూఖ్‌ఖాన్‌కి ఎక్కువగా పాటలు పాడే అభిజిత్ తెలుగులో తొలిసారిగా పాడారు" అని వివరించారు.






నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత,
జర్నలిస్టు, నటుడు
**రావికొండలరావు**
రాసిన వ్యాసమిది



# "జోకుల 'పుట్ట' ప్రసాద్"







**పొట్టి ప్రసాద్ అనీ, గట్టివాడు. ఒక దశలో పొట్ట పెరిగితే, "పొట్ట ప్రసాద్"అని తన మీద తనే జోక్ పేల్చుకున్నాడు. 'సాగరసంగమం'లో "వచ్చారండయ్యా" "అవునండమ్మా" అంటూ అందర్నీ ఆకర్షించాడు. అంతకు ముందు చాలా సినిమాల్లో నటించినా, రెండు రెళ్లు ఆరు, రెండు జెళ్ల సీత, శ్రీవారికి ప్రేమలేఖ, రావుగోపాలరావు మొదలైనవి అతని 'జంధ్యాల మార్కు' సినిమాలు. స్టేజి మీద పులి. అక్కడే పెరిగాడు తొలినుంచి. కొర్రపాటి గంగాధరరావు "పెళ్లిచూపులు", భమిడిపాటి రాధాకృష్ణ "ఇదేమిటి?" - నాటిక, నాటకాల్లో ముఖ్యపాత్రధారిగా - 'మాస్టర్' చేశాడు. మంచి డైలాగ్ టైమింగ్ వుండేది. మొహం కూడా రేలంగి లాగా, హాస్యం తొణికే ముఖం. "అందుకే నన్ను అందరూ, అందలం ఎక్కించారు. "నువ్వు సినిమాల్లో జేరిపో జేరిపో, రేలంగిని కొడతావు" అని బెజవాడ నుంచి తోలేశారు. ఎవర్ని కొడతానో ఏమిటో గాని, ప్రస్తుతం ఎండదెబ్బ కొడుతోంది" అనే వాడు వేషాల కోసం సైకిలు మీద తిరుగుతున్న రోజుల్లో.**

అలాగే ఇంకో జోక్ చెప్పేవాడు. "నువ్వు సినిమాల్లో చేరిపోరా, స్టారువవుతావు - అని అందరూ అన్నారని, మద్రాసు పరుగెత్తి వచ్చేశా. స్టారవడం మాట ఎలా వున్నా, తిండీ తిప్పాలేక స్టార్వవుతున్నా ప్రస్తుతం!"

వీలు దొరికినప్పుడల్లా జోక్ వేస్తూ నవ్వించిన ప్రసాద్ బి.కామ్. చదివాడు. నాటకాలు అలవాటు చేసుకుని, బెజవాడలో రసన సమాఖ్య నాటకాల్లోనూ, మద్రాసు వచ్చాక ఆంధ్ర ఆర్ట్స్ నాటకాల్లోనూ విరివిగా పాల్గొన్నాడు. పరిషత్తు నాటక పోటీల్లో నాలుగైదుసార్లు 'ఉత్తమ హాస్య నటుడు' బహుమతులు అందుకున్నాడు. పొట్టి ప్రసాదు, రాజబాబు ఇద్దరు మంచిమిత్రులు. ఇద్దరూ పై నాటక సంస్థల్లో కలిసి నటించారు. ఐతే, రాజబాబు కమేడియన్‌గా స్థిరపడి, టాప్‌కి వెళ్లాడు. ఒక అవుడ్డోర్ షూటింగ్ అయిపోయిన తర్వాత, అందరూ ఒక వ్యాన్ ఎక్కుతున్నారు. "ఒరే రాజబాబూ! నువ్వు లోపల ఎక్కకురా" అన్నాడు ప్రసాద్. "లోపల చోటు లేదా?" అని రాజబాబు అడిగాడు. "ఉందనుకో. నువ్వు టాప్ మీద ఎక్కు. టావ్ స్టార్‌వి కదా" అని చమత్కరించాడు ప్రసాద్.

మద్రాసులో రసన సమాఖ్య వారు "ఆకాశరామన్న" వేస్తే విజయా చక్రపాణి గారూ వాళ్లు వచ్చారు. ప్రసాద్ ఆకర్షించాడు. మర్నాడే చక్రపాణిగారిని కలిశాడు. దాని ఫలితం - 'అప్పుచేసి పప్పుకూడు'లో చిన్నవేషానికి టెలిగ్రాం ఇచ్చి రప్పించారు - విజయావారు. అది - అతని మొదటి సినిమా వేషం. ఓ రెండు వందల సినిమాల తర్వాత, చివరిగా వేసింది - "బృందావనం" (అదీ విజయావారిదే, చందమామ విజయా కంబైన్స్)లో. బి.ఎన్.రెడ్డిగారు డైరక్టు చేసిన 'పూజాఫలం'లో మంచి హాస్యపాత్ర చేశాడు. "చచ్చాననుకో. రేలంగి, రమణారెడ్డిగార్ల మధ్య నటించవలసి వచ్చింది. అమ్మో! దడ. 'బాగా చెయ్యవయ్యా ప్రసాదూ, భయపడకు' అన్నారిద్దరూ ఓ రోజు షూటింగులో. 'మీరిద్దరూ లేకపోతే, చెయ్యగలను సార్. డైరెక్టర్‌గారితో చెప్పి, మీ యిద్దరూ ఈ సీన్లో లేకుండా చెయ్యలేరూ?' అని అడిగాను వణుకుతూ" అని చెబుతూ వుండే వాడు ప్రసాద్.

బాపుగారి దర్శకత్వంలో నటిస్తున్నాడు ప్రసాద్. కొంచెం ఓవర్ చేశాడు. "ప్రసాద్ గారూ! అంతవద్దు కొంచెం తగ్గించి చెయ్యండి" అన్నారు బాపుగారు. "అంతవద్దా - అలాగే. దాందేం వుంది. నా టాలెంట్ నా దగ్గరే వుంటుంది - మరీ మంచిది" అని చమత్కరిస్తే బాపుగారు నవ్వేసి వూరుకున్నారు. ఎయిడ్స్ వ్యాధి గురించి అంత బాగా అందరికీ తెలియని రోజుల్లో ఒక నటి ట్రూప్‌తో అమెరికా వెళ్లి వచ్చింది. "అక్కణ్నుంచి ఏం తెచ్చుకున్నావమ్మా" అని అడిగాడు ప్రసాద్. ఆమె చెప్పింది. "మరి ఎయిడ్స్ తెచ్చుకోలేదా?" అన్నాడు ఆమెకు అర్థం కాలేదు - పేరు ఎక్కువ ప్రచారంలో లేదు గనక. "టైమ్ లేదండీ, ఇంకేం తెచ్చుకోడానికీ" అనేసింది అమాయకంగా. ఆ మాట పట్టుకుని అందరితోనూ చెప్పి ఆమెను ఏడిపించాడు. అలా ఏడిపించిన వాడికి, తననీ ఏడిపించిన సందర్భాలెన్నో వున్నాయి.

కె.వెంకటేశ్వరరావు నాటకాల్లో వేస్తున్నప్పుడు అందరూ రాజమండ్రి వెళ్తున్నారు. దార్లో వెంకటేశ్వరరావు మీద జోకులు పేలుస్తు ఏడిపించాడు ప్రసాద్. వెంకటేశ్వరరావు స్టేషన్లో దిగుతూనే, దూరంగా వున్న ప్రసాద్‌ని టిక్కట్ కలెక్టర్‌కి చూపించి, "అతనెవడో గాని, రైల్లో చాలా న్యూసెన్స్ చేశాడండి. టిక్కట్టుందో లేదో అడగండి" అన్నాడు - తన దగ్గరున్న గ్రూప్ టిక్కెట్టు ఇచ్చేస్తూ. అంతే! టిక్కట్ కలెక్టరు ప్రసాద్‌ని పట్టుకున్నాడు. పక్కన నిలబడమన్నాడు. వెళ్లి పోతున్న వెంకటేశ్వరరావును, తక్కిన వాళ్లనీ పేరు పేరునా పిలిచాడు పొట్టి ప్రసాద్ - ఎవరూ వినిపించుకోలేదు . "ఆ ట్రూప్ వాడినండీ నేను కూడా" అని మొరపెట్టుకుంటే టిసి వినిపించుకోలేదు. మొత్తానికి కళ్లనీళ్ల పర్యంతం అయితే, అసలు విషయం వివరించి, వెంకటేశ్వరరావు విడిపించాడు - ఏడిపించిన వాడిని ఏడిపించి.

ఓ చిన్న షూటింగులో ప్రసాద్‌ని జోక్ చెప్పమని అడిగారు! "చిన్నప్పుడు మా మాస్టారు పాఠం చెబుతూ, ఒక మణుగు పత్తి బరువా? మణుగు ఇనుము బరువా? అని అడిగారు. అందరూ, రెండూ ఒకటే అన్నారు. నేను మాత్రం 'ఇనుమే మాస్టారూ' అన్నాను. 'ఎలారా?' అని ఆయన కళ్లెర్ర చేశారు. 'మాస్టారూ! మీరు కింద కూచోండి. నేను కుర్చీ మీద నిలబడి, ముందు పత్తి బస్తా మీ మీద వేస్తాను - తర్వాత ఇనుము వేస్తాను. - మీకే తెలుస్తుంది. ఏది బరువో!' అన్నాను. మాస్టారు 'ఓరి వెధవా' అన్నాడు - అందరూ నవ్వారు".

ఇక్కడా అందరూ నవ్వారు. "థాంక్స్ ఐతే ఈ జోక్ నాది కాదు. ఎవరో చెప్పింది నేను కొట్టేసి, నాదని చెప్పాను" అన్నాడు ప్రసాద్ (బి) కామ్‌గా. దీనికీ నవ్వారు అందరూ.

ఎన్.టి.రామారావుగారి సినిమాలో వేస్తున్నప్పుడు ప్రసాద్ మెడలో ఒక మఫ్లర్ వేశారు ఆ పాత్రకి. ప్రసాద్ షాట్ లేనప్పుడు ఎక్కడెక్కడో తిరిగి ఆ మఫ్లర్ పారేశాడు. అది కంటిన్యుటీ. ఎంత వెతికినా, దొరకలేదు. సెట్లోకి రాగానే రామారావుగారు ఛెడామడా కేకలు వేశారు. "అంత నిర్లక్ష్యం ఏమిటి? కంటిన్యుటికీ ఏం చెయ్యాలి?" అని ఆగ్రహించారు. ఆయన ఆగ్రహం తగ్గించాలంటే జోక్ వెయ్యాలనుకుని, "ఇంకా నయం సార్, షర్ట్ పారేసుకోలేదు" అన్నాడు. దాంతో ఆయన ఆగ్రహం మరింత తీవ్రమైంది. కళ్లు మరింత ఎర్రబడ్డాయి. ఆ ఎరుపు దనానికి ప్రసాద్ కళ్లు నీళ్లు కార్చాయి. కాళ్ల మీద పడి క్షమించమన్నాడు - ఆయన లేవనెత్తేవరకు.

"ఒక పాఠం నేర్చుకున్నాను. జోక్ ఎప్పుడు చెయ్యాలో, ఏ సందర్భంలో చెయ్యాలో, ఎవరి దగ్గర చెయ్యాలో, ఏ మూడ్‌లో చెయ్యాలో - అప్పుడు చెయ్యాలి" అన్నాడు. ఐనా, పెద్దా చిన్నా లేకుండా ఏదో ఒకటి అంటూనే ఉండే వాడు - అందర్నీ. వ్యక్తిగతంగా అతన్ని ఎరిగున్నవాళ్లు - ఆ జోకులు చెప్పుకుంటూ, నవ్వుకుంటూనే వుంటారు - ఎప్పటికీ.

## జస్ట్ ఫర్ ఫన్

### కిడ్డీ బ్యాంక్



ఓ చిన్న కుర్రాడు షాపులో వాచీ దొంగిలిస్తూ ఖర్మంచాలక దొరికిపోయాడు. పోలీసులు వాణ్ణి పట్టుకుపోయి లాకప్‌లో పడేసారు. అప్పటికే లాకప్‌లో ఓ సీనియర్ దొంగ ఉన్నాడు. సీనియర్ జూనియర్ని సాదరంగా ఆహ్వానించి విషయం తెలుసుకుని బోలెడు జాలిపడిపోయాడు.

"అనుకుంటాం గానీ వాచీల్లాంటి చిన్న చిన్న వస్తువులు దొంగిలిస్తే ఏమొస్తుంది? ఊరికే టైం వేస్టు. ఏదైనా బ్యాంకుని దోచుకోరాదూ, బోలెడు డబ్బులొస్తాయి." అంటూ చోరోపదేశం చేశాడు సీనియర్.

"చెయ్యొచ్చుగానంకుల్, మా స్కూలు వదిలే సరికి బ్యాంకులు మూసేస్తారుగా!" అమాయకంగా అన్నాడా స్టూడెంట్ నెంబర్ వన్.

-గోపి

సీరియల్

2

# సద్దాం ఆంటీ ఇంటి కథ



-మల్లాది వెంకట కృష్ణమూర్తి



**ఆ రోజు పౌర్ణమి.**

ఆకాశంలో గుండ్రంగా నిండుగా సూర్యుడు దర్శనం ఇస్తున్నాడు. పౌర్ణమైనా చంద్రుడు కనిపించక పోవడానికి కారణం అప్పుడు టైం ఉదయం ఏడున్నర.

స్నానం చేయడానికి దొడ్లోకి వచ్చిన వెంకటరత్నం ఠక్కున ఆగిపోయాడు. విచ్చుకున్న గులాబిని చూసి ఓసారి ప్రేమగా ఆ చెట్టు మీద చరిచి చెప్పాడు.

"ఆహా! ఎంత అద్భుతంగా వుందండీ తమరి గులాబి. ఏం రంగు? ఇంత చక్కటి లేత గులాబి రంగుతో ఇంత ముద్దుగా వుండే గులాబి పువ్వు పూయడం ఇంకే చెట్టుకైనా సాధ్యమా చెప్పండి?

**జరిగిన కథ**

అనగనగ ఓ బామ్మ. వయసుతో సంబంధంలేని కుర్ర మనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీతారల పౌరాణిక గెటప్పులలోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పనిచేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటో భాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి.

ఏం సువాసనండి?"

ఆ ఇంటి గోడ మీంచి ఏడడుగుల ఎత్తులో ఓ పంపు గొట్టం బయటికి అడుగున్నర దూరం పొడుచుకు వచ్చింది. అయితే ఆ గొట్టం చివర పంపునాబ్ లేదు. నడుం చుట్టూ వున్న టవల్‌ని తీసి చేతికందేంత దూరంలో వున్న మేకుకి తగిలించి, పక్కనే వున్న మోటార్ స్విచ్‌ని ఆన్ చేసాడు వెంకటరత్నం. వెంటనే బోరింగ్ పంపుకి కనెక్ట్ చేయబడ్డ మోటార్ ఆన్‌అయి క్షణాల్లో ఆ పంపుగొట్టం లోంచి నీళ్ళు ధారగా కిందకి కారసాగాయి.

డ్రాయర్‌తో వున్న వెంకటరత్నం ఆ నీటి కిందకి చేరి ఆనందంగా స్నానం చేయసాగాడు. ఒళ్ళు తడవడానికి గుండ్రంగా తిరుగుతున్న వెంకటరత్నం, పైన ఆకాశంలో కనబడుతున్న పూర్ణ సూర్యుడ్ని చూసి ఠక్కున ఆగిపోయాడు.

"ఆహోహో... వెలుగంటే మీదే కదండి. ఉదయం ఎంత బాగా వుదయించారండి. ఆ గుండ్రం చూడండి. అంతటి గుండ్రం ఇంకెవరికైనా వుందా చెప్పండి. ఒక్కరోజు మీరు రాకపోతే లోకం తల్లడిల్లపోదుటండి. ఊరికే రాస్తారుటండీ ఆదిత్య హృదయం మీలాంటి వారిమీద. కారణ జన్ములు కదండి మీరు".

అక్కడికి వచ్చిన ఓ భారీశాల్తీ ఆ మాటలు ఆశ్చర్యంగా విన్నది. ఆ శాల్తీ చెయ్యి మోటార్ స్విచ్ మీద వడింది. దాన్ని ఆఫ్ చేయడంతో గొట్టంలోంచి నీళ్ళు కారడం ఆగిపోయింది. వెంకటరత్నం తల తిప్పి స్విచ్ ఆఫ్ చేసిన ఇంటాయన్ని చూసి అడిగాడు.

"అదేం పని సార్, నేను సగం స్నానంలో వుండగానే?"

"స్నానంలో లేవు నువ్వు. పొగడ్తల్లో వున్నావు కాని... ఎవర్ని? సూర్యుడ్నేనా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడాయన.

"అవును. శివరావు గారూ".

"నీకిదేం పిచ్చి వెంకటరత్నం? ఆ సూర్యుడ్ని పొగిడితే వాడికి వినబడి చస్తుందా? వినపడ్డా అర్థం అవుతుందా? ఒకవేళ అర్థమైనా నీకేం హెల్ప్ చేయగలడు?"

"అబ్బ! ఎంత గొప్ప పాయింట్ పట్టేసారండి మీరు? అసలు మీ పేరు శివరావు అని కాకుండా మీరు బుద్ధికి బృహస్పతి కాబట్టి మీ అమ్మ, నాన్నలు..."

"పొగడ్తలాపు" విసుగ్గా అడ్డుపడ్డాడు శివరావు.

"నేను మిమ్మల్ని పొగడ్తున్నానని కనిపెట్టేసారంటే మీరు సామాన్యులు కాదండి బాబూ. ఆవులిస్తే పేగులు లెక్కెట్టేయగల సమర్థులు కదండి".

"ఆపవయ్యా. నోరు తెరిస్తే పొగడ్తలు తప్ప ఇంకేం రావా నీకు? ఇది హైద్రాబాదయ్యా. ఏలూరు, బందరు కాలువలు పారే బెజవాడో, గోదావరి వడ్డున వున్న రాజమండ్రో కాదయ్యా. రోజు విడిచి రోజు నీళ్ళు వదిలే హైద్రాబాద్ - ఎల్లుండి కాని నీళ్ళు రావు మళ్ళీ. మాలా బక్కెట్లోంచి మగ్‌తో నీళ్ళు పోసుకోలేవూ".

"మీరు ఎంత ఇండైరెక్ట్‌గా బెజవాడని, రాజమండ్రిని పొగిడి, హర్ట్ అవకుండా హైద్రాబాద్‌ని తిట్టారో మీకు తెలుసాండీ? అది సంస్కారవంతుల లక్షణం సుమండీ".

"నీ మొహం మండా. మళ్ళీ పొగడ్తా? చేసిన స్నానం చాలు కాని లోపలకి వెళ్ళు".

"ఇటు వైపు అసలు తడుందేమో ముట్టుకు చూడండి". మోకాళ్ళ కింద భాగం చూపించాడు వెంకటరత్నం.

"ఓ పని మీదున్నప్పుడు దానిమీద శ్రద్ధ వుండక్కర్లా? అటు నీళ్ళు కారి పోతుంటే, అటు సూర్యుడ్ని పొగుడుతావేం? పొగడక పోతే సూర్యుడు వెలుగునివ్వడా? నీళ్ళు వృథా చేయడానికి సిగ్గులేదూ? ఎన్ని సార్లు చెప్పాలి నీకు? అసలు నా ఇల్లు ఖాళీ చేసేయ్ ముందు".

"అబ్బ! మీరు అందరిలాంటి వాళ్ళు కారు మాస్టారూ. అస్సలు కోపం దాచుకో లేరు. ఇట్లాంటి భోళాశంకరులు కనకే శివరావు అనే పేరు పెట్టి వుంటారు మీ పెద్దవాళ్ళు. మనసులో మాటా ఇల్లా నిక్కచ్చిగా ఎందరు బయటికి మొహం మీద చెప్పగలరండి? కాస్త ఆ స్విచ్ వేస్తారండి?"

తడిసి తడియని వెంకటరత్నం వంటిని చూసి చెప్పాడు శివరావు. "సరిగ్గా నిమిషం అంటే నిముషం సేపే వేస్తాను. రెడీ? వన్... టు... త్రి" చేతి గడియారంలోని సెకన్ల ముళ్ళు చూసుకుని స్విచ్ వేసాడు. శివరావు. మళ్ళీ నీళ్ళు గొట్టంలోంచి రాసాగాయి.

"ఆహాఁ. ఏం జలపాతం అండి. మీరు.... నయాగరా ఫాల్స్‌కి మునిమనవరాలి తమ్ముడులా వున్నారండి" ఆ నీటి ధారని పొగిడే పనిలో పడ్డాడు వెంకటరత్నం.

"అదిగో. మళ్ళీ! టకటక సబ్బు రుద్దుకోవయ్యా మగడా ముందు"

గడియారంలోని సెకన్ల ముల్లు ప్రకారం నిముషం తర్వాత స్విచ్ ఆఫ్ చేసాడాయన.

"నిముషం అయిందాండి?" అడిగాడు వెంకటరత్నం.

"పూర్తిగా"

"ఆహాఁ పంక్చ్యువాలిటీ అంటే తమరిదే కదండి... ఇక్కడ కొద్దిగా సబ్బుందండీ ఇంకా".

"ఉంటే ఉండనీ. ఇంట్లో బిందెలో నీళ్ళని గ్లాసుతో తీసుకుని కడుక్కో. పద".

"తమరి బొంద. చచ్చు సలహా. నాకూ ఓ స్వంతిల్లుందన్న సంగతి మర్చిపోకండి. దీనికన్నా పెద్దది. ఆ ఇంటి బాత్‌రూంలో మీ ఇల్లంతా పడుతుంది తెలుసాండీ?"

"చాలాసార్లు విన్నాం మీ ఇంటి పొగడ్తలు కాని ఒక్కసారికూడా చూపించమంటే చూపించవే?"

"దూరం నించి చూపించడం కాదండి. ఆ శుభముహూర్తం వచ్చినప్పుడు అటు ఇటు కొబ్బరి మట్టలు, అరటి బోదెలు కట్టిన ఆ ఇంటి గేటు ముందు దర్జాగా నిలబడి మిమ్మల్ని గృహ ప్రవేశ మహోత్సవానికి ఆహ్వానిస్తానండి 'వెంకటరత్నం ఎంతో కోపంగా పలికాడా మాటలని'. కోపంలో శివరావు మీది కోపం భాగం కేవలం రవ్వంతే.

మిగిలిన భాగం అంతా ఆ ఇల్లు ఇంకా తన స్వంతం కానందు వల్ల కలిగిన అసంతృప్తిలోంచి కలిగిన కోపం. ఆ కోపం తన విధి మీద.

"ఇంతకీ ఏ వూళ్ళోనయ్యా ఆ ఇల్లుంది?" అడిగాడు శివరావు.

"ఈ ఊర్లోనేనండి. మనకి బాగా దగ్గర్లోనేనండి. అది నాదవడానికి వున్న చిన్న అడ్డంకి ఒక్కటీ తీరగానే ఆ ఇంట్లో హండ్రెడ్ హెచ్‌పి మోటార్ పెట్టించుకుని ఏనుగు తొండానికి డబుల్ సైజ్ గొట్టం పెట్టించుకుంటానండి. కుర్తాళం జలపాతం కింద స్నానం చేసినట్లుంటుందండి అప్పుడు".

వెంకటరత్నం ఠక్కున స్విచ్ నొక్కి వచ్చిన నీళ్ళతో సబ్బుని వదిలించుకున్నాడు - దాన్ని



శివరావు ఆఫ్ చేసేలోగా.

"ఇప్పుడు మీకు నా మీద వచ్చిన కోపం వుంది చూసారండి. నా సామిరంగాండి. ఏ ఇంటి యజమానికీ తనింట్లో అద్దెకున్న వాడి మీద వచ్చే కోపం దానిముందు పనికి రాదండయ్యా".

అతని పొగడ్తలు వినలేక అక్కడనుంచి శివరావు కదిలాడు. వెనకే టవల్‌తో వీపు తుడుచుకుంటూ నడిచాడు వెంకటరత్నం.

ఇంట్లోకి వచ్చిన భర్తని చూసింది జయశ్రీ.

"ఏమండి. ఇది విన్నారా?" అడిగింది ఆనందంగా.

"ఎవర్ని దెప్పబోతున్నావు?" ఎదురు ప్రశ్న వేసాడు వెంకటరత్నం.

"మీరు ఇల్లు అద్దంలా నీట్‌గా వుంచుకుంటుందంటారే కల్పన గారు... వాళ్లింట్లో ముందు గదిలో టి.వి ముందు నా కంట్లో నలక పడిందండి. తీసాను. ఇదిగో చూడండి..." చెయ్యి చాపింది.

"జయా. నీకో సంగతి తెలుసా? మనది మేడ్‌ఫర్ ఈచ్ అదర్ దాంపత్యమే" ప్రేమగా చూస్తూ చెప్పాడు వెంకటరత్నం.

"అదేం?"

"నాకు ఎదుటి వాళ్ళల్లోని మంచే కనిపిస్తుంది. నువ్వు వాళ్ళలోని చెడ్డే చూస్తావు".

"అన్నయ్యా. ఇదిగో నిన్న నువ్వు వంద నోట్లిచ్చి బేంక్‌నించి పదులు తెమ్మన్నావుగా. తెచ్చాను" చెప్పాడు వెంకటరత్నం తమ్ముడు నిరుపమ్ ఓ కొత్త పదిరూపాయల కట్ట ఇస్తూ.

"మీ అన్నయ్యకి ఇదేం పిచ్చో కాని పాత నోట్లు వస్తే వాటిని కొత్త నోట్లుగా మారిస్తే కాని నిద్ర పట్టదు".

"నీట్‌నెస్ మైడియర్ బెటర్ హాఫ్. దాన్ని నీట్‌నెస్ అంటారు" చెప్పాడు వెంకటరత్నం నవ్వుతూ.

"ఇంటాయన అరుస్తున్నాడేమిటన్నయ్యా?" ప్రశ్నించాడు నిరుపమ్.

"టాపిక్కా? ఆయన పిసినారి తనవే ఆయన్నలా అరిచేలా చేస్తుంది. నిన్న కరెంట్. మొన్నగోడకి మేకులు, ఇవాళ నీళ్లు. టాపిక్ మారుతూంటుంది తప్ప అరుపులు మాత్రం మారవు".

"మనకి స్వంతిల్లు వచ్చాక దాన్నెటూ అద్దెకిస్తాంగా. అప్పుడు ఇంట్లో అద్దెకున్న వాళ్ళని కన్న బిడ్డల్లా ఎలా చూసుకోవాలో నాకి ఇంట్లో ట్రైనింగవుతూందండి. నిన్న కరివేపాకు రెండు రెమ్మలు కోసానని, ఆ చెట్లుని చంపేస్తున్నాని ఇంటావిడ ఎన్ని మాటలందో" చెప్పింది జయశ్రీ.

"స్వంతిల్లు! ఆ మాటే గుర్తు చేయకు వదినా. మనకీ జన్మలో స్వంతిల్లంటూ ఏర్పడదు" నిరుపమ్ ఎంతో దిగులుగా చెప్పాడు.

నిరుపమ్ భుజం తట్టి చెప్పాడు వెంకటరత్నం.

"ఒద్దొద్దు. నిరాశ నిస్పృహలు, నిట్టూర్పులు వద్దనే వద్దు. లంకంత మన ఇల్లు మన చేతుల్లోకి ఖచ్చితంగా వచ్చి తీరుతుంది. ఆ శుభ సమయం అట్టే దూరంలో లేదు".

"ఈ మాట నే పుట్టినప్పట్నించీ వింటున్నాను" చెప్పాడు నిరుపమ్.

"చిన్నవాడివి. నీకు ఓపిక తక్కువ. కాస్తంత ఓపిక పట్టాలి"

"నేను చచ్చేదాకానా?" కోపంగా అరిచింది జయశ్రీ.

"ఏమిటోయ్ అకస్మాత్తుగా తేలు కుట్టినట్టు?" విసుక్కున్నాడు వెంకటరత్నం.

"మీ తాతగారు ఓపిక పట్టారు. ఏమైంది?" అడిగింది జయశ్రీ, అదే కోపంతో.

"పైకెళ్ళిపోయారు" చెప్పాడు నిరుపమ్.

"మీ నాన్నగారు ఓపిక పట్టారు. ఏమైంది?" మళ్ళీ ప్రశ్నించింది జయశ్రీ.

"పైకెళ్ళి పోయారు" చెప్పాడు నిరుపమ్.

"ఆఖరికి మీ బాబాయి కూడా ఓపిక పట్టారు. ఏమైంది?"

"ఆయన టపా కట్టాడు" చెప్పాడు నిరుపమ్.

"ఈ జన్మలో మనకా ఇల్లు రాదు. అది వస్తుందని ఆశపడి సొంతిల్లు ఏర్పరచుకోకుండా ఈ అద్దె ఇంట్లో తెచ్చి పడేసారు నన్ను. పక్క వాళ్ళ వాకిలి కూడా నేనే ఊడ్చాలి. లేదా రావీ, బాదంఆకులు ఎత్తిపోసి శుభ్రం చేసే నాథుడే లేడీ కాంపౌండ్‌లో" జయశ్రీ తన బాధని వెళ్ళగక్కింది.

"ఓం శాంతి" చెప్పాడు వెంకటరత్నం మృదువుగా.

***

బ్యాంక్ నించి వచ్చిన అనన్య తన బామ్మ గదిలోకి వెళ్ళింది.

"బామ్మా ఈ రోజు..." అని బామ్మ చేసే పని చూసి ఆగిపోయింది. ఆవిడ తన 'మెడికల్ కేర్ టైం'లో వుందని గ్రహించింది. చేతికి ఇంజక్షన్ చేసుకుంటోంది ఆవిడ.

ఆవిడకి డయాబెటిస్ వుందని నలభై రెండో ఏట కాలికైన ఓ గాయం మానక పోవడంతో వైద్య పరీక్షలో నిర్ధారణ అయింది. అప్పటి నించి ఆవిడ నిత్యం ఇన్సులిన్‌ని ఇంజెక్ట్ చేసుకుంటుంది.

అదయ్యాక బిపి అపార్టస్‌ని తన కుడి చేతికి చుట్టుకుని గాలి నొక్కి స్టెతస్కోప్‌ని చెవులకి తగిలించుకుని చేతి నరం దగ్గర స్టెత్‌ని వుంచి బిపి చూసుకుంది.

ఆవిడకు స్వల్పంగా బి.పి వుంది. అది చూడడానికి తరచూ డాక్టర్ ఇంటికి వచ్చేవాడు. అలాగే ఇన్సులిన్ ఇంజక్షన్ ఇవ్వడానికి కాంపౌండర్ వెంట వచ్చేవాడు. ఖర్చులు తగ్గించడానికి ఆవిడ తనకి తనే ఇంజక్షన్ ఇచ్చుకోవడం బి.పి. చూసుకోవడం నేర్చుకుంది. అప్పటి నించి ఆ రెండు పనులూ ఆవిడే చేసుకుంటోంది.

"నార్మలేనా బామ్మా?" అడిగింది అనన్య.

"కొద్దిగా అటు, ఇటు.... నార్మల్ కిందే లెక్క"

"నువ్వు బర్గర్‌లు, పిజ్జాలు తగ్గిస్తే, ఆ అటు







బొమ్మలు: ఎమ్మెస్ రామకృష్ణ

# కామెడీ సీరియల్

ఇటు కూడా పోయి నార్మల్‌కి వస్తుంది బామ్మ" మందలించింది బామ్మని.

'జిహ్వా చాపల్యం పిల్లా".

"నే చెప్పేదీ అదే. దాన్ని తగ్గించుకోవాలి".

"ఎనభై ఏడే ఇప్పుడు నాకు. అంటే ఎప్పుడు పోయినా ఫర్వాలేని వయసు".

"అందుకని ఆరోగ్యం నాశనం చేసుకుంటావా? నిద్రలేవగానే రోజూ ఓ చుక్క వేపనూనె గొంతులో వేసుకోమన్నానా లేదా? రోజు విడిచి రోజు కాకరకాయకూర తినమన్నానా లేదా? ఇవన్నీ వదిలేసి ఆ ఫాస్ట్ ఫుడ్స్ వెంట పడతావే?"

"చూడు తల్లీ. నీకేం? మహారాణిలా, ఇంటర్నెట్‌లు, ఫాస్ట్‌ఫుడ్ కార్నర్‌లు, అనేక ప్రైవేట్ టి.వి ఛానళ్ళూ వచ్చే టైంలో పుట్టావు. నేనో? రేడియోనే గొప్ప, గ్రామ్‌ఫోనే లగ్జరి అనే టైంలో పుట్టాను. అందర్నీ తీసుకుపోయి, దేవుడు ఇంతకాలం నన్నుంచింది ఇవన్నీ ఎంజాయ్ చేయడానికే అనుకుంటున్నాను. చెప్పాగా ఇంకో పదమూడేళ్ళు బ్రతికి నిండు నూరేళ్ళు అనిపించుకునే కంటే, వీటిని ఎంజాయ్ చేస్తూ ఏ తొంభై ఎనిమిదో ఏటో, తొంభై తొమ్మిది లోనో రాలిపోతే చాలు అని".

"బామ్మా. నీకు ఆయుర్దాయం విషయంలో ఎంతాశ?" నవ్వుతూ చెప్పింది అనన్య.

"అది ప్రతీ జీవికి వుండే పేరాశే కదే".

ఆవిడ మల్టీ విటమిన్ కేప్సుల్స్, ఐరన్ టానిక్, బి.కాంప్లెక్స్ టేబ్లెట్స్ వేసుకుంది.

"వెరీగుడ్! ఇంక ఈ రోజుకి నీకు ఢోకా లేదు" చెప్పిందావిడ.

"బామ్మా ఈ రోజు రాత్రి నాకు తోడుగా మేలుకుని వుంటావా?" అడిగింది అనన్య.

"దేనికి?"

"ఇవాళ శివరాత్రి కదా బామ్మ. రేపెలాగు ఆదివారం బేంక్‌కి సెలవు. అందుకని జాగరణ చేద్దామని".

"రాత్రికి టివి ఛానళ్ళలో ఏం సినిమా వేస్తున్నారో పేపర్ చూసి చెబుతాలే" ఆవిడ పేపర్ తిరగేసి విసుక్కుంది.

"ఛ! దక్షయజ్ఞం, భూకైలాస్, కాళహస్తి మహత్మ్యం. కాస్తంత మేలుకొని ఇంట్రెస్టింగ్‌గా చూడ్డానికి ఏ మణిరత్నం గీతాంజలో, రాజీవ్ మీనన్ మెరుపు కలలో వెయ్యచ్చుగా? మరీ అలా బ్లాక్ అండ్ వైట్ పౌరాణికాలు వెయ్యకపోతే".

"అబ్బబ్బ బామ్మా" కోపంగా చెప్పింది అనన్య.

"ఏమిటే ఇప్పుడేమన్నానని! కనీసం నాగార్జున 'శివ' లేదా చిరంజీవి 'శివుడు శివుడు శివుడు' లేదా రాజశేఖర్ 'శివయ్య' వెయ్యచ్చు గదటే"

"లివ్ అప్ టు యువర్ ఏజ్ బామ్మా. నీ వయస్సుకు తగ్గట్లుగా వుండు".

"వెర్రిదానా వద్దనుకున్నా వంటికి వయసొచ్చింది కాని తెచ్చుకుందామన్నా మనసుకి రావడం లేదే. నాది యంగ్ బ్లడ్. ఆటోగ్రాఫ్ కోసం వెళితే తరుణ్ నన్ను చూసి డంగై పోయాడనుకో. అది సరే కాని నీ బేంక్ విశేషాలేంటీ?"

"డబ్బు వెయ్యడం, తియ్యడం తప్ప ఏముంటాయ్?"

"ఐమీన్ నీ కొలీగ్స్ విశేషాలే".

"బామ్మా - ఏమిటి నీ వుద్దేశం?"

"అతగాడి పేరేమిటే? పేరు చెప్పగానే సిగ్గు పడతావు?"

"నేను ఎవరి పేరు చెప్పలేదు. ఎప్పుడు నీ ముందు నేను సిగ్గుపడలేదు".

"విషయం డైరెక్టుగా అడిగితే చెప్పిచావవు కదే. అందుకని అలాగా అడుగుతున్నాను. చెప్పవే మీరిద్దరూ 'ఐ లవ్ యూ' స్టేజికి వచ్చారా లేదా ఇంకా?"

"శివరాత్రి నాడు మాట్లాడడానికి నీకింకేం మంచి టాపిక్ దొరక లేదా బామ్మా?".

"అది కాదే. సినిమాలో బామ్మలా నేను కన్ను మూయకముందే నీకు పెళ్ళి చేయద్దుటే? అందుకని అడుగుతున్నాను".

"సమ....."

"............యం వచ్చినప్పుడు చెప్తానంటావ్. ఏజ్ యూ లైకిట్. కాని అప్పటి దాకా బ్రతికి వుంటానో లేదో కదా. నాకు నువ్వు తప్ప ఎవరూ లేరు కదే. ఇంత పెద్ద ఇల్లు. స్థలమే కనీసం రెండున్నర కోట్ల విలువ చేస్తుంది. దాన్ని కట్నంగా సమర్పించి టపా కట్టేదామని నా తొందర".

"అవన్నీ రేపు మాట్టాడదాం బామ్మా"

"అర్థమైంది. ఇవాళంత భక్తి మూడ్. రేపు రక్తి మూడ్‌లోకి వచ్చాక మాట్టాడదాం అంటాం. నీతో ఆ విషయాలు సీరియస్‌గా మాట్లాడాలి తెలుసా?" చెప్పింది బామ్మా.

"అలాగే! రేపన్నాగా"

"నీవు తప్ప నాకు మాత్రం ఎవరూ ముందు వెనకలేరు కదటే".

"ఎప్పుడూ అడగనే లేదు. బామ్మా నీకు తోడబుట్టిన వాళ్ళు వున్నారా? ఎంత మంది?" అడిగింది అనన్య.

"ఎందుకడగలేదు? నీ చిన్నప్పుడు అడిగేదానివి"

"చెప్పు బామ్మా. అసలున్నారా లేరా?"

"ఎందుకు లేరు?"

"కాని వాళ్ళకి పెళ్ళిళ్ళయి పిల్లలు గలగలేదా? మన వంశంలో నేనొక్కదాన్నే ఎలా అయ్యాను బామ్మా?" అడిగింది అనన్య.

"పెళ్ళి చేసుకుంటే జాంబవతికి కూడా సంతానం వుండేది. కాని దానికి పెళ్ళి కాలేదు పాపం" చెప్పిందావిడ.

"జాంబవతెవరు? అసలదేం పేరు బామ్మా! ఆమెకి ఎందుకు పెళ్ళి కాలేదు? "ఆసక్తిగా అడిగింది అనన్య.

- (ఇంకా వుంది).



బొమ్మలు: ఎమ్మెస్ రామకృష్ణ

# జెండాపై కపిరాజుతో
# జ్వరాల్ని అడ్డుకున్న - హనుమద్దాసు!!

**1698 ఆ ప్రాంతాల్లో**
**గద్వాలు సంస్థానం ఏర్పడింది!**
**నిర్మించినవాడు పెదసోమభూపాలుడు....**
**ఈయన స్వయంగా**
**పండితుడు సంస్కృతములో జయదేవ మహాకవి**
**రాసిన 'గీతగోవిందాన్ని' తెలుగులో పద్యరూపంలో**
**రాశాడు... లలిత కళాభివృద్ధికి ఆయనెంతో కృషి**
**చేశాడు!! ఆయన తదనంతరం సంస్థానాన్ని**
**పరిపాలించిన విదుషీమణి...**
**మహారాణి ఆది లక్ష్మీదేవమ్మ బహద్దర్.**

ఈవిడ కాలంలోనే గద్వాల... విద్వద్గద్వాల ప్రసిద్ధి పొందింది. ప్రపంచ సంగీత - సాహితీ చరిత్రలలో ఇంతవరకు జరగని కనీవినీ ఎరుగని సంఘటన ఈవిడ హయాంలో జరిగింది!!

దసరా ఉత్సవాలు!!

యావద్భారత దేశంలోని కవులకు - గాయకులకు... సంగీత విద్వాంసులకు సంస్కృత పండితులకు ఆహ్వానాలందాయి.

సాక్షాత్తూ సరస్వతీ స్వరూపమైన ఆదిలక్ష్మీ దేవిగారి పర్యవేక్షణలో 'గద్వాల' మొత్తం పెళ్ళివారిల్లయిపోయింది!...

ఎటుచూసిన తోరణాలు - మంగళ వాయిద్యాలు....

కోటగుమ్మం నుంచీ సభ జరిగే వేదికవరకు సన్నని తెల్లని వెడల్పాటి గుడ్డ పరిపించారు.... కవులు - పండితులు - గాయకులు వంటి విద్వాంసులంతా దాని మీద నడిచి రావడానికి వీలుగా! (అంటే 'రెడ్‌కార్పెట్' అన్నమాట)

విద్వాంసులంతా నడిచి వెళ్ళాక ఆ గుడ్డలో ఉన్న వాళ్ల పాదధూళిని 'వస్త్రకాళితం' చేసే ఆ చూర్ణాన్ని... సింధూరంతో కలిపి నుదుటున ధరించేవారు.

ఆవిడేవిటీ.... యావత్ రాజవంశం... ఆ పాదధూళిని భక్తి ప్రపత్తులతో ధరించింది!! కొంత చూర్ణాన్ని నీళ్ళలో కలిపి తీర్థంగా సేవించే వారట గూడా!

ఒళ్ళు పులకించి పోవట్లేదూ!....

రోమాలు నిక్కబొడుచుకోవడం లేదూ!...

గుండె ఆనందంతో మూల్గడం లేదూ...

ఉద్వేగంలో కళ్ళ వెంబడి ఆనందబాష్పాలు కారట్లేదూ!!

ఇదీ గద్వాలు చరిత్ర.....

ఇదీ గద్వాలు వైభవం...

విద్వాంసుల్ని... గౌరవించి... వారికి పాదపూజ చేసి.... నెత్తినెట్టుకున్న ఎంతోమంది మహారాజులు - సంస్థానా ధీశులు మన చరిత్రలో ఉన్నారు.

అల్లసాని పెద్దన ఊరేగుతోంటే విద్యానగర ప్రభువు శ్రీకృష్ణదేవ రాయలు... పల్లకీ మోసాడు లాంఛనంగా... అల్లసాని వారి పాదాలు కడిగీ - స్వయంగా గండ పెండేరం తొడిగాడు!

**అల్లసాని వారు పోయారు... కృష్ణదేవరాయలు పోయారు.**
**విజయనగర సామ్రాజ్యం శిథిలమైంది!....**
**కానీ మనుచరిత్ర నిలిచే ఉంది!!**
**ఆముక్త మాల్యద పరిమళిస్తూనే ఉంది!!**

అలాగే... ముత్యాలశాలలో కవి సార్వభౌముడుకి జరిగిన కనకాభిషేకం... సరస్వతీ దేవికి అర్చన.... ముత్యాలశాల కూలిపోయింది!

కంచు ఢక్క బద్దలైపోయింది!

ప్రౌఢ దేవరాయలు లేడు.... శ్రీనాథుడు అమరపురి కెళ్ళిపోయాడు. కానీ వారి కీర్తీ... కనకాభిషేకం చేసినప్పుడు కణకణారాలిన బంగారు నాణాల ధ్వనీ.... ఇంకా చరిత్ర నిండా ప్రతిధ్వనిస్తూనే ఉంది!!

**గుడికూలును - నూయి పూడును**
**వడినీళ్ళకు చెరువు తెగును**
**వనములు ఖిలమౌ**
**చెడనిది 'పద్యం' బొక్కటె**
**కుడియెడ మలకీర్తిగన్న గువ్వల చెన్నా!!**

అన్నాడు... చెన్నడు.

**ఇంక గద్వాల కొద్దాం!**
**ఇలాంటి 'గద్వాలలో'**
**సుందరకాండలో అంజనీపుత్రుల్లాగా...**
**గద్వాల పక్కనే ఉన్న పల్లెటూళ్ళో 'వేపూరు హనుమద్దాసు'**

హనుమద్దాసు మహబూబ్‌నగర్ జిల్లా - కల్వకుర్తి తాలూకా వేపూరు గ్రామనివాసి. 'ముతరాసి' కులం, తల్లిదండ్రులు బారమ్మ - అచ్చయ్య... సంజన్న... వెంకట నారాయణలు అన్నతమ్ములు. వీరుగాక ముగ్గురు అప్పజెళ్ళెళ్లు.

హనుమద్దాసు తాత తిప్పరామన్నకి సంగీతంలో మంచి పరిజ్ఞానం ఉండేది! అదే మన వాడికి అబ్బింది! ఎప్పుడు జూసినా రామనామ గానమే!

'హనుమద్దాసు' రచనలూ, ఆయన గానం ఎంత ప్రసిద్ధాలై పోయాయంటే - ఆయన 35 ఏటే.... ఊళ్ళలో చాలామంది హనుమద్దాసులా వేషం వేసి... కీర్తనలు అవీ పాడేస్తూ తామే నిజమైన హనుమద్దాసులం అని చెప్పుకునేవారట. (అంటే డూప్లికేటు హనుమద్దాసులు బైలు దేరారు) అంత ప్రాచుర్యం పొందాడాయన.

హనుమద్దాసుని గురించిన అనేక కథలూ - గాథలూ ప్రచారంలో ఉన్నాయ్!

ఒకసారి ఊళ్ళల్లో విషజ్వరం ఏదో ప్రబలింది.

ఊళ్ళు ఊళ్ళు జ్వరం వాతపడి జనం హడిలిపోతున్నారు.

హనుమద్దాసు యోగ సమాధిలో కూర్చుని ధ్యానం చేసి....

ఒక కాషాయజెండా తీసికెళ్ళి ... ఊరి పొలిమేరలో పాతి విష జ్వరాన్ని ఈ జెండా దాటి రావడానికి వీల్లేదని ఆజ్ఞాపించారట!! అంతే!! ఆ నాటినించి జ్వరం వొస్తేవొట్టు!!

మరో సంఘటన.... భక్తులంతా ఆలయంలో
గుండ్రంగా కూర్చున్నారు...
మధ్యలో హనుమద్దాసు గారూ.....
రామనామ సంకీర్తన జరుగుతోంది!
హనుమద్దాసు గారు యోగ నిద్రలోకి వెళ్ళి పోయారు!
భజన జరుగుతోంది!

మెల్లిమెల్లిగా... హనుమద్దాసు పద్మాసనం వేసుకుని ఉండగానే శరీరం మెల్లిగా గాల్లోకి లేవడం ప్రారంభించింది!!

భక్తులు సంభ్రమాశ్చర్యాల్తో చూస్తున్నారు...

హారతి ఇచ్చి.... గంట వాయించారు.

మెల్లిమెల్లిగా... గాల్లోకెళ్ళిన హనుమద్దాసు గారి శరీరం కిందకి దిగింది.. భక్తులంతా పాదాలమీద పడ్డంతో హనుమద్దాసు లేచీ మందహాసం చేసు కుంటూ మెల్లిగా నడుచుకుంటూ వెళ్ళిపోయారు!!

హనుమద్దాసు రచనలో ఆధ్యాత్మికత - మార్మికత ఉంటాయ్!!!

ఉదాహరణకి... షట్చక్రోపేతమైన దేహము. దానితత్వాన్ని ఇలా అంటారు!!

అమ్మమ్మ... ఇది యేమే... ఆరు మేడలు పైన చూడరమ్మా - ముద్దు
గుమ్మా రీతిని లోపలి గుంటొకటున్నదీ... చూడరమ్మా
గుండుకు ఒక చోటా - గుండ్లలో లోపల చూడరమ్మా
గుండ్ల మధ్యన నక్క కూతా వేయుచుండూ చూడరమ్మా - అట్టి
కూతల నడుమానతోకటున్నది - చూడరమ్మ
నూతిమధ్యను నక్కి నాతి కూర్చున్నదీ చూడరమ్మా - ఆ
నాతిమీదను నొక్కకోతి చేరున్నది చూడరమ్మా -
కోతి మీదను పరంజ్యోతి మేలైనదీ చూడరమ్మా - ఆ
కోతియే ముల్లోక మాతాగనైనదీ చూడరమ్మ....
అంటే ఆరు మేడలంటే - షట్చక్రాలనీ
దానిపై గుండంటే శిరస్సనీ -

అందులో రెండుకండ్లూ - అందులోని నల్లగుడ్లూ - అక్కడ భ్రూ మధ్యము... ఆ భ్రూమధ్యలో పరంజ్యోతి... ఇలా మార్మికంగా ధ్యాన విధానాన్ని భోధించాడు...

---

**బ్రహ్మశ్రీ కె.వి.యల్. నరసింహశాస్త్రి గారికి**

**నమస్కారాలు,**

**మీ ఉత్తరం చదివా.... మీతో ఏకీభవించక పోతే తెలుగుకి ద్రోహం చేసిన వాణ్ణవుతాను.... శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారంటే నాకు పరమ గౌరవం... ఆయన రాసిన తెనుగు నేనే కాదు - ఎవడూ రాయలేడు. ఆయన ప్రతిభకి అద్దం పట్టడానికి 'కృష్ణాతీరం' ఒక్కటి చాలు....**

**కాకపోతే పేరిచర్ల రామకృష్ణంరాజుగారు నా మీద అభిమానంతో అలా పోల్చారు... మీరు వాత్సల్యంతో మందలించారు!**

**నిజమే మరి... వెన్నపూసా.... నల్లపూస... లలో.... పూస కలిసినంత మాత్రాన పోలిక కట్టేస్తే ఎలా?**

**ఈ విషయంగానైనా.... గురుదేవులు మల్లాది రామకృష్ణ శాస్త్రిగారిని తల్చుకున్నందుకు సంతోషిస్తున్నా.**

**సదా మీ ఆశీస్సుల్ని అభిలషించే**

**-భవదీయ**
**భరణి**

**మరోముక్క:** **కొమ్మమీద కోతి కొమ్మచ్చులాడిందీ**
**నల్లానల్లాని - ఓ బుల్లి ఎండా!!!**
**మల్లాది వారి పాటలోని**
**ఈ కొబ్బరి లౌజుని మర్చిపోగలంవూ!?**

---



**తనికెళ్ళ భరణి**

మరో తత్వంతో....
బూటకుండు - శివపూజ చేసిన బుద్ధిమంతుడగునా
కాడిగట్టి ఘనకళ్ళెము చేసినా గాడ్దె గుర్రమగునా....
మనసు నిల్పకను భజన చేసినా మనిషి భక్తుడగునా...
కనక పర్వతము నెక్కికూసినా కాకి కోకిలగునా...

అలాగే హనుమద్దాసుగారు... ఆరోజుల్లో కొత్తగా ఏర్పడ్డ రైలు కెక్కి అయోధ్య వంటి పుణ్యక్షేత్రాల్ని దర్శించి... రామేశ్వరం వొచ్చి సముద్ర స్నానం చేసినట్లు తెలుస్తోంది....! ఆ యాత్రా విశేషాల్నే 'పొగబండి' అనే పేర తత్వాలు రాశారట. అవి అలభ్యం....!

**(ఎవరికైనా లభిస్తే వాటిని ప్రచురిస్తే... ఆంధ్ర సంగీత సరస్వతికి పూజ చేసిన వారౌతారు).**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాదు - 500 018
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

# తెగబడ్డ తెలివి

వారణాసి రామకృష్ణ

**ఫన్నీరావు టీవీ హాస్యనటుడు. ఓ రోజు రాత్రి లేటుగా ఇంటికొచ్చి నిద్రపోయాడు. అతని భార్య కామాక్షి! ఇద్దరూ మంచి నిద్దర్లో ఉండగా చప్పుడు వినిపిస్తే ఆమెకి మెలకువ వచ్చింది. కళ్ళు విప్పి చూస్తే - సూట్‌కేసులు సర్దుతూ దొంగ కనిపించాడు.**



"ఏమండీ... ఏమండీ!" నిద్రపోతున్న ఫన్నీరావుని కుదిపింది.

"ఏమిటే...." గట్టిగా ఏదో అనబోగా ఆమె నోరునొక్కి "మెల్లిగా! అవతల దొంగ వెధవ ఇంట్లో దూరాడు!" చెవిలో గొణిగింది.

"నిద్దర్లో కూడా వెధవ అనుమానాలు వదలవు కదా!" విసుక్కున్నాడు ఫన్నీరావు.

"అయ్యో రామా! పూర్తిగా కళ్ళు తెరిచి చూడండి. అదిగో... వాడిప్పుడు వంటింట్లోకి వెళ్తున్నాడు!"

"నీ స్క్రీన్ ప్లే తో అదరగొట్టకు! అయినా ఈ మధ్య దొంగలు ఇళ్ళల్లో దూరి చక్కగా భోజనాలు చేసి గానీ దొంగతనానికి దిగట్లేదు. అంచేత మళ్ళీ బెడ్రూమ్‌లో కొచ్చినప్పుడు చెప్పు" అంటూ ఫన్నీరావు మళ్ళీ దుప్పటి ముసుగేశాడు.

"ఛీ ఛీ అవతల దొంగ వెధవ దూరితే కుళ్ళు జోకులేస్తారా? వెళ్ళండి .. మీరు వాడ్ని వెనకనుండి గట్టిగా పట్టుకోండి. ఈలోగా నేను కేకలు పెట్టి నలుగుర్నీ పిలుస్తాను".

ఫన్నీరావు ముసుగు తియ్యకుండానే "ఓసి పిచ్చిదానా! ఇదేమైనా టీవీ సీరియల్ అనుకున్నావా ఏంటీ - విలన్‌ని నేను కొడుతూంటే చక్కగా చూసి ఆనంద పడటానికి! ఎందుకొచ్చిన తిప్పలు గానీ వాడు మనింట్లోంచి ఏం పట్టుకుపోగలడు - చెంబులో తప్పేళాలో తప్ప!?".

చెబుతూండగానే దొంగ వడలు తింటూ వంటింట్లోంచి బెడ్రూమ్ లోకి వచ్చాడు. ఫన్నీరావు మాటలు విని గట్టిగా భయపెట్టబోయాడు. కానీ తింటున్న వడ ముక్క ఓ పంటి క్రింద పడగానే బాధతో మూలిగాడు.



ఫన్నీరావు దుప్పటి పూర్తిగా తీసేసి మంచం మీంచి క్రిందికి గెంతి "అయ్యయ్యో! వడ దెబ్బతిన్నావా నువ్వు కూడా!" అనే సరికి దొంగ అదిరిపోయాడు. కానీ మళ్ళీ వెంటనే తేరుకుని.

"ఏయ్... గళ్ళ లుంగీ చారల బనీను లేవని నన్ను దొంగ కాదనుకుంటున్నావేమో! ఖబడ్దార్! జాగ్రత్త! బీరువా తాళాలు ఇటివ్వు!" కర్కశంగా అన్నాడు.

ఫన్నీరావు ఫక్కుమని నవ్వి "ఎందుకయ్యా అంత గట్టిగా అరుస్తావు! అసలు బీరువాకి తాళాలే వెయ్యలేదు!" కూల్‌గా చెప్పేసరికి, దొంగ మరోసారి బిత్తరపోయి "హార్నీ! బీరువాకి తాళాలు వేస్తారు కదానని వెనుకనుంచి పగల గొట్టాలని తెగ ప్రయత్నించానే!" విసుగ్గా చెప్పాడు.

"ఇప్పుడు మునిగి పోయిందే ముందీ! అయినా బీరువాలో మా చంటాడి పక్కబట్టలు తప్ప మరేమీ లేవు! అనవసర ఆయాసం వద్దుగానీ నువ్వు వింటానంటే నీకో మంచి ఐడియా చెబుతా!" ఫన్నీరావు హుషారుగా అన్నాడు.

దొంగ వెంటనే జేబులోంచి కత్తి తీసి "హార్నీ! చూస్తావుంటే నీ యవ్వారం ముదిరిపోతా వుందే! నాకే అయిడిలిస్తావ్! ఊం మర్యాదగా నగలు, డబ్బులు బైటికి తియ్యండి!" గట్టిగా అరిచాడు.

ఫన్నీరావు ఏ మాత్రం భయపడకుండా "చూడు దొంగ బాబూ! నేను ఆ మధ్యే ఈ నగర శివార్లో స్థలం కొని ఇల్లు కట్టాను! ఈ మధ్యే గృహ ప్రవేశం చేసాను!" చెప్పుకుపోతుంటే దొంగ అడ్డొస్తూ-

"డబ్బు నగలు తియ్యవయ్యా అంటే నీ సోదంతా చెప్తున్నావ్!" అసహనంగా అరిచాడు.

"ఆగవయ్యా దొంగబాబూ! నేను సీరియస్‌గానే నీకో సంగతి చెప్తున్నాను. నేనిలా స్థలం కొని ఇల్లు కట్టేను అంటే నా దగ్గర డబ్బే కాక మా ఆవిడ నగలు మా బంధు మిత్రుల సొమ్ములు అన్నీ మటాష్ అయ్యాయని అర్థం చేసుకోవాలి!" చేతులు వూపుతూ ఫన్నీరావు ఫన్నీగా చెప్తుంటే దొంగకి కూడా నవ్వొచ్చింది.

ఆపుకోలేక నవ్వుతూ. "హార్నీ! భలే యాాచ్చన్ జేస్తున్నావ్! నువ్వు టీవీలో కనిపిస్తవ్‌లే?" అనుమానంగా ప్రశ్నించాడు.

"అవునా! నువ్వు చూశావా?" ఫన్నీరావు దొంగ భుజం మీద చేతులేసి అడిగాడు.

"చూసా సార్! నా డ్యూటీలన్నీ రాత్రిళ్ళుంటాయి కదా సార్ - దినమంతా బోర్ కొట్టేస్తూంటే డైలీ సీరియల్సు చూస్తుంటా! సార్... సార్... నాకు టీవీలో వో వేషం ఇప్పించండి సార్!" దొంగ ప్రాధేయపడసాగాడు.

"వోః దానికేం భాగ్యం! చక్కగా దొంగోడి పాత్రలు వేద్దువుగానీ!" అంటూ ఫన్నీరావు కామాక్షి వైపు తిరిగి "ఇదిగో కామాక్షీ! నాకూ దొంగ బాబుకి రెండు స్ట్రాంగ్ జెమినీ టీ పట్టుకురావో" చెప్పాడు.

కామాక్షి రుసరుసలాడుతూ "ఇప్పుడా! అర్థరాత్రి అంకమ్మ శివార్లంటూ!!! హవ్వ! అయినా ఈ దొంగ చచ్చినాడితో కలిసి టీ త్రాగటమేమిటండీ?" ఆశ్చర్యంగా అడిగింది.

"చూడు కామాక్షీ! ఇక నుంచి ఇతన్ని దొంగ గింగా అనకు! నేను పగలు బ్యాంక్‌లో పని చేస్తూ రాత్రిళ్ళు టీవీ స్టూడియోల్లో నటిస్తుంటానా లేదా? ఇలాగే ఇతనూ ఇక నుంచి పగలు  నటిస్తూ రాత్రిళ్ళు తన వృత్తి తాను చేసుకుంటాడు! ఇందులో తప్పేం వుంది? అంతేకదా దొంగబాబూ!" అని ఫన్నీరావు అనేసరికి దొంగ భుజాలు తడుముకుంటూ" అంతేసార్... అంతే! "ఇంతకీ మీ ఇంట్లో ఏమీ దొరకవా సార్?" అంటూ నిరాశగా ఎగాదిగా ఇల్లంతా చూశాడు.

"చరిత్రంతా చెప్పేను కదా! పోనీ నీకో సహాయం చేస్తాను! ఈ వీధి చివర్లో కుడివేపు ఇల్లుంది చూడు! ఇంటి ముందు చాలా కొబ్బరి చెట్లు, పెద్ద గేటు, మారుతీ కారు అన్నీ ఉంటాయి! ఆ ఇంట్లోకి గేటు తీసుకుని దర్జాగా వెళ్ళి కన్నం వేసావంటే నీకు బాగా దొరుకుద్ది!"

"నిజమా సార్!" దొంగ ఆశగా అడిగాడు.

"నిజమేనయ్యా! నీ తోడు! వెళ్ళు తొందరగా.... అప్పుడే టైము ఒకటిన్నర కావస్తోంది. తొందరపడకపోతే తెల్లారిపోతుంది!"

ఫన్నీరావు హడావిడి చూసి దొంగ బైటికి పరుగెత్తాడు. కామాక్షి వంటింట్లో బైటికొచ్చి టీ కప్పు అందిస్తూ "అమ్మో! అమ్మో! ఏమో అనుకున్నాను కానీ ఇన్నాళ్ళకి మీ టీవి నాటకాల వల్ల ఓ ప్రయోజనం ఉందని తెలిసింది" అనందంగా అన్నది.

ఫన్నీరావు లుంగీపైకి ఎగ్గట్టి, టీ త్రాగుతూ గర్వంగా నవ్వుతూ "ఇప్పటికి తెలిసిందా నా నటనా చాతుర్యమేమిటో! ఈ దొంగలు ఎపిసోడ్‌లోమరో మాంచి మెలోడ్రామా కూడా ఉంది. దాంతోబాటు  క్లయిమాక్సు భలేగా ఉంటుంది! అర్థమైందా?" అని అన్నాడు చలాకీగా.

"ఏమిటండీ అది?" కామాక్షి ఆత్రుతగా అడిగింది.

"ఇప్పుడు నేను దొంగోడికి ఓ ఇంటి అడ్రసు ఇచ్చాను! అది ఎవర్దనుకుంటున్నావ్?"

సిగిరెట్ వెలిగించుకుంటూ క్షణం ఆగాడు.

"ఇంకెవరిది! మీ బ్యాంక్ మేనేజర్‌దే అయివుంటుంది! ఆయనంటే మీకు పీకల్దాక కోపం కదా!"

కామాక్షి అంటుంటే ఫన్నీరావు కాదన్నట్టు తలవూపి

"అక్కడేవేశావు డాల్‌లో లెగ్గు! ఆ ఇల్లు ఈ ఏరియా ఇన్‌స్పెక్టర్ చక్రపాణిగారిది. దెబ్బతో ఈ దొంగగాడు మటాష్" అంటూ నవ్వేశాడు గట్టిగా.

***

కోడి కూస్తోంది. ఫన్నీరావు ఉత్సాహంగా "భలే మంచిరోజు పసందైన రోజు - సర్కిలింట్లో దొంగే దొరుకు రోజు!" అంటూ రాగయుక్తంగా పాట పాడుకుంటున్నాడు.

కామాక్షి ముగ్గువేసే నెపంతో సర్కిల్ ఇంటివరకూ ముగ్గు వేస్తూ వెళ్ళి ఆ ఏరియాలో దొంగతనం జరిగిందన్న వార్తని తీసుకొచ్చింది.

ఫన్నీరావు మరింత ఉత్సాహంగా పాట పాడుతూ - ఉన్నట్టుండి బుర్రలోకి ఏదో ఆలోచన వచ్చిన వాడిలా ఆగిపోయాడు. వెంటనే ఆనందంగా ఇంట్లోకి దూరి వస్తువులన్నీ చిందర వందర చేస్తూ " కామాక్షీ! రావె.... తొందరగా రావె...." అంటూ పెడబొబ్బలు పెట్టాడు.

కామాక్షి హడలిపోతూ ముగ్గు సగంలోనే వదిలేసి పరిగెత్తుకొచ్చింది.

"ఏమైందండి? ఎందుకలా గావు కేకలు పెట్టారు?"

ఫన్నీరావు ఆమె బుగ్గలకి అంటిన ముగ్గుపిండి తుడుస్తూ-

"ఇప్పుడు మనం గావు కేకలే కాదు చావు కేకలు కూడా పెట్టాలి! ఊ... క్విక్!" తొందర పెట్టాడు.

"ఉండండి... పాపం ఆ సర్కిల్ గారింటికి  ఓ సారి వెళ్ళి పరామర్శించి వస్తాను!" వెళ్ళబోయింది.

"ఆగవే వన్నెల చిలకా! ఇప్పుడే మన దొంగోడి నాటకం  క్లయిమాక్స్‌కి చేరుకుంది. వెంటనే గట్టిగా ఏడువే!"

"వాళ్ళింట్లో సొమ్ములు పోతే మధ్యలో మనం ఏడవటం దేనికండీ?"

"దేనికేమిటో పిచ్చిదానా! వాళ్ళింట్లో పోయినట్టే మన ఇంట్లోనూ దొంగ వెధవ పడి డబ్బు, నగలు, టేప్ రికార్డరు, విసిఆర్‌లు పట్టుకుపోయాడు! అందుకని...." ఫన్నీరావు లాజిక్ అర్థం కాక "ఏమిటీ" కళ్ళు పెద్దవి చేసింది.

"ఓసి పిచ్చిమొద్దూ! సర్కిల్‌గారు ఎలాగైనా తన సొమ్ము రాబట్టు కుంటాడు. మనం కూడా సందట్లో సడేమియా అని ఏడిస్తే మనకీ కొన్ని వస్తువులు తెప్పిస్తాడు అర్థమైందా?"

ఫన్నీరావు ఆలోచనకి విస్తుబోతూ కామాక్షి "అమ్మో! వద్దండీ! ఆ పాపపు సామాన్లు సొమ్ములు మనకొద్దు!" భయంగా అన్నది.

"చాల్లే నోర్ముయ్! చెప్పినట్టు తొందరగా ఏడుపు ప్రారంభించు!" అంటూ ఫన్నీరావు గావుకేకల్ని చావుకేకల వాల్యూంకి పెంచాడు.

కాలనీ జనాలందరూ వచ్చారు. తలా ఒక సానుభూతి మాట చెప్పారు. ఓ ముసలమ్మ "హవ్వ! దేముడి హుండికీ దిక్కులేని కాలం ఇది! పోలీసుల ఇంటికే కన్నాలు వేస్తున్న రోజులవి! ఇక మనలాటాళ్ళకి దిక్కేది?" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ వెళ్ళింది.

అంతా వెళ్ళాక ఫన్నీరావు కూడా ఏడుపు ఆపేసి "వెల్‌డన్ కామాక్షి! భలేగా ఏడుపు సీన్‌లో నటించావు. ఈసారి మా టీవీ ఎపిసోడ్‌లో ఆ ఏడుపుగొట్టు హీరోయిన్ పాత్రని నీ కిమ్మని డైరెక్టరుగారికి చెప్పాలి! ఇక రిపోర్టు ఇచ్చేదాం! పదపద!"

అంటూ పోలీసు స్టేషన్‌కి బైలు దేరాడు.

***

"నమస్కారం సార్! రాత్రి మా ఇంట్లో కూడా దొంగలు పడ్డారు సార్!" పోలీస్ స్టేషన్‌కొచ్చి ఇంట్లో దొంగలు పడ్డారని నవ్వుతూ చెబుతున్న ఫన్నీరావుని హెడ్ కానిస్టేబుల్ నర్సయ్య విచిత్రంగా చూశాడు. ఫన్నీరావు మరింత ఆనందంగా "నిజంగానే సార్! దొంగలు రాత్రి మా ఇంట్లోకి దూరి చక్కగా మా ఆవిడ చేసిన పులిహోర, వడలు తినేసి ఆనక సామాన్లన్నీ దోచుకుపోయారు సార్!" చెబుతూనే మోచేత్తో కామాక్షిని పొడిచాడు.

కామాక్షి వెంటనే కీ ఇచ్చిన బొమ్మలా ఏడుపు నటిస్తూ ఎన్ని ఖరీదయిన వస్తువులు పోయిందీ ఏకరువు పెడుతూ మధ్యమధ్యలో బుర్రుమని చీది చీరకొంగుతో ముక్కు తుడుచుకోసాగింది.

నర్సయ్య ఇద్దరి వంకా విచిత్రంగా చూసి "సరే - సర్! రిపోర్టు రాసివ్వండి!" చెప్పి ఏదో అనుమానం వచ్చిన వాడిలా "ఏంటయ్యా। నువ్వు ఇందాక మా ఇంట్లో కూడా దొంగలు పడ్డారన్నావు కదూ?" ప్రశ్నించాడు.

ఫన్నీరావు నవ్వుతూ "అవున్సార్! మా ఇంట్లో  'కూడా' పడ్డారు సార్!" 'కూడా'ని వత్తి పలికి చెప్పాడు.

"కూడా అంటున్నావు! ఇంకెవరింట్లో కూడా పడ్డారని నీ ఉద్దేశ్యం?" నర్సయ్య  'కూడా'ని వొత్తి పలికి మరీ గట్టిగా ప్రశ్నించాడు.

"అదేంటి సార్ - రాత్రి సర్కిల్  చక్రపాణి గారింట్లో దొంగలు పడి అన్నిసామాన్లు పోయాయి కదా సార్!"

వినగానే నర్సయ్య నెత్తిన బాంబు పడ్డట్టు విలవిలలాడిపోతూ "ఏమిటీ! నువ్వు చెప్పేది నిజమేనా!" కంగారుగా అడిగాడు.

"నిజమే సార్! సర్కిల్ గారిల్లు మా బ్యాంక్ మేనేజరు గారింటికి

ఎదురుగానే ఉంటుంది. మా కాలనీనే కదా సార్!"

ఆ దెబ్బకి దిమ్మతిరిగిన నర్సయ్య కానిస్టేబుల్‌ని పిలిచి రహస్యంగా "ఎవడు చేసుంటాడీ వెధవ పని?" కళ్ళెగ్ర జేసేసి "అసలు సర్కిల్ ఇంట్లో దొంగతనం జరిగిందా?" అడిగాడు.

"పాత కేడీ సాంబయ్య గాడీ మధ్య వీరలెవల్లో మనకి చెప్పకుండా తెగరెచ్చిపోతున్నట్టు సమాచారం సార్! సర్కిల్ గారిల్లని తెలీక వాడేమైనా చేసేడేమో?"

"వెంటనే వాడ్ని పట్టుకురా! వీడు చెప్పేది నిజమో కాదో తెలుసుకోవాలి!" నర్సయ్య రహస్యంగా చెప్పగానే కానిస్టేబుల్ వెళ్ళిపోయాడు.

ఈలోగా ఫణీరావు తనకున్న అనుభవాన్నెంతో పోగేసి 'దొంగతనాలు వాటి లోతు పాతులు' అనే అంశం మీద రకరకాలుగా నటిస్తూ మొత్తానికి నర్సయ్య నమ్మకాన్ని చూరగొనే ప్రయత్నం చేశాడు.

చాలా సేపటి తర్వాత కానిస్టేబుల్ వొంటరిగానే తిరిగొచ్చి "ఆ కేడీ సాంబయ్య గాడు ఎక్కడా దొరకలేదు సార్!" నిరాశగా చెప్పాడు. నర్సయ్య నెత్తిబాదుకుంటూ "ముందసలు సర్కిల్‌గారింట్లో ఏం జరిగిందో, ఏమేం పోయాయో తెలుసుకోవాలి!" అంటూ వెళ్ళబోయి ఫణీరావుతో "మీ ఇంట్లో ఏమేం వస్తువులు పోయాయో లిస్టు రాసి రిపోర్టు ఇచ్చి వెళ్ళండి!" చెప్పేసి హడావుడిగా



వెళ్ళిపోయాడు.

ఫణీరావు కామాక్షి కేసి చిలిపిగా చూసి కన్నుగీటి ఆనందంగా టీవీ, ఫ్రిజ్, వాషింగ్ మెషీను అంటూ బ్రాండ్‌నేమ్‌లతో సహా లిస్టు రాసిచ్చాడు.

కానిస్టేబుల్ లిస్టు చూసి "అన్నాయ్ టీవీనా? ఈ బ్రాండెప్పుడు వినలేదు కదయ్యా!" ఆశ్చర్యంగా అడిగాడు.

ఫణీరావు గతుక్కుమని "అకాయ్ టీవీ అని రాయబోయి అన్నాయ్ టీవి అని రాసేనులెండి" లిస్టు సవరించి, చివర్లో - "రెండు ప్యాకెట్లు అన్నపూర్ణా ఉప్పు" అని చేర్చాడు. కానిస్టేబుల్ ఫణీరావుకేసి ఆశ్చర్యంగా చూసే సరికి ఫణీరావు నవ్వుతూ షేక్ హ్యాండ్ ఇచ్చేసి బైటకొచ్చేశాడు.

ఇంటి దగ్గర చూస్తే - తలుపులు బార్లా తెరిచి వున్నాయి. "కామాక్షీ! ఇదేమిటీ? పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చి వచ్చేలోగానే తాళాలు వేసిన తలుపులు తీసి ఉన్నాయి?" అంటూ ఆశ్చర్యంగా లోనికెళ్ళి చూస్తే - సోఫాలో కూర్చుని సాంబయ్య టీ త్రాగుతూ ఓ చేత్తో బీడి కాలుస్తూ ఆనందంగా అకాయ్ టీవీలో డైలీ సీరియల్ చూస్తున్నాడు.

ఇల్లంతా సోఫా టీవి ఫ్రిజ్జు లాంటి ఖరీదయిన వస్తువులతో నిండి వుంది. ఒక్కసారిగా అవన్నీ చూసే సరికి ఫణీరావుకి దిమ్మ తిరిగి.

"ఒరేయ్ దొంగబాబూ! అసలు నువ్వెప్పుడొచ్చావు? ఈ వస్తువులన్నీ ఏంటీ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

సాంబయ్య నవ్వుతూ "పొద్దున్నే వచ్చాసార్! రాత్తిరి మీ దయ వల్ల యాపారం మంచిగా జరిగింది. కొట్టుకొచ్చిన సామాన్లు ఎక్కడ పెట్టినా ఆ నా పోలీసుకొడుకులకి తెల్సిపోతది! కొన్ని దినాలు మీ ఇంట్లో వుంటే ఎవరికీ అనుమానం రాదని అట్టుకొచ్చా! తీరా సామాను అట్టుకొచ్చేసరికి మీరేమో లేరు! ఇక సేసేదేముంది పెరటి తలుపు గడి పగలగొట్టి లోపలికొచ్చేశా - సామానంతా సర్దేశా - బావుందా సార్?" నవ్వుతూ అన్నాడు.

కామాక్షి నెత్తీనోరు బాదుకుంటూ "నీ బండ పడ! ఆ సర్కిల్ ఇంటి సామానంతా మా ఇంట్లో పడేసి అనవసరంగా మమ్మల్ని ఇరికిస్తున్నావు గదరా!" అన్నది.

ఆ మాటకి సాంబయ్య గట్టిగా నవ్వి

"నాకామాత్తరం తెల్వి లేదా సెల్లమ్మా! రాత్తిరి నేనసలు సర్కిల్ ఇంట్లో కన్నం వెయ్యలే!" అన్నాడు కులాసాగా నవ్వేస్తూ!

ఫణీరావు నిర్ఘాంతపోతూ "చెయ్యలేదా? మరెక్కడేసావ్?" అడిగాడు.

"నువు చెప్పినావని రాత్తిరి ఆ కొబ్బరి సెట్టు ఇంటికాడికి ఎల్లా - కానీ తీరా తేరిపార సూస్తే - ఆ ఇల్లు వోనరు ఎవరో కాదు. మునిసామిగోరని మా కేడీగాళ్లందరికీ పెద్దదిక్కు ఆయన! సూస్తా - సూస్తా ఆయనింట్లో అద్దెకుండే వాళ్ళింటికి కన్నం ఎయ్యటం - సీ-మా కులవృత్తికే అవమానమని - అప్పటికప్పుడు ఆలోసన మార్చి ఆ ఇంటికికెదురుగా వుండే ఇంట్లోకెళ్ళి కన్నం వేశా!" టీవీ ఛానెల్ మారుస్తూ చిద్విలాసంగా చెప్పాడు.

ఫణీరావు మరింత కంగారుగా - "ఏమిటీ - దానికెదురుగా ఉన్న ఇల్లా?" కామాక్షి వెంటనే "ఎవరిదండి ఆ ఇల్లు?" ఆతృతగా అడిగింది.

"ఎవరిదో అయితే నాకెందుకు అంత కంగారు? ఆ ఇల్లు మా బ్యాంకు మేనేజరు పరాంకుశం గారిదే! వారే దొంగబాబు! చంపేశావు కదరా - ఈ సామాన్లన్నీ ఆయనింట్లో కన్నం వేసి పట్టుకొచ్చినవేనా?"

ఫణీరావు అంటుండగానే - గుమ్మంలో అలికిడి! వెనక్కి తిరిగి చూస్తే - బ్యాంకు మేనేజరు. అతని ప్రక్కన హెడ్ కానిస్టేబుల్ నర్సయ్య కనిపించారు.

చూస్తున్న ఫణీరావుకి బోలెడు సినిమాల్లోని చివరి సీన్లు గుర్తొచ్చి ఒళ్ళంతా ముచ్చెమటలు పట్టాయి!!!.

(ఫిబ్రవరి 19న పంకజ్ మల్లిక్ వర్ధంతి సందర్భంగా)



# గాయకుని చెంపచెళ్ళుమనిపించిన సంగీత దర్శకుడు

**హిందీ చిత్రసీమను ఒకటిన్నర దశాబ్దం పాటు తన అద్భుత గాన మాధుర్యంతో చకచ్చకితం చేసిన మహాగాయకుడు కె.ఎల్.సైగల్. ఆయన పాడటమంటే ఒక రకంగా ఆయా సంగీత దర్శకులను డామినేట్ చేయడమే అయ్యేది. ఇలాంటి తరుణంలో జరిగిన ఓ అరుదైన సంఘటన ఇది.**

అది 1939వ సంవత్సరం 'దుష్మన్' సినిమాకుగాను సైగల్‌చే పాడించేందుకు రిహార్సల్స్ జరిగాయి. రికార్డింగ్ థియేటర్‌లోకి వెళ్లాడు సైగల్. ఆయన పాడవలసిన పాట "కరూం క్యా ఆశ్ నిరాశ్ భయే''. బాగా తాగి రావడంతో రికార్డింగ్ థియేటర్‌లో ఒక్క లైను కూడా సరిగా పాడలేకపోయాడు. 15 టేకులు అయినా రికార్డింగ్ పూర్తికాలేదు. వెంటనే ఆ సంగీత దర్శకుడు విపరీతమైన కోపంతో సైగల్ చెంపను చెళ్లుమనిపించాడు. అక్కడున్న వారంతా అనూహ్యామైన ఈ సంఘటనతో ఏం జరుగనుందోనని ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. నిరుత్తరుడైన సైగల్ మైకం దిగి పోయింది. ఏడుస్తూ "నువ్వు నన్ను కొడతావా" అని సైగల్ అంటే "అవును పాట పల్లవిని కూడా పాడలేని నువ్వు ఒక గాయకుడివేనా?'' అని ఎద్దేవా చేశాడా సంగీత దర్శకుడు. దాంతో సైగల్ పట్టుదలతో మళ్లీ పాడి ఒక్కసారికే ఓ.కే. చేయించాడు. వెంటనే ఆ సంగీత దర్శకుడు ఆనందోద్వేగాలతో సైగల్‌ను కౌగిలించుకుని "మిత్రమా నీవు మహాగాయకుడివి'' అని అభినంధిస్తూ పొగిడాడు.

సైగల్ పాడితే చాలు సినిమా ఆడుతుందని భావించే ఆ రోజుల్లో ఆయన్ను చెంప దెబ్బ వేయడానికి ఆ సంగీత దర్శకుడికి ఎన్ని గుండెలు అని ఇప్పటికీ మనకు కనిపిస్తుంది. అంతధైర్యం గల ఆ సంగీత దర్శకుడి పేరు 'పంకజ్‌మల్లిక్'.

భారతదేశంలో టాకీలు వచ్చిన తొలి దశకంలో రూపొందించిన సినిమాలన్నింటికి సంగీతం అందించిన వారంతా శాస్త్రీయ సంగీతకారులే. అలాంటి వారిలో ఒకరు పంకజ్ మల్లిక్. 1905లో బెంగాల్‌లో జన్మించిన పంకజ్ బాల్యం నుండి స్తోత్రాలు, శ్లోకాలు, శ్రావ్యంగా పాడుతూ ఉండేవారు. మోహన్‌గోస్వామి 'సంగీతామన్''లో శాస్త్రీయ సంగీతం అభ్యసించారు. రవీంద్రనాథ్ ఠాగూర్ అన్నగారైన దీనేంద్రనాథ్ ఠాగూర్ వద్ద శిష్యరికం చేశారు. రవీంద్రుని గీతాలను రవీంద్ర శైలిలో పాడి ఆయన ప్రశంసలందుకున్నారు.

తొలిరోజుల్లో పంకజ్‌మల్లిక్ కలకత్తాలోని వైఎల్లో కంపెనీలో 1927లో "నెమిచ్చే అజ్ ప్రదూం బాదల్'', కొలంబియా గ్రామఫోన్ కంపెనీ వారి "ప్రళయ నాచే హే నటరాజ'' (1932) పాటలతో బెంగాలీల అభిమాన గాయకుడిగా ప్రశంసలందుకున్నారు. 1928

నుండి 1975 వరకు కలకత్తా ఆకాశవాణి కేంద్రంలో 47 సంవత్సరాల పాటు "సంగీత శిక్షర్ ఆషర్" అనే సంగీత శిక్షణ కార్యక్రమ నిర్వాహకునిగా ఆయన బెంగాలీ జనప్రియ గాయకులైనారు.

కలకత్తాలోని న్యూథియేటర్ సంస్థ లోని ఆస్థాన సంగీత దర్శకుడైన రామ్‌చంద్‌బోరాల్ పంకజ్ మల్లిక్‌లో నిబిడీకృతమై ఉన్న సంగీత ప్రతిభను గుర్తించి సినిమా రంగానికి ఆహ్వానించారు. బొరాల్‌తో కలిసి ఆయన 'ప్రెసిడెంట్', 'మంజిల్' చిత్రాలకు స్వర రచన చేశారు. పంకజ్ మల్లిక్ స్వయంగా సంగీతం సమకూర్చిన చిత్రం 'ముక్తి'. ఈ చిత్రంలో నాయిక కాననబాల పాడిన పాటలు ఆమెను బెంగాల్ కోకిలను చేశాయి.

పంకజ్ మల్లిక్ తొలిదశలో సినీ రంగంలో అనుభవంలేని వాడైనా కిశోర్ చంద్రదే (కె.సి.దే), సైగల్, ఉమాశశి, పహాడీసన్యాల్, అశిత్ బరన్ వంటి వారు ఆయన సంగీతంలో పాడేందుకు ఉత్సాహపడే వారు. ఆయన గాయకులచే విభిన్న శైలిలో పాడించడమే ఇందుకు కారణం. అందుకేనేమో న్యూథియేటర్స్ అధినేత బి.ఎన్.సర్కార్ "పంకజ్ వంటి సంగీత మేధావిని నేనెన్నడూ చూడలేదు" అన్నారొక సందర్భంలో. ఆ రోజుల్లో మల్లిక్‌తో పోటీ పడగలిగిన గాయకుడెవరైనా ఉన్నారంటే అది ఒక్క కె.ఎల్.సైగల్ మాత్రమే.

బెంగాలీలకు అభిమాన ప్రదమైన రవీంద్ర సంగీతంలో పంకజ్ ది విలక్షణశైలి. 'ముక్తి' సినిమాకు ఠాగూర్ రాసిన రెండు కవితలకు పంకజ్ కూర్చిన స్వరాలకు అచ్చెరువొందిన రవీంద్రుడు తాను ఆలోచించుకున్న ట్యూన్స్‌ను వదిలి పంకజ్‌ను అనుసరించారు. 1939లో బిమల్ రే పెళ్లిలో రవీంద్ర గీతాలు పాడి మెప్పొందారాయన. సినీ సంగీతంలో కోరస్‌ను ప్రవేశ పెట్టిన వారిలో వీరొకరు ఈయనను నయ్యర్, అనిల్ బిశ్వాస్‌లు ఆ తరువాత అనుసరించారు. సైగల్‌తో తొలుత బెంగాలీ పాటలు, కానన్ దేవితో టాగూర్ పాటలను పాడించిందీ, సైగల్‌ను తక్కువ శృతిలో పాడించిందీ పంకజ్‌మల్లికే.

పంకజ్ మల్లిక్ నటుడుగా 'డాక్టర్' చిత్రంలో నటించి హీరోగా మంచి పేరు తెచ్చుకున్నారు. తాను స్వయంగా గాయకుడై ఉండికూడా సైగల్‌లోని గాయకుడిని వెలికి తెచ్చారు. ఇది అందరికీ సాధ్యమయ్యేది కాదు. 'యాత్రిక్' చిత్రంలో కాళిదాసు కుమార సంభవం శ్లోకాల గానంతో పంకజ్ మల్లిక్ భక్తి సంగీతంలో చిరస్మరణీయులైనారు.

ఈ నేపథ్యంలో "సోజా రాజ్ కుమారి" (జిందగి), 'దోనైనా మత్‌వారే' (మైసిస్టర్) "ఎక్‌బంగ్‌లా బనానే న్యారా", "ఛుపోనా ఛుపోనా ఛుపోనా ఓ ప్యారీ సజనియా" వంటి పాటలు పంకజ్ స్వరాలతో రూపొందినవి. పంకజ్‌తో కలిసి పనిచేసిన మనోహర్ సింగ్ అనే గాయకుడు "మేము 'జల్‌జలా', 'యాత్రిక్' చిత్రాల్లో కలిసి పని చేశాము. ఆయన పాట గురించి ఎంత విపులంగా చెప్పేవారంటే, ఆ పాట ఏ మూడ్‌లో పాడాలి. బ్యాక్‌గ్రౌండ్ సన్నివేశం అన్ని వివరించే వారు" అంటూ పేర్కొన్నాడు. "పంకజ్‌గారు నేను పాడవలసిన పాటను ముందుగా తను పాడి, చిన్నచిన్నగా ఒక్కొక్కలైను నాతో పాడించే వారు" అంటూ మరో గాయని వినీతా చక్రవర్తి చెబుతారు.

పంకజ్ సంఖ్యాపరంగా ఎక్కువ చిత్రాలకు పని చేయలేదు. కానీపెద్ద హిట్ చిత్రాలకు గొప్ప గాయకులతో పని చేయడం వల్ల గొప్ప పేరు వచ్చింది. సినిమాల్లోకి రాక మునుపే 1932లో 'సారస్వత మహామండల్' సంస్థ వారి 'సురసాగర్' బిరుదు, 1970లో భారత ప్రభుత్వంచే "పద్మశ్రీ" పురస్కారం, 1973లో అత్యున్నత "దాదాఫాల్కే" అవార్డులు అందుకున్నారు.

1978 ఫిబ్రవరి 19న తన స్వరయాత్రను ముగించారాయన. మరణించి రెండు పుష్కరాలైనా మన స్మృతి పథంలో మెదులుతూనే ఉంటారు పంకజ్‌మల్లిక్.

**-హెచ్.రమేష్‌బాబు**

## పంకజ్ మల్లిక్ సంగీతం అందించిన చిత్రాలు

| | | |
|---|---|---|
| 1. | యహూదీ కీ లడ్కీ | 1933 |
| 2. | ధూప్ ఛావో | 1935 |
| 3. | మాయా (ఆర్.సి.బోరల్‌తో కలిసి) | 1936 |
| 4. | మంజిల్ | 1936 |
| 5. | మిలియనీర్ (ఆర్.సి. బోరల్‌తో కలిసి) | 1936 |
| 6. | ముక్తి | 1937 |
| 7. | ప్రెసిడెంట్ (ఆర్.సి.బోరల్‌తో కలిసి) | 1937 |
| 8. | ధర్తీమాతా | 1938 |
| 9. | బడీదీదీ | 1939 |
| 10. | దుష్మన్ | 1939 |
| 11. | కపాల్‌కుండలా | 1939 |
| 12. | నర్తకి | 1940 |
| 13. | జిందగీ | 1940 |
| 14. | డాక్టర్ | 1941 |
| 15. | మీనాక్షి | 1942 |
| 16. | కాశీనాథ్ | 1943 |
| 17. | మై సిస్టర్ | 1944 |
| 18. | ఊంచ్ నీచ్ | 1948 |
| 19. | ఛోటాభాయ్ | 1949 |
| 20. | మంజూర్ | 1949 |
| 21. | రూప్‌కహానీ | 1950 |
| 22. | జల్‌జలా | 1952 |
| 23. | యాత్రిక్ | 1952 |
| 24 | కస్తూరి | 1954 |

### పంకజ్ మల్లిక్ నటించిన చిత్రాలు

డాక్టర్, నర్తకి, కపాల్ కుండలా, ముక్తి.

**'మై సిస్టర్' చిత్రంలో కె.యల్.సైగల్ చేత పాడించిన చుపోనా చుపోనా, దోనైనా మత్‌వారే, ఐ కాతిబ్ ఎ తక్‌దీర్ పాటలను మళ్ళీ విడిగా పంకజ్‌మల్లిక్ పాడగా ఆ పాటలు కూడా రికార్డులుగా రిలీజు అయ్యాయి. 'మేనకోడలు' చిత్రంలో 'తిరుమల మందిర సుందర సుమధుర కరుణా సాగరా' పాటను సుశీల పాడిన తర్వాత తిరిగి రికార్డుల రూపంలో ఘంటసాల పాడినది కూడా విడుదలయినట్టు !**

# నీ ప్రేమకై

## తారాగణం

అబ్బాస్, వినీత్, లయ, సోనియా,
ప్రత్యేక పాత్రలో డా॥డి.రామానాయుడు
సత్యనారాయణ, బ్రహ్మానందం,
చంద్రమోహన్, సుధాకర్,
ఎ.వి.యస్., కె.పి.వి. ప్రసాద్,
గౌతంరాజు, మల్లేష్ యాదవ్,
మనోరమ, కవిత,
తెలంగాణ శకుంతల, సన,
అనితాచౌదరి, సౌమ్యారాయ్.

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## సాంకేతిక నిపుణులు

కథ : సతీష్
మాటలు : సత్యానంద్
ఆర్ట్ : వెంకటేశ్వరరావు
ఎడిటింగ్ : కె.వి. కృష్ణారెడ్డి
కెమెరా : వి. జయరాం
సంగీతం : ఎస్.ఎ. రాజ్‌కుమార్

పాటలు : భువనచంద్ర సామవేదం
షణ్ముఖశర్మ, కులశేఖర్,
రవికుమార్,
కలువ కృష్ణసాయి
కొరియోగ్రఫీ: డి.కె. రామానాయుడు
దర్శకత్వం : ముప్పలనేని శివ




నీ ప్రేమకై...

# అమృత

## తారాగణం

మాధవన్, సిమ్రాన్,
జె.డి. చక్రవర్తి, నందితాదాస్,
ప్రకాష్‌రాజ్, బేబీ కీర్తన


పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.


## సాంకేతిక నిపుణులు

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం :
మణిరత్నం
మాటలు : శ్రీరామకృష్ణ
సంగీతం : ఎ.ఆర్. రెహమాన్
ఫోటోగ్రఫీ : రవి కె. చంద్రన్
పాటలు : వేటూరి
ఆర్ట్ : షాబూ సిరిల్
ఎడిటింగ్ : శ్రీకర్ ప్రసాద్

డాన్స్ : బృంద
థ్రిల్స్ : విక్రమ్ ధర్మ
నిర్మాత:
వి. వెంకటరమణా రెడ్డి(రాజు)
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్స్:
వి. శిరీష్ రెడ్డి.
ఎస్. లక్ష్మణ రావు



రచన: సామవేదం షణ్ముఖ శర్మ **1** గానం: రాజేష్, చిత్ర

అ: ఓహో హో హో హో... లాలాలలా
వెండి మబ్బుల పల్లకిలో వెన్నెలమ్మా రావే
నిండు పున్నమి నవ్వులతో కోటి కాంతులు తేవే
మల్లె విరిసే మనసు పిలిచే కలల కలువే కనులు తెరిచే
నీ ప్రేమకై... నీ ప్రేమకై... ॥నీ॥ ॥వెండి॥
అ: సరికొత్తగా కలిశాములే ఈ ప్రేమ తీరాలలోనా
గమ్మత్తుగా మునిగాములే ఈ వింత ప్రణయాలలోనా
ఆ: మౌనాలలో దాచేసిన భావాలనే చూసుకోనా
చేయూతనే అందించిన నీ చెలిమినే చేరుకోనా
అ: మధురాశలు నాలో పల్లవించే నీ కలయికలోనా
ఆ: మది నిద్దుర లేచి పరవశించే నీ సన్నిధిలోనా
నీ ప్రేమకై...
అ: నీ ప్రేమకై... ॥వెండి॥
ఆ: ఇన్నాళ్ళుగా ఊహించని ఆనందమందింది నేడే
నీ జ్ఞాపకం నా గుండెలో చేరింది ఆ ప్రేమతోనే
అ: ఆహ్వానమే అందించగా అందం వరించింది నన్నే
నా సంగతే గుర్తించక నా ధ్యాస చేరింది నిన్నే
ఆ: నీ కన్నులలోనే నన్ను నేను కొత్తగ చూస్తున్నా
అ: తొలి కోరికలన్నీ తోరణాలై స్వాగతమిస్తున్నా
నీ ప్రేమకై... ఆ: నీ ప్రేమకై... ॥వెండి॥

రచన: కులశేఖర్ **2** గానం: సంజయ్, శ్రీలేఖ

ఆ: కలలు కన్నా నీకై ఓ ప్రేమా తరలిరా నేస్తమా
అ: కలవరించా నీకై ఓ ప్రేమా కౌగిలే చేరుమా



అ: ఇన్నాళ్ళు వేచున్నానె నీ ప్రేమకై
ఆ: నా సర్వం అర్పిస్తాను నీ ప్రేమకై ॥మందాకినీ॥
అ: బుగ్గల్ని ముద్దుల్తో సింగారించనా
నడుంవొంపు మడతల్లో నాట్యం చెయ్యనా
ఆ: క్రీగంటి చూపుల్తో హుషారించనా
సొగసుల్తొ సందేళ సవాల్ చెయ్యనా
అ: ఖజురాహో శిల్పంలా నాదరికొచ్చెయ్‌మంట
అచ్చంగా వెచ్చంగా ఒకటై పోదామంట
ఆ: వెనువెంటే ఒడికొస్తే అలుసై పోతానంట
విరహంతో రగిలేదే అసలైన ప్రేమంట
అ: కాలాన్నే నేనౌతాను నీ ప్రేమకై
ఆ: కళ్ళల్లో కాపురముంటా నీ ప్రేమకై ॥మందాకినీ॥
ఆ: వయసేమో జతకోసం వెతికేస్తూవుంటె
తనువేమో తాపంతో పడిలేస్తూవుంటె
అ: తెరచాటు వయ్యారం బరి దాటెయ్‌మంటె
తమకంతో చినదాన్ని ఒడి దోచెయ్‌మంటె
ఆ: అటు నీలో ఇటు నాలో నిషా ముంచుకొస్తే
అల్లాడే అందాల విందే చేయమంటే
అ: అందాక వచ్చాక ఇక నే నాగనంటె
కవ్వించే కౌగిట్లో కసి కాటేస్తానంటే
ఆ: అణువణువు అంకితమిస్తా నీ ప్రేమకై
బిడియానికి సెలవిచ్చేస్తా నీ ప్రేమకై అ: ॥మందాకినీ॥



రచన: వేటూరి **1** గానం: ఎ.ఆర్. రెహమాన్

మరుమల్లెల్లో ఈ జగమంతా విరియగా
ప్రతి ఉదయంలో శాంతి కోసమే తపనగా
పారాణేదో భూమికి వెలుగుగా
మందారాలే మత్తును వదలగా
కనులా తడి తుడిచే ఒడిలో పసిపాపాయి
చిలికే చిరునగవే చీకటి తల్లికి వేకువ ॥మరుమల్లెల్లో॥
గాలి పాటలా జడివాన జావళి
అది మౌనంలా అధూరం అవునా
వేల మాటలే వివరించలేనిది
తడి కన్నుల అర్థం అవునా
ఆహో... ॥మరుమల్లెల్లో॥
లేత పాపలా చిరునవ్వు తోటకే
దిగి వస్తావా సిరుల వెన్నెలా
వీర భూమిలో సమరాలు మానితే
వినిపించేటి స్వరమే కోయిలా ॥మరుమల్లెల్లో॥

రచన: వేటూరి **2** గానం: సుజాత, శ్రీనివాసమూర్తి, టిప్పు, కార్తిక్, ఎమ్. మధుమతి

కో/ఆ ఆకశాన మేఘమాల ఉరుకు మానునా
అమృతం గుండెలోన అణిగి వుండునా
అ/కో. సుందరి జంట తోకల సుందరి ॥సుందరి॥
ఆ: హే... వదరకే పసిదానా హే
అ: హే... అలజడి అలల సుందరి హే హే...
ఆ: సుందరి జంట తోకల సుందరి ॥సుందరి॥



రచన: వేటూరి **6** గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, బృందం

ఆ: ఎంత చక్కిల్ గిల్ గిల్ కళ్ళు జిల్ జిల్ జిల్ జిల్
చెక్కిళ్ల ముద్దుపెడితే నీ చిన్నారి ముద్దుపెడితే ॥ఎంత॥
అ: ఏ దేవి వరమునీవో చిరునీడ లేల కనుల ॥ఏ దేవి॥
ఆయువడిగినది నీ నీడే... ఆ... ॥ఆయు॥
గగనం ముగియు దిశ నీవేలే
గాలికెరటమై సోకినావే ప్రాణవాయువే అయినావే
మదిని ఊయలూగే ॥ఏ దేవి॥
ఆ: ॥ఎంత॥
అ: ఎదకు సొంతంలే ఎదురు మాటవులే
కలికి వెన్నెలవే కడుపు కోతవులే
స్వాతి వాననీ చిన్న పిడుగని ॥స్వాతి॥
ప్రాణమైనదీ పిదప కానిదీ ॥ప్రాణ॥
మరణ జనన వలయం నీవే ॥ఏ దేవి॥
ఆ: ॥ఎంత॥
అ: సిరుల దీపం నీవే కరువురూపం నీవే
సరస కావ్యం నీవే తగని వాక్యం నీవే
ఇంటి వెలుగని కంటి నీరని ॥ఇంటి॥
సొగసు చుక్కవో తెగిన రెక్కవో ॥సొగసు॥
నేనెత్తి పెంచిన శోకంలా ॥ఏ దేవి॥

ఇది నీకు తుదిలేని చదరంగమా
చ: నీ ప్రాణమే చెలిగా భావించి నీవు
నీ గుండెలో తనను కొలువుంచినావు
ఆ ప్రేమనే తెలుసుకోలేని తాను
ఎంచేతనో తుదకు బలి చేసె నిన్ను
లోకాన నిజమైన ప్రేమన్నది
చూసేందుకే జాడ కరువైనది
నీ ప్రేమ నిజమైతె నెగ్గేది నీవే
ఈ మాట ఇకపైన నమ్మాలి నువ్వే ॥మనసన్నదే॥
చ: స్నేహానికే విలువ మారింది నేడు
నీ మంచికి జరిగె ఎనలేని కీడు
ద్రోహానికే కలదు లోకాన పేరు
స్వార్థానిదే గెలుపు ఇది నేటి తీరు
కన్నీట బరువైన నీ కళ్లతో
ఈ మౌన పోరాట మెన్నాళ్ళలే
నీదన్న దేనాడు చేజారి పోదు
లేదంటె అది నీకు దక్కేది కాదు ॥మనసన్నదే॥

రచన: భువనచంద్ర | 6 | గానం: రాజేష్, చిత్ర

అ: మందాకినీ... మందాకినీ మనసంత నువ్వేలే (2)
సౌదామినీ... సౌదామినీ నీ సొగసు నాదేలే
ఆ: ఆ... కనుపాపల్లో కదలాడేది నీ రూపే
ఎదలోయల్లో వినిపించేది నీ పేరే



ఆ: ప్రియతమా నీ రాకతో నా కథే మారిందిలే
అ: ప్రియతమా నీ చూపుతో నా దశే తిరిగిందిలే
ఆ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్
అ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్ ॥కలలు॥
ఆ: గుప్పెడు గుండెకు నేడు నీ స్నేహం దొరికిందమ్మా
తియ్యని రాగం ఏదో అనుబంధం పెంచిందమ్మా
అ: మబ్బుల నేల పైన నాకోసం వచ్చావమ్మా
మాటల కందని భావం నీ కెట్టా చెప్పేదమ్మా
ఆ: కన్నుల్లో చదివాను నీ ప్రేమని
గుర్తుంచుకుంటాను ఈ రోజుని
అ: ఓ మాటలో చెప్పెయ్యవా నా తోడుగా ఉంటానని
ఆ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్
అ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్॥కలలు॥
అ: ఎక్కడ ఉన్నావంటూ మది నిన్నే అడిగిందమ్మా
కన్నుల్లోనే ఉంటే ఊరంతా వెతికిందమ్మా
ఆ: ఇక్కడ అక్కడ అంటూ నీ చూపుకు హద్దేంటమ్మా
గాలే చేరని చోట ఏకంగా తాకిందమ్మా
అ: అందించవే లేత అందాలని బంధించకే కన్నె ప్రాయాలని
ఆ: నా కిప్పుడే తెలిసిందిలే నీకోసమే పుట్టానని
అ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్
ఆ: ఐ లవ్ యు లవ్ యు లవ్ యు ఓ మై డియర్॥కలలు॥

రచన: బి. రవికుమార్ | 3 | గానం: రాజేష్, చిత్ర

అ: ఓ ప్రేమా స్వాగతం నీతోనే జీవితం (2)
ఆ: అతిథిలాగ వచ్చేశావు మనసునాకు ఇచ్చేశావు
అ: ఇలా నన్ను వీడక ఉంటే చాలు తోడుగా



రచన: వేటూరి | 5 | గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, బలరామ్, ఫెబి, రెహానా

అ: కడసారిది వీడ్కోలు కన్నీటితో మా చేవ్రాలు
అడవిచెట్లను పావురాళ్లను కలలోనైనా కనగలమా
ఆశలు సమాధి చేస్తూ బంధాలను బలిచేస్తూ
ప్రాణాలే విడిచి సాగే పయనమిది... ఓ... ॥కడసారిది॥
అ: తల్లి నేలని పల్లెసీమని విడతరమా తరమా ॥తల్లి॥
ఉన్న ఊరిలో ఉన్న సౌఖ్యము స్వర్గమివ్వగలదా గలదా
జననానికి ఇది మాదేశం మరణానికి మరి ఏ దేశం॥జన॥
కదిలే నదులారా కలలే అలలౌనా
జననీ జన్మభూమి స్వర్గాదపీ గరీయసీ
కన్నీటి తెరలలో తల్లి నేలని
కడసారి మేము కనలేక కదిలిపోయేము ॥కడసారిది॥
ఆ: పాడే జోలలు పాపల ఏడ్పుల పాలైపోతే
అ: పాడే జోలలు పాపల ఏడ్పుల పాలైపోతే
ఆ: ఉదయ సూర్యుడే వెలయ ధూమపు తెరలో దాగే
అ: పూలడోల నిన్నటి నిదర ముళ్ళు కదా ఇప్పటి నడక
ఉసురే మిగిలుంటే మరలా దరిచేరమా
మనసే మిగిలుంటే ఒడిలో తలదాచవా
తలపే అల్పం తపనే అధికం
బరువెక్కిన హృదయం మోసుకుమేం పోతున్నాం
ఆ: కడసారిది వీడ్కోలు కన్నీటితో మాచేవ్రాలు
అడవి చెట్లను పావురాళ్లను కలలోనైనా కనగలమా
అ: ఆశలు సమాధి చేస్తూ బంధాలను బలిచేస్తూ
ప్రాణాలే విడిచి సాగే పయనమిది



హే... హే... నల్లరాయి నవ్వేనమ్మ పంచదార చిలకవమ్మ
॥ఆకశాన॥
అ: చిన్న చిన్న తప్పులెన్నొ దినము దినము పొర్లుతాయి
పొంగివచ్చే కోపాన్ని పూతనవ్వే తుడిచెనమ్మా
ఆ: కలత తీర్చే సొట్టబుగ్గా జడలలో మేఘాలే ఊగే
అ: ఆనందపు అంచు ఆమె తుడిచేసే బాధా ఆమే
ఆ: చలి ముళ్ల తెమ్మెర ఆమేలే
ఆ/కో: అలలు పట్టి తాటి చుట్టి కట్టుట సాధ్యమైన పనియా
ఈమె గార్ని ఆప మనకు ఇక తరమా హోహో...॥సుందరి॥
అ/కో: పాలపళ్ల బాలపిట్ట చెక్కిట్లో చిటుకున
అ: పాయసాల ముద్దులిస్తే పసిడి కానుకే
ఆ: చిట్టితల్లి అమ్మలకు కన్నతల్లి ఈమె కాద
మల్లెలాంటి కూతురైన మారుతల్లి ఈమె కాదా
ఆ/కో: బడికి వెళితే విలన్ వరసా
ఆ: మార్కుల్లో హీరోయిన్ తెలుసా
ఆ: అడిగేను ప్రశ్నలు వేయి
తనకు బదులు తెలిసి బడాయి
ఆ: టీచర్‌కే ఇంటిలోన పంతులమ్మ
కో: ఎవడు దీన్ని మనువు ఆడి అసలు ఎన్ని పాట్లు పడునో
దీన్ని చేసుకున్న వాడు రేపు
చెంపలేసుకుంటాడహోహో... ॥సుందరి॥

రచన: వేటూరి | 3 | గానం: చిన్మయ్, హరిహరన్

అ: ఎంత చక్కిల్ గిల్ గిల్ కళ్ళు జిల్ జిల్ జిల్ జిల్
చెక్కిళ్ళ ముద్దుపెడితే నీ చిన్నారి ముద్దుపెడితే ॥ఎంత॥

ఆ: నన్నే నీవు చేరగా నింగి నేల వేడుక ॥ఓ ప్రేమా॥
ఆ: ఇన్నాళ్ళుగా లేదేమరి ఈరోజే ఏమైనది
నా గుండెపై నీ సంతకం ఎలాగ చేరినది
అ: వింతేమరి నీ వన్నది వెన్నెల్లో గోదావరి
అంతేమరి ప్రేమన్నది చిత్రాలే చేసినది
ఆ: నీ చూపే తాకెనుగా వెలుగులతొలి పున్నమిలా
అ: నీ చూపే తాకెనుగా వెలుగుల తొలి పున్నమిలా
ఆ: పల్లవించు ప్రాయం అందించమంది సాయం
అ: ఓ ప్రేమా స్వాగతం
ఆ: మది నీకే అంకితం
అ: నీ రాకనే కోరిందిలే నూరేళ్ళ నా జీవితం
ఊరించక అందించవా లేలేత నీ అధరం
ఆ: వాసంతమే నా సొంతమా అంటోంది నీ పరిచయం
నీ ధ్యాసలో ఉన్నానుగా నీ తలపే అతిమధురం
అ: జే గంటే మోగెనుగా శుభమస్తను దీవెనగా
ఆ: జే గంటే మోగెనుగా శుభమస్తను దీవెనగా
అ: హాయి రాగమేదో మనసంత నిండిపోగా
ఆ: ఓ ప్రేమా స్వాగతం మదినీకే అంకితం ॥ఓ ప్రేమా॥

రచన: కులశేఖర్ **4** గానం: రాజేష్, ఉష

అ: కోటి తారలా కాంతి ధారలా నేలకొచ్చెనా కన్నె మేనక
ఆ: గుండె గూటిలో పల్లె పాటలా పల్లవించనా ప్రేమ నాయకా
అ: ఎపుడమ్మా మధుమాసం
ఆ: ఎదురవగా మనకోసం
అ: చిలక రెక్కపై లగ్నపత్రిక రాయమన్నది గండుకోయిల ॥కోటి॥

ఆ: చెలియా చినుకై నిను తాకాలని
సఖియా వెలుగై నిను చేరాలని
ఆ: ఎగసే మనసే నీకివ్వాలని
వరసే కలిసి తోడవ్వాలని
అ: కౌగిళ్ళలో కలే పండాలని
ఆ: నూరేళ్ళిలా మనం ఉండాలని
అ: అగ్ని సాక్షిగా ఏడు అడుగులు
వేయమన్నది వేద మంత్రము ॥కోటి॥
ఆ: తెలుసా వయసా తొలి వలపన్నది
ఎదలో లయలా అది దాగున్నది
అ: వినవా మనసా తను ఏమన్నది
కనులే కలిపి మైమరపన్నది
ఆ: నా ఆశలే ప్రియా తీరేదెలా
అ: నీ శ్వాసగా చెలీ మారేదెలా
ఆ: వాన చినుకులే తలంబ్రాలుగా
పోయమన్నది మేఘమాలిక అ: ॥కోటి॥

రచన: కలువ కృష్ణసాయి **5** గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ప: మనసన్నదే లేదు ఆ బ్రహ్మకు
ఎదురీత రాశాడు నీ జన్మకు ॥మనసన్నదే॥
పైనుండి పాలించు ఓ దైవమా
విధిరాత ఎదకోత నీ నైజమా
ప్రియమైన ప్రేమే నిను దీవెనమ్మ



ఆ: ఏ దేవి వరమునీవో చిరునీడ లేల కనుల ॥ఏ దేవి॥
ఆయువడిగినది నీ నీడే... ఆ... ॥ఆయు॥
గగనం ముగియు దిశ నీవేలే
గాలికెరటమై సోకినావే ప్రాణవాయువే అయినావే
మదిని ఊయలూగే ॥ఏ దేవి॥
అ: ॥ఎంత॥
ఆ: ఎదకు సొంతంలే ఎదురు మాటవులే
కలికి వెన్నెలవే కడుపు కోతవులే
స్వాతి వాననీ చిన్న పిడుగని ॥స్వాతి॥
ప్రాణమైనదీ పిదప కానిదీ ॥ప్రాణ॥
మరణ జనన వలయం నీవే ॥ఏ దేవి॥
అ: ॥ఎంత॥
ఆ: సిరుల దీపం నీవే కరువురూపం నీవే
సరస కావ్యం నీవే తగని వాక్యం నీవే
ఇంటి వెలుగని కంటి నీరని ॥ఇంటి॥
సొగసు చుక్కవో తెగిన రెక్కవో ॥సొగసు॥
నేనెత్తి పెంచిన శోకంలా ॥ఏ దేవి॥

రచన: బి.హెచ్. హమీద్, వేటూరి **4** గానం: మహమ్మద్ రఫీ, నోయేల్, స్వర్ణలత, అనుపమ

అ: ఓ యారు వెన్న ఎన్న యారువో
అటకాసులిచ్చి వెళ్ళు మల్లియే ॥ఓ యారు॥
సిన్నోరే సిన్నోరే సిన్నోరే
గజేగ్ మైలకెళ్లి చూద్దాం రా
సిన్నోరే సిన్నోరే సిన్నోరే

మాజా పోర్టు మజా పోర్టు వెతుకుదాం రారా
గజపెణ్ణె గజపెణ్ణె బేరం చెప్పవే ॥గజ॥
నీ పడుచు వేళ్ళు పట్టుకున్న వెలను కలపకే నువ్
ఆ: హేహే... అక్కడే ఆగు... నీ మిటకరింపు చూపులు చాల్లే ఆపు
హే... మల్లీ మల్లీ మల్లీ...
చిలక్కులు యాహలు వెన్న ఆదిరినమల్లి
ఈ ప్రేమకి కామానికి ఉండాలి అదుపులు
ఆ... యహల్ వెన్న ఎన్న
అ: యారువో
ఆ: అటకాసులిచ్చి వెళ్ళు
అ: మల్లియే ॥ఆ యహలు॥
అ: సిన్నోరే సిన్నోరే సిన్నోరే గాడ్‌ఫేస్ తీరానికి పోదాంరా
సిన్నోరే సిన్నోరే సిన్నోరే గొడుగు కింద
జోడికట్టి కూర్చుందా రారా
కలుకల్లె కలుకల్లే పేరేమిటే ॥కలుకల్లె॥
కడలొడ్డున కవ్విస్తూ సాగుదాం రావే
ఆ: హేహే... అక్కడే ఆగు... మా ఇంటి అయన్ని రమ్మంటాలే
అ: హో హయ్యో... నంగి నంగి
తప్పిపోయే తప్పిపోయే మా చెల్లమ్మా
బావగార్ని అడిగానని చెప్పు చెల్లాయి
ఆ: ఓ యహలు వెన్న ఎన్న యారువో
యమజోరు చూపి జాలిపడితిరే ॥ఓ॥
అ: ఓ యారు వెన్న ఎన్న యారువో
అట కాసులిచ్చి వెళ్ళు మల్లియే ॥ఓ యారు॥

# దాంపత్యానికి గీటురాయి!

-డి.వి. నరసరాజు



కొంతమంది తమ మనసులోని భావాలను పంచటంకోసం రాస్తారు. కొంతమంది డబ్బుకోసం రాస్తారు. కొంతమంది ఆబ్లిగేషన్ కోసం రాస్తారు. కానీ పాఠకుని ఉత్తరానికి స్పందించి కథ రాసేవారు అరుదుగా కనిపిస్తారు. అటువంటి అరుదైన సంఘటనకి ఉదాహరణే ఈ కథ! గత సంచికలోని 9వ పేజీలో శ్రీ పి. సత్యం (కాకినాడ) రాసిన ఉత్తరాన్ని నరసరాజుగారు చదివి స్పందించి, ఆ విషయాన్ని చెప్పి మరీ ఇచ్చిన కథ ఇది.

ఈ కథపై మీ అభిప్రాయాలను పంపవలసిన చిరునామా


డి.వి.నరసరాజు,<br>
ఇంటి నెం. 662, రోడ్ నెం. 12,<br>
బంజారాహిల్స్, హైదరాబాద్ - 500 034.


ఎంతో అన్యోన్యంగా -ఆదర్శంగా -కాపురం చేసే దంపతులయినా

-జీవితంలో - ఎప్పుడో ఒకప్పుడో- అప్పుడప్పుడో- కీచులాడకుండా- పోట్లాడకుండా వుండరని నా నమ్మకం!

"ఫలాన దంపతులు జీవితంలో ఎన్నడూ పోట్లాడుకొని ఎరగరు" అని ఎవరన్నా చెప్పినా - నేను నమ్మను మీరూ నమ్మవద్దని నా సలహా - సమాజంగూడ నమ్మదు.

మన వీధిలోకి - కొత్తగా - ఒక జంట వచ్చి - అద్దె యింట్లో వుంటున్నారనుకోండి. వీధిలో వెడుతూ వాళ్ళిద్దరూ సరదాగా జోకులు వేసుకుంటూ పక పక నవ్వుకుంటూ వెళు తుంటారను కోండి. వాళ్ళ యింట్లో పని మనిషిగూడ - "వాళ్ళిద్దరూ పోట్లాడు కుంటుండగా గాని కనీసం మూతి విరుపులూ అలకలు నిష్టూరాలూ ఆడుకోవడంగాని నేనెన్నడూ చూడలేదని సర్టిఫికెట్ యిస్తుందనుకోండి!

మనకు వెంటనే అనుమానం వస్తుంది - వాళ్ళు అసలు దంపతులా? లేక...? అని!

రామాయణంలో సీత - రాముడు కూడా ఎన్నో సందర్భాలలో పోట్లాడుకుని వుంటారనే నా నమ్మకం! కాకపోతే వాళ్ళను ఆదర్శ దంపతులుగా చిత్రించాలి కాబట్టి వాల్మీకి వాళ్ళ కీచులాటల్ని



గురించి వ్రాసి వుండడు. ముఖ్యంగా బంగారు లేడి విషయంలో వాళ్ళిద్దరూ కీచులాడుకుని వుంటారనే నాకు గట్టి నమ్మకం!

బంగారు లేడిని చూసి ముచ్చటపడి - సీత దానిని తెచ్చి యిమ్మని రాముడిని అడిగి వుంటుంది.

"అది బంగారు లేడికాదు! ఎవరో రాక్షసులు నీలాంటి వాళ్ళను మభ్యపెట్టడానికి యిలాంటి మాయలు చేస్తుంటారు" అని నచ్చ జెప్పటానికి రాముడు ప్రయత్నిస్తే...

సీత కోపంగా -"తెచ్చి యివ్వడానికి యిష్టంలేక యివన్నీ సాకులు!" అని చరచరా లోనికి పోయి ముసుగు తన్ని పడుకుని వుంటుంది. యిక గత్యంతరంలేక రాముడు బంగారు లేడి కోసం వెళ్ళివుంటాడు.

అందాకా ఎందుకు? ఉదాహరణకి జరిగిన విషయం ఒకటి చెబుతాను.

మదరాసులో మా పక్క వీధిలో ఒక దంపతుల జంట వుండేవాళ్ళు. అతను బ్యాంకులో గుమాస్తా. పెళ్ళయి నాలుగయిదేళ్ళు అయింది. మధ్య తరగతి కుటుంబం! అయినా మోజుపడి ఒక వేసవిలో కొడైకెనాల్ వెళ్ళారు - చల్లదనం కోసం!

పెద్ద హోటళ్లలో వుండే ఆర్థిక స్తోమత లేక ఒక చిన్న లాడ్జికి వెళ్ళారు. రూం కావాలని అడిగారు. రూం ఖాళీ లేదన్నాడు లాడ్జి యజమాని!

"నేను ముందే చెప్పాగా! అడ్వాన్సుగా రూం బుక్ చేయండి అంటే మీరు విన్నారా?" అన్నది భార్య నిష్టూరంగా!

భర్త నీళ్ళు నములుతూ -"అడ్వాన్సుగా బుక్ చేయనక్కరలేదు. రూంలు తేలిగ్గానే దొరుకుతయ్ అని మా మేనేజరు చెప్పాడు" అన్నాడు.

"మీ మేనేజరు మాటకిచ్చిన విలువ నా మాటకు యివ్వలేదు" అని భార్య కోపంగా సూట్‌కేసు తీసుకుని పోబోతుంటే...

భర్త పట్టుకుని ఆపి 'ఎక్కడికి?' అన్నాడు.

"నేనుండను! నేను మదరాసు వెళ్ళిపోతాను" అని భార్య విదిలించుకుంది.

"ఏమిటా మొండితనం? ఈ లాడ్జిగాక పోతే యింకోలాడ్జికి వెళదాం" అని భర్త ఆమె చేతిలో సూట్‌కేసు లాక్కోబోయాడు.

"నేనుండను! వదలండి!" అని భార్య సూట్‌కేసులాక్కోబోయింది.

ఇద్దరూ యిలా పెనుగులాడుతుండగా... లాడ్జి యజమాని వచ్చి...

"ఆగండి! రండి! రూం యిస్తాను" అన్నాడు.

"ఇందాక రూంలు ఖాళీ లేవన్నారు?" అన్నాడు భర్త కాస్త కోపంగా!

అందుకు లాడ్జి యజమాని - "అయ్యా! మాకుండే యిబ్బందులు మాకుంటయ్! అందరూ భార్యాభర్తలమేనని - రూం కావాలని వస్తారు! రూం యిస్తాం !

వారం రోజుల క్రితం పోలీసులు వచ్చి మా లాడ్జిమీద దాడిచేస్తే మూడు గదుల్లో వున్నవాళ్ళు దంపతులు కాదని - ఏదో లేపుకొచ్చిన రకమని తేలింది. పోలీసులు వాళ్ళమీదనే కాక రూంలు యిచ్చినందుకు మా మీదగూడ కేసులు పెట్టారు! కోర్టు చుట్టూ తిరగలేక చస్తున్నాం!

మొదట మీరుగూడ అదే రకమనుకుని రూం ఖాళీ లేదన్నాను.

యిప్పుడు మీరు నా కళ్ళముందే లక్షణంగా పోట్లాడుకోవడం చూసిన తరువాత - మీరు అసలైన సిసలైన భార్యాభర్తలని నాకు పూర్తి నమ్మకం కలిగింది! రండి! రూం యిస్తాను" అని వాళ్ళిద్దర్ని లోనికి తీసుకెళ్ళాడు.



# 16-31 జనవరి 2002లో శ్రీ పరుచూరి గోపాలకృష్ణ రాసిన విమానము నోరులేని యంత్రము కథకు వచ్చిన స్పందన

'హాసం'లో పరుచూరి కథ వచ్చిందని నా మిత్రుడు చెప్పగానే, ఒక చేత్తో టిఫిన్ చేస్తున్న నేను, మరో చేత్తో ఆ పత్రిక లాక్కొన్నాను. కారణం నా అభిమాన సినీ రచయితల్లో నా పరిచయం లేని పరుచూరి బ్రదరూ వున్నారు.

తింటున్న ఉప్మా ఆపి, 'విమానం నోరులేని యంత్రము' అనే కథా కంచంలో వారి కరం నుండి వడ్డించిన పదాలనే పదార్థాలను నా పెదాలతో ఆస్వాదించి జీర్ణించుకొన్నాక ఈ అభిప్రాయం రాస్తున్నాను. "అరవై సార్లు ఫోన్ చేశారని వంద సార్లు చెప్పాను" అన్న గణితపు మాటలు గమ్మత్తుగా వున్నాయి.

'యమద్వారం నుండి వచ్చిన వి.ఐ.పి లోకవైపు', 'వార్తకై పులకిస్తూ వస్తున్న పురజనులు మరోవైపు' 'సస్యశ్యామలమైన పొలం, సర్వనాశనమైందని విలపిస్తున్న కుటుంబరావు దృష్టిలో తెగుతున్న బ్రహ్మముడి, తీస్తున్న తాళిబొట్టు, తగలబడుతున్న శుభలేఖ, చదవరుల కళ్ళల్లో సినీరీళ్ళలా కదులుతున్నట్టు చిత్రీకరింపబడ్డాయి. అష్టకష్టాలపాలై, నష్టపరిహారం కోసం అర్థించే వారిని సైతం పీనుగపై గద్దల్లా పీక్కుతినే ఆఫీసు సిబ్బందిపై పెట్రోలు పోసి తగలబెట్టాలనిపిస్తుంది. ఏ ప్రభుత్వమొచ్చినా ఈ పవిత్ర దేశంలో లంచాన్ని మించిన నీచమైంది ఏముంది గనక? అన్న నగ్నసత్యం ఈ కథా భాగంలో అర్థం పడుతుంది. కళ్ళు చెమ్మగిల్లేలా చేస్తుంది.

దిక్కుతోచక బిక్క మొగంతో తిరిగొచ్చిన రావు ఇంటిముందు జనాలు మూగి వున్నారు. అంటే ఎవరో ఆత్మహత్య చేసికొని వుండాలి. అలా రాస్తే ఆయన సినిమా పరుచూరి ఎలా అవుతారు? అన్నీ కోల్పోయి తట్టుకొన్న సుకుమారి కామాక్షి, భర్త మరో పెళ్ళి చేసుకొన్నాడన్న వార్తతో పిచ్చిదైపోయింది! ఇలాంటి అవస్థలో ఇరుక్కున్న ఏ కుటుంబమైనా, ఈ పేరా చదివితే నిజంగా పిచ్చెక్కినంత పనౌతుంది. పిచ్చికామాక్షి ప్రశ్నకి ఖచ్చితమైన జవాబు బుజ్జి వల్ల పరుచూరికి దొరకటం మిర్చీ బజ్జీలా వుంది. 'కరణేషుమంత్రీ' అన్నారందుకే. చివర్లో కథ జరగలేదు. కల్పితమన్నారు. అయినా ఇది సహజత్వానికి సామీప్యంలోనే వుంది. 'ముగింపు' కట్నం కోసం అర్రులు చాచే, కొందరు అల్లుళ్ళకైనా సందేశాత్మకంతో కనువిప్పు కాగలదని ఆశిద్దాం.

**-జోషి విశ్వనాథమ్, తాండూరు.**

16-31 జనవరి 'హాసం' పత్రికలో ప్రచురించిన 'విమానము నోరులేని యంత్రము' కథ ఆద్యంతమూ ఆసక్తితో కొనసాగింది. ఈ కథ చదువుతుంటే 'సినిమా' చూసినట్టే అనిపించింది. కథలు వ్రాయడంలో సిద్ధహస్తులైన మీరు చాలా చక్కటి కథను 'హాసం'లో అందించారు. వ్రాసిన శైలి కూడా విలక్షణంగా ఒక ప్రత్యేకతను సంతరించుకున్నదనటంలో అతిశయోక్తి లేదు.

**-ఎం.డి ముస్తఖీమ్, కొల్లాపూర్ - 509 102**

'విమానము నోరులేని యంత్రము' చదివాను. నిజంగా చెప్పాలంటే కథ మొదలెట్టగానే ఎంత టయిమ్ తక్కువయితే మాత్రం కథ రాయమంటే సొంత డబ్బా కొట్టుకుంటున్నాడేందబ్బా అని నిరాసక్తంగా పుస్తకము మూసేసాను. మళ్ళీ ఒక క్షణం ఆలోచించాను. పుడ్డుకోసం వ్యాపార చిత్రాలలో పని చేస్తున్నా నమ్మిన సిద్ధాంతాల్ని మరిచిపోని అపూర్వ బ్రదర్స్ ఆయా చిత్రాలలో ఎర్రెర్రని మెరుపులు మెరిపిస్తుంటారే! ఇదేంటి ఇలా వుంది! లేదు... ఇందులో ఏదో.... వుంది అని పడేసిన 'హాసం' తీసుకొని కథను మొదట్నించి చివరదాకా గబగబా చదివేసి అదేంటో కనుక్కొని నా మొదటి అభిప్రాయానికి ఒకింత సిగ్గుపడ్డాను. నేటి సమాజంలో కుళ్ళులా, మాన్పలేని మచ్చలా అల్లుకు పోయిన, ఇంకా పోతున్న అతి సున్నితము అతి హీనమూ అయిన వరకట్న సమస్యను తీసుకొని చిన్న కథలో 'హేట్సాఫ్' అనిపించేలా వ్రాశారు.

ఒక కథ చదువుతున్నామా? సినిమా చూస్తున్నామా? అని భ్రాంతి కలిగించింది. ఈ పాయింటు వరకు చదివిన తరువాత కూడా అసలు సమస్యకు (వరకట్నం) విమానానికి రచయిత ఎలాముడెతాడో అని అని పిస్తుంది. అల్లుడు రెండో పెళ్ళి చేసుకోగా, పిచ్చిదయిపోయి కూలిన విమానంలో ఆడుకుంటున్న పిల్లల్ని అదలిస్తూ "దీన్ని నా తాళి బొట్టు పెట్టికొన్నా" అంటున్న కామాక్షిని చూసి "అయ్యో పాపం! వరకట్న పిశాచమా ఎంత పని చేశావే!" అని తిట్టుకోని చదువరులుంటారని నేననుకోను.

"ఇమానమా! ఇమానమా! కాపురం ఎందుకు చెడిపోయిందని, అడుగు తున్న కామాక్షి ప్రశ్నకు, కొంత కాస్ట్లీ (పుట్టిన రోజు పాతిక వేల గిఫ్టు) అయినా కూడా శ్రీమతి గోపాలకృష్ణగారి జవాబు సూపర్బ్. మహిళలకు ఓ ప్రక్క పాదాభివందనం చేస్తూనే మీరన్న "ఎన్ని మహిళా సంఘాలు గొంతెత్తి అరిస్తే మాత్రం బాధితురాలయిన మహిళ గొంతెత్తనిదే ఈ వరకట్న సమస్య ఎలా తీరుతుంది" అన్నది రూపాయికి నూరు పైసలంత నిజం.

కాని చివరలో గమనిక అనక పోయినా బ్రాకెట్లలో కల్పితం వగైరా వగైరా అంటూ.... ఎందుకు వ్రాశారో అర్థం కాలేదు. కథలో మీరు జీవితాన్ని సమాజ పరిస్థితులనే ప్రతిబింబింపచేశారు. ఎవరో భుజాలు తడుముకొంటారని ఎందుకనుకోవలసి వచ్చింది. ఒక వేళ అలా భుజాలు తడుముకోవల్సిన పరిస్థితే వస్తే నేను, మీరు ఈ సమాజంలో ప్రతి వ్యక్తి తడుముకోవలసిందే. అత్యద్భుతమైన కథ అందించినందుకు అందుకోండి అభినందనలు!

**-జి.ప్రభాకర్‌రావు, ఇ.ఇ., హైదరాబాద్**

16-31 జనవరి, 2002 'హాసం' పత్రికలో వ్రాసిన 'విమానం నోరులేని యంత్రము' అనే కథ చదివాను. "రవి కాంచనిచో కవి కాంచును కదా' అన్న మాటను అక్షరాలా ఋజువు చేశారు. అంటే ఎక్కడో పల్లెటూర్లో చేల మధ్య

## రచయిత విశ్లేషణ

**'హాసం' ఎడిటర్ గారికి నమస్కారం.**

నా జీవితం కథా రచయితగానే మొదలయింది. 1975 జనవరి 'స్వాతి' మాస పత్రికలో నేను రాసిన కథ 'బుధ జనవిధేయుడు' మొట్టమొదటి సారిగా అచ్చయినప్పుడు విచిత్రమైన అనుభూతి ఫీలయ్యాను. కాని ఆ కథకు స్పందిస్తూ అనేక లేఖలు వచ్చినప్పుడు అవి చదివినప్పుడు... పెన్ను ఏమయినా చెయ్యగలదు అనిపించింది.

ఇన్ని సంవత్సరాలుగా సినిమా రచయితగా వుంటూ 'హిట్' ద్వారానే ప్రేక్షకుల నాడి తెలుసుకుంటున్న నేను మీ 'హాసం' ద్వారా పాఠకుల వాడి, వేడి విమర్శలు అందుకో గలుగుతున్నాను. ఇదొక కొత్త అనుభూతి.

నేను ఎం.ఎ. తెలుగు చదువుకునే రోజుల్లో మా గురువులు దివాకర్ల వెంకటావధానిగారూ, సి.నారాయణరెడ్డి గారూ 'కవి హృదయం' ఏమిటంటే అని చెబుతూంటే - అంతా రాసింది కవేగదా ఇంకా కవి హృదయం ఏమిటి - అని అడగాలని అనిపించేది. కాని సాహసం చెయ్యలేక పోయాను.

కవి ఎప్పుడూ తన ప్రభావాన్ని పాత్రల మీద చూపించకూడదు. తన హృదయంలో భావాన్ని ప్రతిపాత్రకు అంట గట్టకూడదు. కాని ఎక్కడ తప్పనిసరిగా చెప్పాలనుకున్న భావాన్ని చెప్పకుండా చెబుతారో అదే కవి హృదయం.

నేను 'పెదరాయుడు' చిత్రం చూస్తున్నప్పుడు ఒక షాట్లో రచయిత హృదయాన్ని అర్థం చేసుకున్న దర్శకుని హృదయాన్ని అభినందించాను.

సత్యనారాయణ గారు, మోహన్‌బాబుగారు, సౌందర్య ఉన్న సన్నివేశంలో ఒక క్రేన్ షాట్ అది. షాట్ మొదట్లో సౌందర్య కెమెరా యాంగిల్‌లో ఉన్నతంగాను, పెదరాయుడు నిమ్నంగాను వుంటారు. సత్యనారాయణగారు పెదరాయుడి పాత్రను హైలెట్ చేసి మాట్లాడుతుండగా మెల్లగా పెదరాయుడు ఉన్నతంగా సౌందర్య



# 16-31 జనవరి 2002లో శ్రీ పరుచూరి గోపాలకృష్ణ రాసిన విమానము నోరులేని యంత్రము కథకు వచ్చిన స్పందన

విమానం క్రేష్ లాండింగ్ అయిందీ అనగానే సాధారణంగా చాలామంది ప్రజలు, ప్రయాణికుల్ని సురక్షితంగా అంత చాకచక్యంగా లాండ్ చేసినందుకు ఆ పైలట్ ప్రావీణ్యాన్ని మెచ్చుకుంటారు. ఆ ప్రయాణికుల అదృష్టాన్ని పొగుడుతారు. కాని ఒక్క రచయిత మాత్రమే ఒక మనిషి గుండెలోతుల్ని స్పృశించ గలడన్నట్టు గోపాలకృష్ణగారు, ఆ విమానం లాండ్ అయినచోట పంట నష్టపోయిన రైతు గుండె తలుపును తట్టారు. ఇది నిజంగా అభినందించదగిన విషయం. మనసుని కదల్చడమే మంచి రచయిత లక్షణమన్నది మరోసారి నిరూపించారు. ఇక కథా కథనం, సంభాషణ చాతుర్య ప్రదర్శన గోపాల కృష్ణగారికి నల్లేరు మీద బండి నడక. దీనిగురించి చెప్పడమంటే చర్విత చరణమే. కాని ఇందులో ఒక్క విషయం మాత్రం నాకు అర్థం కాలేదు. మన వాళ్ళు అంటే మన రచయితలు ఇంకా ఎన్నాళ్ళు ఆడవాళ్ళని అలా తండ్రి మీద కానీ, భర్తమీద కానీ ఆధారపడినట్లు చూపిస్తారు! రోజులు మారలేదా? ఆడపిల్లల ఆలోచనలు మారలేదా? వారి తండ్రుల అభిప్రాయాలు మారలేదా? అల్లుళ్ళ ఆలోచనల్లో మార్పురాలేదా? కనీసం ప్రస్తుతం పదిశాతం ప్రజల్లో మార్పొచ్చినా క్రమంగా ఇటువంటి విషాదాలు జరగకుండా వుంటాయి కదా! ఒక ప్రముఖ రచయితగా ఆడవారిలోని అసహాయత్వాన్ని ఎత్తి చూపించకుండా, వారిలో ఆత్మస్థయిర్యం కలిగేలా ఈ కథని మలుపుతిప్పి వుంటే ఇంకా బాగుండేదని నా అభిప్రాయం.

**-శ్రీమతి జి.ఎన్.లక్ష్మి, హైదరాబాద్.**

గురువుగార్కి నమస్కారం!

పాత జ్ఞాపకాలు లోకి వెళ్లి ఉయ్యూరు కాలేజిలో మీరు వేయించిన నాటకాలతో పాటు నేను మద్రాసులో మీతో కాస్సేపు గడిపిన (సం)ఘటన.... విషయానికి వస్తే, చక్కని చిక్కని కథ వ్రాసి, మా సిస్టర్ కాంబినేషన్ డైలాగ్స్‌తో మమ్మల్ని నవ్విస్తూనే కథాంశంతో మమ్మల్ని ఏడిపించడం.... ఈ ఫీటు చాలా హైలైటు సుమండీ!

"ఇమానాలు వచ్చి డబ్ల్యు.టి.సిని గుద్దితే అమెరికా వోడు కోలుకోవచ్చు.... కానీ, ఒక ఇమానం వచ్చి బక్క రైతు సేలో కూలితే... జనం తొక్కింది పంట కాదు ఆ రైతు గుండెల్ని.... వాహ్!" ఒక్క కథతో మా గుండెల్లో ఇమానంలో పెట్రోల్ టాంకర్ విషాదం నింపి 'మరో చాప్లిన్‌లా' నవ్విస్తూ ఏడ్పించిన మీ కథ (న) కుతూహలానికి నా ఆనంద బాష్పాంజలి. మీ (క) ధర హాసం కనీసం ప్రతీ మాసం మన 'హాసం' పత్రిక నలరించాలని కోరుకుంటూ...

**మీ వీరాభిమాని: - టి.వి.సత్యనారాయణ, హబ్సిగూడ, సికిందరాబాద్.**

నేటి వైవాహిక వ్యవస్థలో అల్లుళ్ల కోరికలు 'ధర్మబద్ధమైన హక్కు'గా చెలామణి అవుతూ, ఆడపిల్లలు కలిగిన కుటుంబాలు ఎలా నాశనమవుతున్నాయో, "విమానం నోరు లేని యంత్రం" కథ ద్వారా తెలుగు పాఠక లోకానికి గుర్తు చేసిన శ్రీ పరుచూరి గోపాలకృష్ణ గార్కి అభినందనలు.

కథా రచనకు ముందు శ్రీమతితో పంచుకున్న ముచ్చట్లను చాలా ఆసక్తిగా వివరించారు. ఈ ముచ్చట్లు ఇంకా కొనసాగితే బాగుణ్ణు అనిపించే విధంగా వున్నాయి. ఇక కథలోనికి వెళితే నవలకు సరిపడినంత కథను చిన్న కథలో తనదైన శైలిలో, వ్యంగ్యంగా చిత్రీకరించారు రచయిత.

'హాసం' పాఠకులే కాకుండా అందరూ చదవవల్సిన, చదివించవల్సిన కథ "విమానం నోరు లేని యంత్రం".

**-ఎన్.వి.రమణ, గోకుల్‌నగర్, విశాఖపట్నం.**

శ్రీ పరుచూరి గోపాల కృష్ణగారికి.....

నమస్సుమాలు. ఆహా! ఏం చమత్కార బాణీ అండీ మీది! మీ ఇంటి గేటు నుండి ఆరంభించి, మీరెలా నోరులేని యంత్రం అయిన విమానంలా మారాల్సి వచ్చిందన్న దృష్టాంతాన్ని, వాస్తవ సంభాషణతో ఆరంభించి, దానికి ఊహని, కల్పనని జోడించి కథనాని కూర్చి, చేర్చి.... వలచి, పాఠక జన సందోహానికి 'కథ'ను అందించిన మీ రచనా పటిమ.... ఓహో!!! వండర్ ఫుల్ కృష్ణగారూ...! అందుకే 'హాసం' చెప్పినట్లు , గంటలో మీలాగా లబ్ద ప్రతిష్ఠులైన వారు కథ రాయగలరు కాని, మీ ఇంత ఇదిగా, మీతో పాఠకుల్ని మీ ఇంటిగేటు, మీ బుజ్జి కాఫీ, మీ టి.వి.లో వచ్చిన కార్యక్రమ సన్నివేశ స్ఫూర్తితో, సామాజిక స్పృహను, సనాతన పురాతన సాంప్రదాయ సంకెళ్ళు.... ఎంత ... గర్హనీయయో ఉటంకించడం ఎంతో ముదావహ పూరితం!

కోడిమాంసంను కుక్కకు సమర్పించేట్టు చేసి పరోక్షంగా కట్నం కక్కుర్తి గాళ్లకి, ఎంత 'చురక' వేసారు! వాహ్.... పొలంలో పడిపోయిన విమాన పైలెట్‌కు సన్మానం... ఇక్కడే... మీ రచనా చమత్కృతితో కథనం భలే మలుపులు తిరిగింది. "నా కాపురం ఎందుకు చెడిపోయిందన్నడిగిన దానికి 'పాతిక వేల గిఫ్ట్ బంధం' మీ ముందరి కాళ్లకు వేసిన "బుజ్జి" -'బంగారం' కొనమని అడిగితే అడిగింది కాని... ఆ ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పింది. విమానం గారూ ... (సారీ) నోరు లేక పోయినా నోటి మాటతో ఎలాగైనా కొనటానికి బయల్దేరారా మరి బంగారపు దుకాణాన్కి!?

**-నేమాన సుభాష్‌చంద్రబోస్,**
**ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం టౌన్**

**నిమ్నంగాను మారిపోతారు. అది కవి హృదయం.**

**ఆ కవి హృదయాన్ని చక్కగా అర్థం చేసుకుని తెర మీదకు మలచిన దర్శకుడు పినిశెట్టి రవిరాజా అభినందనీయుడు.**

**అలాగే ఈ కథలోనూ ఓ కవి హృదయం ఉంది. ఆ 'కవి హృదయాన్ని' ఎవరుకనుగొంటే వారికి బహుమతి ఇద్దాం అని 'హాసం' రాజాగారికి చెప్పాను. అసలు ఎవరయినా కనిపెట్టగలుగుతారా అన్నది అనుమానం. కాని తెలుగు పాఠకలోకంలో మేధావులకు కొరతలేదు అని 'హాసం' పాఠకులు నిరూపించారు.**

**అందరూ అద్భుతంగా విశ్లేషించారు. కొందరి అభిప్రాయాలే ప్రచురించటం తప్పని సరి అవటం బాధాకరమే అయినా ప్రతిభకు గుర్తింపు ఇవ్వాలిగా.**

**ఇంతకూ కవి హృదయం చెప్పలేదు గదూ ... ఇంట్లో మగాడు... కథలో నేను... విమానం అనే నోరు లేని యంత్రాన్ని! నిజం ఈ దేశంలో సగటు మగాడు భార్యాబిడ్డల కోరికలు తీర్చే యంత్రంగా మారిపోయాడు. అది కనిపెట్టగలిగిన పాఠకుడు నంబర్ వన్ అని నా అభిప్రాయం.**

**అంతేకాక ఈ కథలో అంతర్లీనమయిన చమత్కారం వుంది. అదేవిటంటే కుటుంబరావ్ కూతురు వరకట్న బాధితురాలు. స్త్రీల పాలిట శాపమైన వరకట్నం బాధితులైన స్త్రీల గురించి రాస్తున్న ఈ కథలో...స్త్రీ అవసరాల చేత బాధితుడై యంత్రంగా మారిన మగవాడి బాధ కూడా ఇమిడి వుంది. ఇదీ అసలు కవి హృదయం!**

**ఏది ఏమయినా... పాఠకుల్ని కదిలించి, మెదడులో ఆలోచనల్ని విదిలించేలా చేస్తున్న 'హాసం' వారికి మందహాస నమస్కారం చేస్తున్నాను.**

**మన పాఠకులకు అభినందనలు.**

**మీ**

**(పరుచూరి గోపాలకృష్ణ)**

# లలిత సంగీతం



'ఒదిగిన మనసున' పాట రికార్డింగ్ సందర్భంగా దేవులపల్లి, కనకవల్లీ నాగేందర్, చిత్తరంజన్, ఈమని శంకర శాస్త్రి

## ఒదిగిన మనసున

ప॥ ఒదిగినమనసున పొదిగినభావము
కదిపేదెవ్వరో కదిపేదెవ్వరో

1. చ॥ కదలనితీగకు కరగినరాగము
కరపేదెవ్వరో కరపేదెవ్వరో ఆ....
కదిపేదెవ్వరో కరపేదెవ్వరో
కరగని మనసును కదలనితీగను

2. చ॥ హృదయము రాయిగా గళమున రేయిగా
కదలని దీనుని గతియిక ఎవ్వరో
నాకై ప్రాణము గానము తానయి
నడిపేదెవ్వరో నడిపేదెవ్వరో ఆ....
కదిపేదెవ్వరో కదిపేదెవ్వరో ॥ఒదిగిన॥

రచన : కీ॥శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి
సంగీతం : కీ॥శే॥ ఈమని శంకరశాస్త్రి
గానం : ఎం.చిత్తరంజన్, డా॥ కనకవల్లీ నాగేందర్
రాగం : అభేరి (కర్ణాటక సంగీతం) - భీంపలాస్ (హిందుస్తాని సంగీతం)
తాళం : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) -దాద్రా (హిందుస్తానీ సం॥)
ఆరోహణ : స గ మ ప ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స
ఆరోహణలో - షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, కైశికినిషాదం
అవరోహణలో - తారషడ్జము, కైశికి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, సాధారణ గాంధారం, చతుశృతి రిషభం

అభేరి రాగం కర్ణాటక, హిందుస్తాని సంగీతాలు రెండింటిలోను ప్రసిద్ధి గాంచినది. కర్ణాటక సంగీతంలో యీ రాగంలో మనకు ఎక్కువగా వినబడేది "నగుమోము కనలేని" అనే త్యాగరాజ కీర్తన. లలిత సంగీతంలో యీ రాగాన్ని అనేకమంది స్వరకర్తలు ఉపయోగిస్తూ కొన్ని దశాబ్దాల నుండి ఎన్నో మృదుమధురమైన పాటలను మనకు అందిస్తున్నారు. 15-31 అక్టోబర్ "హాసం" సంచికలో "పాటపాడుమా కృష్ణా!" అనే గీతం గురించి వివరణ యిస్తూ యీ రాగం గురించి ప్రస్తావించాను.

కృష్ణశాస్త్రిగారు రచించిన యీ పాట లోని సాహిత్యాన్ని పరిశీలిస్తే, యిది పైకి ఒక ప్రేమ గీతం వలె కనిపిస్తుంది. కాని అంతర్లీనంగా యిది సకల కళలకు తల్లియైన శ్రీ సరస్వతీ దేవి స్తుతి గీతం. ఈ గీతాన్ని 1966లో ఆకాశవాణి కేంద్రాల కర్ణాటక సంగీత శాఖకు చీఫ్ ప్రొడ్యూసర్‌గా వున్న శ్రీ ఈమని శంకరశాస్త్రిగారు ఢిల్లీ నుండి వచ్చి హైదరాబాద్ ఆకాశవాణిలో కృష్ణశాస్త్రి గారు వ్రాసిన యీ గీతానికి సంగీతం సమకూర్చారు. ఆ సంవత్సరమే కొన్ని నెలల క్రితం కృష్ణశాస్త్రి గారికి బొంబాయిలో ఆపరేషన్ చేసి స్వరపేటికను తొలగించారు. ఆ విషయాన్ని యీ పాటలోని 2వ చరణంలో "హృదయము రాయిగా గళమున రేయిగా,



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993




కదలని దీనుని గతి యిక ఎవ్వరో" అని ఛాయా మాత్రంగా ధ్వనింప జేసి "నాకై ప్రాణము గానము తానయి నడిపేదెవ్వరో" అంటూ ధాతు మాతులకు నెలవైన శారదా దేవిని తలపింపజేస్తారు కృష్ణశాస్త్రి గారు.

స్వరకర్త శంకరశాస్త్రి గారు యీ గీతానికి ఎన్నుకున్న అభేరి రాగంలో స్వతంత్ర స్వర సంచారాలను, అన్యస్వరమైన అంతరగాంధారాన్ని ఉపయోగించి రసవత్తరమైన బాణీని కూర్చారు.

## ఈమని శంకరశాస్త్రి

పద్మశ్రీ, మహామహోపాధ్యాయ కీ॥శే॥ ఈమని శంకరశాస్త్రి గారు కర్ణాటక సంగీతానికి, ముఖ్యంగా వీణావాయిద్యానికి ప్రపంచమంతటా ఖ్యాతిని ఆర్జించి పెట్టిన మహావైణిక విద్వాంసులు. వారి తండ్రి గారు ఈమని అచ్యుతరామ శాస్త్రి గారు ప్రసిద్ధ వైణికులు. వారి వద్దనే వీణను అభ్యసించారు శంకరశాస్త్రిగారు. కర్ణాటక సంగీతంలోని గాత్ర ధర్మాన్నీ, వీణావాద్యానికున్న ప్రత్యేకతలను కడు నైపుణ్యంతో తన వీణలో పలికించడమే గాక, హిందుస్తానీ సంగీతపు గమకాలు, సంగతులు, పాశ్చాత్య సంగీతపు రీతులను సైతం ధ్వనింపజేసిన మొట్టమొదటి వైణికులు శాస్త్రి గారు. పండిట్ రవిశంకర్ సితార్‌లోను, అలీ అక్బర్‌ఖాన్ సరోద్‌తోను, "జుగల్‌బందీ" కచ్చేరిలలో శాస్త్రిగారు కర్ణాటక సంగీతపు పాండిత్యమే కాక, సితార్, సరోద్‌లలో పలికే హిందుస్తానీ గమకాలను సంగతులను కూడా వాయించి ఆ మహా విద్వాంసుల యొక్క ప్రశంసలనందుకున్నారు. కాంటాక్టు మైక్ పెట్టుకొని వీణానాదంలో గాంభీర్యాన్ని, నిండుదనాన్ని చేకూర్చి, వీణమీటులోని నాజూకులూ నయాగారాలను ఎంతో సున్నితంగా త్రిస్థాయిలోను అవలీలగా పలికించిన మొట్టమొదటి మహనీయులు



శంకరశాస్త్రిగారు. తరువాత వారి శిష్యుడైన చిట్టిబాబు కూడా అదే మార్గంలో పయనించి విశేషమైన పేరు ప్రఖ్యాతులు పొందారు.

శాస్త్రిగారు మద్రాసులోని జెమిని స్టూడియోలో కొంతకాలం సంగీత దర్శకులుగా పని చేశారు. కొన్ని హిందీ చిత్రాలకు ("బహుత్ దిన్ హువే" మొ॥) సంగీతం సమకూర్చారు. తరువాత ఢిల్లీ లోని ఆకాశవాణి "వాద్యవృంద" (National Orchestra)కు డైరెక్టరుగాను, కర్ణాటక సంగీత శాఖకు చీఫ్

ప్రొడ్యూసర్‌గాను నియమితులయి ఎన్నో కార్యక్రమాలను నిర్వహించారు. 'టెన్సింగ్ నార్కే ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించాడన్న వార్తకు ఆయన స్పందించి "ఆదర్శ శిఖరారోహణం" అని వాద్య బృందంతో (ఆర్కెస్ట్రాతో) ఒక నాద చిత్రాన్ని (Thematic music) సృష్టించి పలు ప్రశంసల నందుకున్నారు. అలాగే "భ్రమర విన్యాసం" అనే వాద్య చిత్రాన్ని కూడా రూపొందించారు. దీనికి 'గానమూర్తి' అనే రాగాన్ని ఉపయోగించి అందులో వీణలో భ్రమర ఝుంకారాన్ని, విన్యాసాన్ని ఎంతో హృద్యంగా పలికించారు. లలిత సంగీతంలో ఆయన తన ప్రత్యేకతను, అనేక గీతాలలో అనేక విధాలుగా చాటుకున్నారు. బాణీలలోను, వాద్య సంగీతపు ఇంటర్ల్యూడ్స్‌లోను ఆయన శైలి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

1960లోనే ఒక రోజు శాస్త్రిగారి యింటికి ఠాకూర్ జయదేవ్‌సింగ్ (హిందుస్తాని సంగీతానికి చీఫ్ ప్రొడ్యూసర్) వచ్చి ఫిలింస్ డివిజన్ వారు కర్ణాటక, హిందుస్తాని సంగీతాల "జుగల్‌బందీ"ని రవిశంకర్ సితార్, శంకరశాస్త్రి వీణతో డాక్యుమెంటరీ చిత్రాన్ని నిర్మించనున్నారని చెప్పారు. భరతుడి "నాట్యశాస్త్రము", శార్ఙ్గ దేవుడి "సంగీత రత్నాకరం" నుండి కొన్ని అంశాలను ప్రస్తావించి ముఖ్యంగా "గమకాల"ను గురించిన సంస్కృత శ్లోకాలను చదివి వాటిని వీణలో పలికించమని కోరారు జయదేవ్‌సింగ్. ఒక్కొక్క గమకం శాస్త్రి గారు వీణలో పలికిస్తుంటే, దానికి సంబంధించిన విషయాలను ఇంగ్లీషులో నేను వ్రాయడం జరిగింది. వాటిని నేను కూడా గాత్రంలో ప్రాక్టీసు చేశాను. ఆ గమకాలు నాద ప్రపంచంలోని సకల విషయాలకు సంబంధించినవి. అనగా ప్రపంచంలోని అన్ని దేశాల, ప్రాంతాల సంగీత రీతులకు సూచికలు ఆగమకాలు. ఆ గమకాలతో శాస్త్రిగారు "శంకరాభరణ" రాగాన్ని ఆలాపన, తానం, స్వర ప్రస్తారాలలో కడు రమ్యంగా ప్రదర్శించారు ఒక సభలో. అదే ఎల్.పి. రికార్డుగా యిచ్చారు తరువాత.

హైదరాబాదు ఆకాశవాణికి తరచు వస్తూ ఆయన అనేక లలిత గీతాలకు స్వర రచన చేశారాయన. ఆయన 1986 ప్రాంతంలో హైదరాబాదుకు విచ్చేసి దూరదర్శన్‌లో ఆయనపై తీసిన డాక్యుమెంటరీలో పాల్గొని, సాయంత్రం 7 గం॥లకు ఆకాశవాణికి వచ్చి ఒక లలిత గీతానికి సంగీతాన్ని అందించారు. దానిని నేనే రికార్డు చేశాను. ఎంతో అలసట చెందిన ఆయనను "ఆ నొటేషన్ నాకిచ్చి మీరు విశ్రాంతి తీసుకోండి" అని చెప్పి నేను రిహార్సలు, రికార్డింగును జరిపించాను.

ఆ రాత్రి కారులో గుంటూరు వెళ్ళడానికి రైలు స్టేషనుకు బయల్దేరుతూ "చిత్తరంజన్! నేను ఒక నెల తరువాత వచ్చినప్పుడు మళ్ళీ నాకొక ప్రోగ్రాం యిస్తావా? "అని అడిగితే," మీరు అడగడమేమిటి? నన్ను ఆజ్ఞాపించాలి. మీరు రావడమే మాకు మహాభాగ్యమ"ని అన్నాను. అదే చివరి దర్శనం అని మేమెవ్వరమూ ఊహించలేకపోయినాము. మరునాడు గుంటూరులో కచ్చేరి చేసి ఘన సన్మానం పొంది, ఆ రాత్రి రైలులో మద్రాసుకు ప్రయాణం చేస్తూ, తన వీణను తన పక్కనే వుంచుకున్న శంకరశాస్త్రి గారు నిద్రలోనే తనువు చాలించారు.

# దేవులపల్లి కృష్ణశాస్త్రి



తెలుగు వాఙ్మయంలోని పద్యము, ద్విపద, వచనము, యక్షగానము మొదలైన అన్ని ప్రక్రియలనూ చేపట్టి అత్యున్నతమైన భావుకతతో తనదైన ఒక ప్రత్యేకతతో కవితా సౌరభాలను వెదజల్లిన కృష్ణశాస్త్రిగారు పాట యొక్క ప్రాముఖ్యతను, జనబాహుళ్యంపై దానికుండే శక్తిని ప్రభావాన్ని గుర్తించి, తన జీవితంలోని అధిక భాగాన్ని గేయరచనకే వినియోగించారు. ఆయన అప్పుడప్పుడూ అంటూండే వారు. "పాడే వాణ్ణి చూస్తే నాకు కాస్త అసూయ సుమా. వాడు మూడు నిముషాల పాటతో జనాన్ని యిట్టే ఆకట్టేసుకుంటాడు. మాలాంటి వాళ్ళు సుదీర్ఘంగా ఉపన్యసించినా, పెద్దపెద్ద వ్యాసాలు వ్రాసినా జనాన్ని మెప్పించడం కష్టం" అని. సంగీతానికి అనగా నాదానికి వున్న శక్తి అంతటిది. అది పండితులను, పామరులను, సకల జీవులను సైతం రంజింప చేస్తుంది. అందుకే "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అన్నారు పెద్దలు.

ఈ రహస్యం తెలిసిన కృష్ణశాస్త్రి గారు స్వరకర్తతో కలిసి కూర్చుని అతని బాణీకి గేయరచన చేయడానికి ఉపక్రమించే వారు. సాధారణంగా లయలోని మెలకువలు, వివిధ రకాల విరుపులు సంగీత విద్వాంసుడికి తెలిసినంతగా కవులకు తెలియడం అరుదైన విషయం. కాబట్టి స్వరకర్త లయతో కూడుకున్న రకరకాల విరుపులతో వైవిధ్యం చూపిస్తూ బాణీని కూర్చడం జరుగుతుంది. ఆ విరుపులకు తగినట్టు పదాలను ఎంపిక చేసి కవి కూర్చిన గేయం అందంగా తయారవుతుంది.

1957లో ఒకసారి శాస్త్రిగారు నన్ను "ఒక ట్యూన్ అను. పాట వ్రాస్తాను." అన్నారు. అప్పుడు నేను కూర్చిన బాణీకి చాలా అందంగా "నదీ సుందరి సుధాస్యందిని నగాధీశ్వర నందిని" అంటూ సాగే పాటలో నదీ గమనము - ఒక చోట మందంగా, వేరొక చోట తొందరగా దరులనున్న కొమ్మలతో సయ్యాటలాడుతూ, అలల గలగలల్ని అందెల రవళులుగా మ్రోగిస్తూ, నురగల్ని చిరునవ్వులుగా చిందిస్తూ మలుపు మలుపు మధుర భంగిమతో కదులుతున్నదని ఒక సుందరమైన చిత్రాన్ని మన కళ్ళకు కట్టేటట్లుగా రమ్యంగా వర్ణించారు శాస్త్రిగారు.

చెప్పుకుంటూ పోతే కృష్ణశాస్త్రిగారి రచనల గురించి ఒక గ్రంథమే వ్రాయవలసి వుంటుంది. ఎంతో వైవిధ్యం గల యితి వృత్తాలకు సంబంధించిన అనేక రస గుళికలు వంటి గేయాలు ఆయన కలం నుండి జాలు వారాయి. ఆకాశవాణి వివిధ భారతి కేంద్రంలో ప్రత్యేక "జనరంజని" కార్యక్రమంలో డా॥ సి.నారాయణరెడ్డిగారు మాట్లాడుతూ "కృష్ణశాస్త్రి ప్రబంధ యుగానికీ ఆధునిక కవితాయుగానికీ వంతెన వంటి వాడు" అని ప్రశంసించారు. ఆఖరి శ్వాస వరకూ ఆయన చలన చిత్రాలకు వ్రాసినా రేడియోకి వ్రాసినా ఆయన కాల్పనిక శక్తి కొత్త పుంతలు తొక్కుతూ భాసించింది కాని ఎప్పుడు తరిగిపోలేదు.

భాషమీద, భావుకత మీద అపారమైన అధికారాన్ని కలిగి వుండి సన్నివేశ సందర్భాలకు, యితి వృత్తాలకు సమున్నతమైన సముచితమైన భావాలతో వాటికి సరితూగే పదాల ఎంపికలోను, కూర్పులోను, వాటన్నిటితో గేయాన్ని అందమైన శిల్పంగా తీర్చిదిద్దడంలో అత్యున్నత స్థాయిని చేరుకుని గేయరచనలో తనకు తానే సాటి అని నిరూపించుకున్న మహాకవి కృష్ణశాస్త్రి!



## డా॥ కనకవల్లీ నాగేందర్

వైద్యవృత్తిలో కొన్ని దశాబ్దాలుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న డాక్టర్ కనకవల్లి చిన్నతనం నుండే సంగీతంలో అభినివేశం కలిగి తన 11వ ఏటనే విజయనగరంలో సంగీత విద్వాంసులు శ్రీ డొక్కా శ్రీరామమూర్తిగారి వద్ద కర్ణాటక సంగీతం నేర్చుకోవడం జరిగింది ఒక ఏడాదిపాటు. ఆ తరువాత 1954లో విజయవాడలో స్థిరపడి శ్రీ బాలమురళీకృష్ణగారి వద్ద కొంతకాలం శాస్త్రీయ సంగీతం నేర్చుకొని ఆకాశవాణిలో శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతంలోనూ కూడా ఆడిషన్ టెస్టులో విజయం సాధించి అప్పటి నుంచి మంచి పేరు సంపాదించుకున్న గాయని ఆమె. విజయవాడ కేంద్రంలో బాలమురళీగారు ఆమె చేత లలిత గీతాలను 'భక్తిరంజని' కార్యక్రమాలకై కొన్ని భక్తి గీతాలు పాడించారు.

కొన్నేళ్ళ తరువాత ఆమె హైదరాబాదుకు వచ్చి యిక్కడ స్థిరపడిన తరువాత ఆకాశవాణిలో పలు కార్యక్రమాలలో పాల్గొని బి-హై గ్రేడ్ కళాకారిణిగా మంచి గుర్తింపు పొందారు. ఆమె పాడిన మంచి పాటలు - మబ్బులు మబ్బులు మబ్బులొచ్చినయ్ (రచన: కొనకళ్ళ, సంగీతం: పాలగుమ్మి విశ్వనాథం), తెలియరానిది తెలుపలేనిది (రచన: గంగరాజు సుశీలాదేవి, సంగీతం: విశ్వనాథం), నన్నాడింతువు అది నీ ఖేల (రచన: నార్ల చిరంజీవి, సంగీతం: చిత్తరంజన్), నాదని నేనని తలచుటే కాని (రచన: డా॥ ఎం.పద్మినీదేవి - కనకవల్లి స్వీయసంగీతం), ఎంతకాలమాయెరా (రచన: డా॥ బోయిభీమన్న, సంగీతం: చిత్తరంజన్) మురళిని ఊదుము కన్నయ్యా (స్వీయరచన) మొదలైనవి శ్రోతలను బాగా ఆకట్టుకున్నాయి. భక్తిరంజని కార్యక్రమాలలో కూడా నాతో కలిసి చాలా పాటలు పాడారు ఆమె. ఎన్నో పాటలు నా దగ్గర నేర్చుకున్నారు. ఎంతో భావయుక్తంగా లలిత గీతాలను అవలీలగా ఆలపించగల కంఠం ఆమెది.

"కనకవల్లి నాగేందర్ గీతాలు" పేరుతో ఆమె తన స్వీయ రచనలను (లలిత గేయాలను) ప్రచురించారు. హైదరాబాదు దూరదర్శన్‌లో కూడా ఎన్నో గీతాలు ఆలపించారు కనకవల్లి. ఆమె సోదరి శ్రీమతి ఇందిరా రంగారావు కూడా మంచి గాయని. రేడియోలో చాలాపాటలు ఆమె సోలోగాను, కనకవల్లితో కలిసి కూడా పాడారు.

## అభేరి రాగం ఆధారంగా తెలుగు చిత్రాలలోని కొన్ని పాటలు

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | అందమె ఆనందం | బ్రతుకుతెరువు | ఘంటసాల | సుబ్బరామన్, ఘంటసాల |
| 2. | చల్లగ రావేల | భలేరాముడు | ఘంటసాల, లీల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | రావోయి చందమామ | మిస్సమ్మ | ఎ.ఎం.రాజా, లీల | ఎస్.రాజేశ్వరరావు |
| 4. | రావోయి బంగారిమామా | ప్రైవేటు గీతం | ఘంటసాల | ఘంటసాల |
| 5. | నీవే నీవే కావలసినది | ఇంటికి దీపం ఇల్లాలే | పి.బి.శ్రీనివాస్, సుశీల | విశ్వనాథం, రామ్మూర్తి |
| 6. | నా కంటిపాపలో నిదురపోరా | వాగ్దానం | ఘంటసాల, సుశీల | పెండ్యాల |
| 7. | ఉయ్యాల జంపాలలూగ రావయ్యా | చక్రపాణి | భానుమతి | భానుమతి |
| 8. | నీలి మేఘాలలో | బావమరదళ్ళు | ఘంటసాల, ఎస్.జానకి | పెండ్యాల |
| 9. | పదిమందిలో పాటపాడినా అదిఅంకిత మెవరో ఒకరికే | ఆనందనిలయం | ఘంటసాల | పెండ్యాల |
| 10. | అనురాగము విరిసేనా | దొంగరాముడు | సుశీల | పెండ్యాల |

## హిందీ చిత్రాలలోని కొన్ని గీతాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఏరీ మైంతో ప్రేమ్‌దివానీ (మీరాభజన్) | --- | లత | రోషన్ |
| 2. | యేరాత్ యే చాంద్‌నీ ఫిర్ కహాఁ | జాల్ | హేమంత్‌కుమార్, లత | ఎస్.డి.బర్మన్ |
| 3. | ఖిల్ తే హైఁ గుల్ యహాఁ | షర్మీలీ | కిషోర్‌కుమార్ | ఎస్.డి.బర్మన్ |
| 4. | ఓ నిర్దయే ప్రీతమ్ | స్త్రీ | లత | సి.రామచంద్ర |
| 5. | మైనే చాంద్ ఔర్ సితారోఁకీ తమన్నాకీథీ | చంద్రకాంత | రఫీ | ఎన్.దత్తా |
| 6. | ఆ నీల్ గగన్ తలే ప్యార్ హమ్ కరేఁ | బాద్‌షా | లత, హేమంత్‌కుమార్ | శంకర్-జైకిషన్ |
| 7. | జల్‌తేహైఁ జిస్‌కేలియే | సుజాత | తలత్ మెహమూద్ | ఎస్.డి.బర్మన్ |
| 8. | యే జిందగీ ఉసీకీహై | అనార్కలి | లత | సి.రామచంద్ర |

ఫిబ్రవరి 18 అక్కినేని దంపతుల వివాహ వార్షికోత్సవాన్ని పురస్కరించుకుని






# పెళ్లిపుస్తకంలో కొన్నిపేజీలు

**బాపు-రమణలకు అక్కినేని నాగేశ్వరరావుతో ఉన్న అనుబంధం కొన్ని వాక్యాలతో చెప్ప గలిగేది కాదు. 'మూగమనసులు', బుద్ధిమంతుడు', 'అందాల రాముడు' ఇలా ఎన్నిటి గురించో చెప్పాల్సి వుంటుంది. అన్నపూర్ణా వారి 'వెలుగు నీడలు', 'ఇద్దరు మిత్రులు' సినిమాలకు రమణ వెండితెర నవలలు రాసారు. తను అభిమానించే నాగేశ్వరరావు జీవిత చరిత్రను 'కథానాయకుని కథ'గా రాశారు. 1963లో వెలువడిన ఈ పుస్తకం అమిత ప్రజాదరణ పొందింది. 'జీవిత చరిత్ర రాయడం ఇలా' అని అనేకమందికి నేర్పింది. అక్కినేని జీవితంలోని ఒక ముఖ్య ఘట్టం... సహధర్మ చారిణి అన్నపూర్ణమ్మను చేపట్టడం గురించి - రమణ మాటల్లో...**

'లైలా మజ్నూ' తీసే రోజుల్లో నాగేశ్వరరావుకు వివాహం అయింది. వధువు దెందులూరు వాస్తవ్యులు శ్రీ కొల్లిపర వెంకట నారాయణగారి కుమార్తె అన్నపూర్ణ.

వాళ్లు పెద్ద స్థితిపరులు. ఆ ప్రాంతంలో గౌరవ ప్రతిష్ఠలు గల కుటుంబం.

అమ్మాయికి ఇంట మేనరికం ఉన్నా అది ఇంట్లో అందరి ఆమోదమూ పొందలేదు.

అక్కినేని వారబ్బాయి వచ్చి చూసి వెళ్లాడు. కుర్రాడు బుద్ధిమంతుడిలాగే ఉన్నాడని తల్లిదండ్రులు భావించారు. అమ్మాయి అతని అర్ధాంగి కావటానికి మౌనం ద్వారా అర్థాంగీ కారం సూచించింది.

నాగేశ్వరరావు జీవితంలో అనేక ఉద్యమాలు సంచలనం కలిగించి సమ స్యలైనట్టే ఇదీ చర్చలూ, వాగ్వాదాలూ లేపింది.

అప్పటికి నాగేశ్వరరావు, ఇతరుల అసూయ ద్వేషాలకు గురికాతగినంత పేరు, డబ్బు గడించుకున్నాడు. వీపు తట్టడానికి వీల్లేనంత ఎత్తుకు ఎదిగాడు. ఒక వ్యక్తిత్వం గడించుకున్నాడు. ఇతరులకు కోపం తెప్పించగలిగేటంత స్వతంత్రంగా అభిప్రాయాలు (తనకి సంబంధించినవే) వెల్లడించసాగాడు. ఏమిటి, ఎందుకులాటి ప్రశ్నలు అడిగే ధీమా గడించుకున్నాడు.

అందువల్ల అతని గురించి ఆకాశరామన్న ఉత్తరాలూ, అనభ్యకర ప్రచారాలు ఆరంభమయ్యాయి, నాగేశ్వరరావు వట్టి అవినీతి పరుడనీ, వ్యభిచారి అనీ కొన్ని ఉత్తరాలు చాటాయి. మగసిరిలేనివాడని కొన్ని చాటాయి. అందువల్ల ఆ వుత్తరాల నిగ్గు వెంటనే తేలిపోయింది.

అయినా, సినిమావాడు సినిమా వాడేనని, నమ్మలేమనీ వెంకట నారాయణగారి బంధువర్గంలో కొందరు వాదించారు. నాగేశ్వరరావు భావి జీవితంలో బావమరిది, ఆప్తమిత్రుడు కాబోతున్న వెంకటేశ్వరరావుగారు (వెంకట నారాయణగారి సోదరుడి పుత్రుడు) ప్రతికూల వర్గంలో ముఖ్యుడయ్యాడు.

"నాకు చెప్పకుండా, అమ్మాయి నసలు పెళ్ళి చూపులకెందుకు కూర్చోబెట్టారు..." అంటూ పెద్దనాన్నగారితో వాదన ఆరంభించాడాయన.



అక్కినేని పెళ్లి ఫొటో

అప్పటికే వెంకట నారాయణగారు మాట ఇచ్చేశారు.

వెంకటనారాయణగారు వత్తిళ్ళకు లొంగిపోయారు. ఏలూరు వెళ్తూ "అట్నించి గుడివాడ వెళ్లి స్వయంగా సంగతి చెప్పివస్తాను" అని బయల్దేరాయన.

వెంకటేశ్వరరావుగారు కూడా ఆయనతో వెళ్లారు. వెళ్లిన మర్నాడే దెందులూరు నుంచి వాళ్ళ దగ్గరి బంధువొకాయన వచ్చాడు. వెంకటేశ్వరరావుని పక్కకు పిలిచాడు.

"పాప (అన్నపూర్ణ) నీతో ఓ కబురు చెప్పమందయ్యా" అన్నాడు.

"ఏమని?"

"అదే - వెంకటరాఘవపురం సంబంధం వద్దని చెప్పొద్దని నాన్నతో చెప్పమని అన్నయ్యతో చెప్పు- అంది" అన్నాడాయన నవ్వి.

"అలాగా - నిజమే?" అన్నాడు వెంకటేశ్వరరావు ఆశ్చర్యపోయి.

"అవును. నన్ను పంపిందందుకే. వాళ్ళ పెద్దమ్మ ద్వారా నాకు చెప్పించింది... మనది పెద్ద కుటుంబము - అలా మాటలు జరిగిపోయాక, మళ్ళీ మాటతప్పడం మర్యాద కాదు... అందుకనీ...."

వెంకటేశ్వరరావుగారు స్వగ్రామం వెళ్లారు.

తల్లిద్వారా అన్నపూర్ణ తేల్చేసింది-

"అతడు తప్ప మరొక సంబంధం అక్కరలేదు--" అని.

****

అమ్మాయి ఇష్టపడింది కాబట్టి తప్పనిసరిగా అన్నగారు దారికి వచ్చారు.

ముహూర్తం గురించి నాగేశ్వరరావుతో మాట్లాడే ముందు ఆస్తిపాస్తుల వివరం అడిగారు. విజయా పిక్చర్స్ అధిపతి చెరుకూరి పూర్ణచంద్రరావుగారూ, కొడాలి వెంకటేశ్వర్లు గారూ కూడా వెళ్లారు.

"ఐదెకరాల భూమి పిత్రార్జితం - పాతిక వేల నగదు స్వార్జితం ఉం"దని చెప్పాడు నాగేశ్వరరావు.

"బాంకులోనే ఉందిగా.... చూడవచ్చా... " అన్నారు వెంకటేశ్వరరావుగారు.

నాగేశ్వరరావు నవ్వాడు.

"నేను చూపించగలిగేది నా డబ్బే అని మీరు నమ్మే పక్షంలో పాతికేం ఖర్మ, లక్ష రూపాయలు చూపిస్తా... నే నెటుదిరిగీ సినిమా వాణ్ణే గదా..."

వెంకటేశ్వరరావుగారు అదిరిపడ్డారు.

చుర్రున చెంపదెబ్బ కొట్టినట్టయింది. గట్టివాడే అనుకున్నారు. ఒక నిముషం మౌనం ప్రవర్తిల్లింది.

గెలుపు నాగేశ్వరరావుదే. లౌక్యాన్ని ఒక్క సూటిమాటతో కొట్టేశాడు.

"ఇంకేం కావాలి?" అన్నాడు కొంచెం నిర్లక్ష్యంగా.

"ఎటుదిరిగీ మీరలా చెప్పాక ఇంక మేము ఇప్పుడు అడిగి తెలుసుకోవలసినవేమీ లేవు. మున్ముందు జీవితంలో చూసి తెలుసుకునేవే ఉంటాయి" అన్నాడు బావమరిది, కొంచెం అభిమానం కొర్దీ.

నాగేశ్వరరావు నవ్వాడు.

పెళ్లి, ఆడపిల్ల ఇంటివారి అంతస్తుకు తగ్గ వైభవంతో, మొగ పెళ్ళివారికున్న గ్లామర్‌కు తగ్గ సంరంభంతో ఘెళ్లున జరిగింది. సినిమా ప్రముఖులు పలువురు వెళ్లారు. ఎస్.వరలక్ష్మి గానసభ చేసింది. రామబ్రహ్మంగారు, పున్నమ్మగారు తృప్తిగా నిట్టూర్చారు.

పెళ్ళి అయిన నాలుగైదు రోజుల తరువాత మద్రాసు ప్రయాణమవుతూ నాగేశ్వరరావు బావమరిదిని పక్కకు పిలిచాడు.

"చూడండి బావగారూ! నా దగ్గర పెళ్ళికి ముందు రొఖ్ఖం పాతిక వేలుందన్నాను కదూ.... ఇదుగో అందులో పెళ్లి ఖర్చు ఇరవై రెండు వేలయింది. రామబ్రహ్మంగారే పద్దువేసి ఇచ్చారు. పోతే ఇంక నా దగ్గరున్నదెంత? ఐదెకరాల పిత్రార్జితం, మూడు వేల రొఖ్ఖం" అన్నాడు.

బావమరిది నిర్ఘాంతపోయాడు.

ఆనాటి మాటను ఇంకా గుర్తుంచుకున్నారు అల్లుడుగారు. ఇవాళ ఇంతఘాటుగా ఒప్పగిస్తున్నారు.

"ఇతని గురించి చాలా పొరబాటుగా అంచనా వేసుకున్నాం. అసాధ్యుడు, అమ్మాయికిక ఢరవాలేదు" అనుకున్నాడు ఆయన. ఆ క్షణంలోనే ఆయనకు నాగేశ్వరరావు మీద గౌరవం ఏర్పడింది. అప్పుడే ఆయన ఆప్తమిత్రుడయ్యాడు.

"బావగారూ, మన్నించాలి" అన్నాడు ఉద్వేగంతో చేతులు పట్టుకుని.

"మీవంటి అల్లుడు దొరికినందుకు నేను నిజంగా ఇప్పుడు గర్విస్తున్నాను. మా పాప



అదృష్టవంతురాలు'' అన్నాడు.

నిజానికి అదృష్టవంతుడు - భానుమతి మరో సందర్భంలో అన్నట్టు - నాగేశ్వరరావే. మిగతా ఏ అంశంలో ఒప్పుకున్నా మానినా - ఇందులో మాత్రం నాగేశ్వరరావు నిజంగా అదృష్టవంతుడు అని అతని బంధుమిత్రులంతా అంటారు. అతనూ హృదయపూర్వకంగా, గర్వంగా అంటాడు. అంతటి అనుకూలవతి, ఉత్తమ యిల్లాలు, సత్యవతి దొరకడం అతను జీవితంలో శుభోన్నతి సాధించడానికి ఎంతో దోహదం చేసింది.

ఆమె అతనికి ఉపన్యాసాలిచ్చి నీతులు చెప్పిందని కాదు. తెనాలి రామలింగ కవి ఉపమించినట్లు - ఆ దాంపత్యంలో ఆమె ఆకు మాటు పిందెలా అమరి అందగించింది. భర్త పద్ధతులలో మార్పుకావాలని తోచినప్పుడు మౌనంతోనే, సహనంతోనే అది సాధించింది. ఆంధ్రదేశంలో ఎందరో ఆడపడుచులు భర్త కావాలని కోరుకునే యువకుడు తనకు వరుడుగా లభించాడని ఆమెకు తెలుసు. కాని జీవితం సినిమా కథలో నాయికా నాయకుల ప్రేమవ్యవహారాలలా పూర్తిగా ఆనందంతో నిండిపోయి ఉండదనీ, అలా నింపుకోవడం వ్యక్తుల వంతు అనీ ఆమె నేర్చుకుంది. డాక్టర్ల భార్యలాగా యాక్టర్ల భార్యలకి ఇది కొంత అనుభవానికి వస్తుంది.

****

అందరూ దుర్వ్యసనం అనే మద్యపానం గురించి స్వయంగా తెలునుకోవాలన్న కుతూహలం వల్ల, వయసు అలాంటిది కావటం వల్ల, మిత్రుల వత్తిడి వల్ల, నలుగురూ వత్తిడి చేసినప్పుడు తాగకపోతే కల్చరు కాదంటారన్న అపోహవల్ల, తన వృత్తికి అది మంచిది కాదన్న దురభిప్రాయం వల్ల నాగేశ్వరరావు ఒక ఘట్టంలో అప్పుడప్పుడు మద్యం తాగుతూ వచ్చాడు. అలవాటు పడ్డాడని కాదు. గత పది పదిహేనేళ్లలో అతను మొత్తం ఒక ఇరవైసార్లు తాగివుంటాడు. అదైనా ఒక పాలు మద్యం అయితే తొమ్మిందితలు సోడా వేసుకుని.

ఇది భార్యకు తెలియడం ఇష్టం లేదు.

ఒకనాడు కొందరు మిత్రుల వత్తిడి వల్ల మామూలు కన్న కొంచెం ఎక్కువ తీసుకున్నాడు. భోజనం చేస్తే ఆమె పసిగట్టవచ్చునన్న ఉద్దేశ్యంతో, లేని చిరాకు నటించి "తినే వచ్చాను" అని ముక్తసరిగా లాంగ్ షాట్‌లో చెప్పి వెళ్ళి పడుకున్నాడు.

అన్నపూర్ణ మాట్లాడలేదు. ఎక్కడ, ఎప్పుడు అని ప్రశ్నించలేదు. రాత్రి అతను ఆకలితో అవస్థ పడ్డాడు.

మర్నాడు ఉదయం అతను స్తిమితపడ్డాక అడిగింది.

"మీరు రాత్రి అబద్ధం చెప్పారు" అంది.

నాగేశ్వరరావు ఉలికిపడి తలెత్తి చూశాడు.

"రాత్రి మీరు తాగారు. అన్నం తినలేదు. తిన్నానని అబద్ధం చెప్పారు. నాకు అప్పుడే తెలిసినా, మీరు ఇబ్బంది పడతారని అడగలేదు" అందామె.

తను చాలా తెలివైన వాడిననీ, అద్భుతంగా నటిస్తాననీ, అబద్ధం అవసరమైతే బాగా చెప్తాననీ, వెర్రిబాగుల పిల్లని నమ్మించడం సులువనీ అనుకుంటున్న నాగేశ్వరరావు తొలిసారిగా ఒక కొత్త సత్యం నేర్చుకున్నాడు-

ఎదటివాళ్ళ తెలివి తేటలను చాలా తక్కువగా అంచనా కట్టి, మనం అబద్ధం చెప్పి తప్పించుకుపోవడం చాలా తెలివితక్కువ తనం అని.

ఈ అమ్మాయి తనకన్నా తెలివైనది. తను చెబుతున్నది అబద్ధం అని తెలిసి కూడా, ఆ సమయానికి నమ్మినట్టు నటించి, తననే వెర్రిబాగుల వాడిని చేసింది.

నాగేశ్వరరావుకు భార్యమీద గౌరవం కలిగింది. ఆమె ఎన్నడూ అబద్ధం చెప్పదు. చెప్పవలసిన అవసరం, ఆస్కారం లేని వాతావరణంలో పెరిగిన పిల్ల. అబద్ధం చెప్పే వాళ్ళ మీద, ఆమె కోపగించుకుంటుందనీ, మాట్లాడదనీ అతనికి తెలుసు.

అతను తొలిసారిగా భయపడ్డాడు. నైతికంగా ఆమె ఉన్నత స్థాయిలోఉంది.

"నిజమే అన్నపూర్ణా'' అన్నాడు.

****

రోజుకు రెండు మూడు కాల్ షీట్లు పడినందువల్ల ఉదయం ఆరు గంటలకు వెళ్ళే నాగేశ్వరరావు రాత్రి ఏ రెండు మూడు గంటలకో ఇంటికి వచ్చిన రోజులు 1951-54ల మధ్య ఎన్నో ఉన్నాయి. సగటున రోజుకు 20 గంటలు పని చేసేవాడు. జీవితం ఏదో, నటన ఏదో, నిజమే కల ఏదో, నిద్ర ఏదో మెలకువ ఏదో తెలియక తికమక పడిపోయిన రోజులవి. ఇంటికి వచ్చినా, ఇంత తిని ఒళ్ళు తెలియకుండా నిద్రపోవడం తప్ప ఇంట్లో వాళ్ళని పలకరించే తీరికా, ఓపికా ఉండేవి కావు. ఆ ప్రాంతంలోనే వాసన్‌గారు 'సంసారం' హిందీలో తీయ సంకల్పించి నాగేశ్వరరావును బుక్ చేయబోయి, అతను షాటుకీ షాటుకీ మధ్య నిద్రపోయే స్థితిలో ఉండడం చూసి అతనిని వదులుకున్నారు....

ఒకనాడు నాగేశ్వరరావు బాగా అలసిపోయి నీరసంతో, నిద్రమత్తుతో రాత్రి పూట కారు దిగి కుళాయి దగ్గిర కాళ్ళు కడుక్కుంటూ అక్కడే పడుకొని నిద్రపోయాడు.

కారు చప్పుడయినా తలుపు తట్టిన చప్పుడు కాకపోవడంతో పది నిమిషాలు చూచి అన్నపూర్ణ ఇవతలికి వచ్చింది.

అలసటలో ఒళ్ళు తెలియని నాగేశ్వరరావును భార్య, తల్లి ఇంచుమించు మోసుకుని లోపలికి తీసుకువెళ్లారు.

మర్నాడు ఉదయం నాగేశ్వరరావుకు జరిగినదంతా గుర్తుకు వచ్చింది.

ఎదర అన్నపూర్ణ, ఎన్నడూ లేనిది కంట తడి పెట్టింది.

"లేదు అన్నపూర్ణా, ఇంక ఇన్ని పిక్చర్లలో ఎప్పుడూ వెయ్యను. ఎక్కువ పని చెయ్యడం కూడా ఒక వ్యసనమని ఇప్పుడు తెలుస్తోంది... బాధ పడకు'' అన్నాడు నాగేశ్వరరావు.

ఆనాడు ఆరంభించిన ప్రయత్నం అమలులోకి వచ్చి సాలుకు ఐదారు చిత్రాలకు పరిమితం కావడానికి రెండు మూడేళ్ళు పట్టింది.

"నేనా నిర్ణయం చేయడానికి మిగతా కారణాలు ఉన్నా, ముఖ్యమైనది ఆమె మనసు నొప్పించకూడదన్నదే'' అన్నాడు నాగేశ్వరరావు.




# 'అమృత' కలశం





శ్రీ వేటూరి సుందర్రామ్మూర్తి గారిని మీకు పరిచయం చేసే దుస్సాహసం కాదిది. ఆయన పాటలకు ఇవాళ నేను కొత్తగా కితాబు ఇవ్వాల్సిన అవసరం అంతకన్నా లేదు.

సినిమా రహదారి మీద ముప్పయ్యేళ్ల 'పాటసారి' వేటూరి. సినిమా పాట అనే కాలిబాటని 100 అడుగుల రాజమార్గంగా విస్తరింపజేసిన మహానుభావుడాయన. 'శబ్ద భేది' విద్యలో దశరథుడి కంటే చేయి తిరిగిన విలుకాడు. అందుకే ఎన్నోమంచి మాటలు పలికాడు. శబ్దం వినిపిస్తే చటుక్కున మాటలేయగల మాటకారి వేటూరి. ఆయన పాటలతో శ్రోతల గుండెలను తడిపి ఆరేసుకోబోయి పారేసుకుంటే వాటిని ఏరేసుకొని పోయిన వాళ్ళెందరో.... ఇటీవల ఆయన మణిరత్నం - ఏ.ఆర్.రెహమాన్ కాంబినేషన్‌లో ''అమృత'' సినిమాకు రాసిన పాటలు నిజంగా హృదయతంత్రుల్ని మీటి 'అమృత'ధారల్ని కురిపించే గాలికెరటాలు.

వేటూరిగారు నిత్య ప్రయోగశీలి. అందుకు తాజా ఉదాహరణలివి - ఇందులోని మొదటి పాటలో శాంతి కాముకుడిగా ఆయన తపన ద్యోతిత మవుతుంది. 'మరుమల్లెల్లో ఈ జగమంతా విరియగా...' అంటూ ఎంత స్వచ్ఛమైన ప్రపంచాన్ని ఆయన కోరుకుంటున్నారో చెబుతారు. 'కనుల తడి తుడిచే ఒడిలో పసిపాపాయి చిలికే చిరునగవే చీకటి తల్లికి వేకువ' అంటూ 'సుప్రభాతాచమేనిశా' అన్న ఆశావాదాన్ని సంతృప్తిని ఆవిష్కరిస్తారు.

'గాలిపాటలా జడివాన జావళి' లాంటి చమత్కారాలెన్నో 'సమరనాదాల మధ్య కోయిల గానాన్ని' వినిపించాలన్నది ఆయన తపన. రెండు జెళ్ళ పాపని, 'జంట తోకల సుందరి'గా భలే అభివర్ణించారు. 'ఏదేవి వరము నీవు చిరునీడలేల కనుల' పాటవింటే గుండె బరువెక్కిపోతుంది. గొంతు తడారిపోతుంది. గుండె చెమరుస్తుంది. శ్రోతల్ని 'సొగసు చుక్కవో తెగిన రెక్కవో' లాంటి ప్రయోగాలు వెంటాడుతూనే వుంటాయి. 'కడసారిది వీడ్కోలు...' 'మది గాయానికి వేటూరి గేయం'. 'సిన్నోరే సిన్నోరే..' పాట ఓ 'మణి' ప్రవాళం.

ఈ పాటలన్నీ వినే మణిరత్నం బహుశా 'అమృత' అన్న పేరు పెట్టారేమో అనిపించింది నాకు. మానవులకి ఆనాటి అమృతం అందలేదే అన్న చింతతో వేటూరి గారు మనందరికీ అందించిన 'కవితామృతం' ఇది. ఆయన చేత పాటలు రాయించుకున్న మణిరత్నం గారు ధన్యుడు. ఈ పాటల్ని తెలుగువారికి అందించిన శ్రీ వెంకటేశ్వర ఫిలింస్, రాజు, గిరిగార్లు, ఆదిత్యవారు మూర్ధన్యులు, 'మోర్' ధన్యులు. ఈ పాటలు విని ఉబ్బితబ్బిబ్బైన నాకు ఆ ఆనందాన్ని మీతో పంచుకునే అవకాశమిచ్చిన 'హాసం' వారికి థాంక్స్.

**సినీ కవితా విహారి**
**పాటల బేహారి వేటూరి**

**-కులశేఖర్**



'అమృత' సినిమాలో మాధవన్, సిమ్రాన్, బేబీకీర్తన తదితరులు

## డబుల్ రోల్

1. ముందు 'కవిత' ద్వారా పేరొస్తే - తర్వాత 'కవి' 'తద్వారా' పేరుపొందగలడు.

2. నిన్న నువ్వు నన్ను 'పదింపావు'కి 'దింపావు'.

**-మామిడి మహేంద్ర, పూణే**




3. 'గుడి' మీద కన్నా 'మొగుడి' మీద శ్రద్ధ చూపిస్తే పుణ్యం కొంచెం ఎక్కువ వస్తుంది.

**-జె.రామారావు, శృంగవరపుకోట**



## పేరు - రిపేరు




1) సుబ్బు - నువ్వు లేక నేను లేను - నువ్వేకావాలి

**-మామిడి మేఘన, చెన్నై**

(2) "అల్లుడుగారు - ఇదెక్కడి న్యాయం?"
"మామగారు - డబ్బెవరికి చేదు!?"

**-కె.ఎస్.ఎస్.ఆర్.గుప్త, పిడుగురాళ్ళ**

(3) డాడి - బావనచ్చాడు

**- బి.విశ్వజ, హైదరాబాద్.**

## చిలిపి లిపి

(1) Luck - She - me= లక్ష్మి

**- మామిడి మహేంద్ర, పూణే**

(2) 3 వేణి = త్రివేణి

**- ఆర్.అప్పలరాజు, రెడ్డిపల్లి**

(3) 1/2 why ఏ Do = 67

**-బి.రమేష్, యలమంచిలి**



## కొంటె కొశ్నెన్లు - తుంటరి జవాబులు

ప్ర॥ చూడడానికే తప్ప తినడానికి పనికిరాని ఫలం ఏదైనా ఉంటే చెప్పండి?

జ॥ వారఫలం



ప్ర॥ ఇన్నాళ్ళు నన్ను ప్రేమించిన అమ్మాయి సడన్‌గా 'బాయ్‌కాట్' చెయ్యటం మొదలు పెట్టింది. ఇప్పుడు నేనేం చెయ్యాలి?

జ॥ గర్ల్‌కాట్ చెయ్యండి

ప్ర॥ ఆంధ్రుల పంటలు కనిపించే నెలలు;

జ॥ జన'వరి', ఫిబ్ర'వరి'.

-రాజేష్ పాలాది

## చిలిపి కవిత



చెప్పేది నేను
చేసేది నీవు
ఓటు నాది
నోటు నీది
ప్లాట్లు నావి
పాట్లు నీవి
అధికారం నాది
అంధకారం నీది

-బి.నర్సింగరావు, ఉర్లాం

## ఈ రూటే వేరు



కట్మండూ = కట్ చెయ్యగానే మండేది
ఐస్‌వాటర్ = కన్నీరు
హీరోచితం = హీరో ఉచితంగా నటించుట

-జె.డి.దయానంద్, వరంగల్

## పేరడీ పెరేడ్




నలుగురికీ నచ్చినది వాడికసలే ఇక నచ్చదురో
నరులెవరూ నడవనిది ఆ రూట్లో వాడు నడుచునురో
పిచ్చని అందరు అన్నా అది వాడికి సహజగుణం
తిక్కని కొందరు అన్నా అది వాడికి మేనరిజం
తక్కిోళ్ళంత ఒక వైపు
టింగరోడొక వైపు
హీరోయిన్‌ని ప్రేమించటం నథింగ్ స్పెషల్
ఎక్స్‌ట్రా నటిని లవ్వు చేయటం సంథింగ్ స్పెషల్
పోలింగ్ నాడు రిగ్గింగ్ చేస్తే నథింగ్ స్పెషల్
క్యూలో నిలబడి ఓట్లే వేస్తే సంథింగ్ స్పెషల్
చెడ్డవాడిని బాగు చేయటం నథింగ్ స్పెషల్ ॥చెడ్డ॥
మంచివాడిని పాడు చేయటం సంథింగ్ స్పెషల్ ॥నలుగురికి॥
ఎర్ర బస్సులో ఉచిత ప్రయాణం నథింగ్ స్పెషల్
కండక్టర్‌నే అప్పు అడగటం సంథింగ్ స్పెషల్
రాజధానికి మేయర్ అయితే నథింగ్ స్పెషల్
అర్బన్ బ్యాంక్‌కి ఛైర్మన్ అయితే సంథింగ్ స్పెషల్
కాశ్మీర్ పైన యుద్ధం వస్తే నథింగ్ స్పెషల్ ॥కాశ్మీర్॥
అయోధ్యపైన సంధి కుదిరితే సంథింగ్ స్పెషల్ ॥నలుగురికి॥

('టక్కరిదొంగ' లోని
'నిండు చందురుడు ఒక వైపు' పాట ఆధారంగా)

-శ్రేష్ఠ, హైదరాబాద్

# రాజా ఆడియో రివ్యూ




అబ్బాన్, వినీత్, లయ, సోనియా కాంబినేషన్‌తో ముప్పలనేని శివ దర్శకత్వంలో ప్రముఖ నిర్మాత డి. రామానాయుడు నిర్మించిన 'నీ ప్రేమకై' ఆడియో క్యాసెట్ ఆదిత్య మ్యూజిక్ ద్వారా విడుదలయింది. యస్.ఎ. రాజ్‌కుమార్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సామవేదం షణ్ముఖశర్మ హాయిగా రాయగా రాజేష్, చిత్ర తియ్యగా పాడిన 'వెండి మబ్బుల పల్లకిలో వెన్నెలమ్మా రావే' పాట-మాట వినబడుతూ పది మందిలో పాడుకోదగ్గంత ఉదాత్తంగా ఉంది. మోహనరాగం ఆధారంగా స్వరపరచబడిన ఈ పాట ట్యూన్‌ని పదేపదే ఆలపిస్తే 'ఎదురులేని మనిషి' (నాగార్జున హీరో) సినిమా కోసం ఎస్.ఎ. రాజ్‌కుమార్ ట్యూన్ చేసిన 'ఏనాడైనా అనుకున్నానా కల్లోనైనా' పాటలో 'నీరాకతో నా మౌనం రాగాలు తీసింది' అనే లైను గుర్తొస్తుంది. ఇంకా ఆలపించుకుంటూ పోతే 'కాలేజ్ స్టూడెంట్' సినిమా కోసం మాధవపెద్ది సురేష్ ట్యూన్ చేసిన 'జీన్స్ పాంటు కిసుమిస్సు - నడుము చూస్తే మైనస్సు' పాట కూడా స్మృతిపథంలోకి వచ్చే అవకాశం ఉంది.

**విడుదల: ఆదిత్య**
**వెల: రూ. 38/-**

కులశేఖర్ రాయగా సంజయ్, శ్రీలేఖ పాడిన 'కలలు కన్నా నీకై ఓ ప్రేమా తరలిరా నేస్తమా' పాట బీట్ సాంగే అయినా అక్షరం అక్షరం అర్థం అవుతూ వినసొంపుగా ఉంది. రాజేష్, చిత్ర పాడిన 'ఓ ప్రేమా స్వాగతం నీతోనే జీవితం' పాట కూడా మెలోడియస్‌గా ఉంది. పాట సాహిత్యాన్ని గమనిస్తే రచయిత భాస్కరభట్ల రవికుమార్ సినిమాకు కావలసిన ట్రాక్‌లోకి పూర్తిగా వచ్చేశాడనిపిస్తుంది.

కులశేఖర్ రాయగా, రాజేష్, ఉష పాడిన 'కోటితారలా కాంతి ధారలా నేలకొచ్చెనా కన్నెమేనక' పాటలో సంగీతం, సాహిత్యం, గానం మూడు సమతూకంలో పడ్డాయి, పండాయి. మోహనరాగం ఆధారంగా సాగిన ఈ పాట చాలాకాలం పాటు శ్రోతల హృదయాలలో నిలిచిపోతుంది. బాలూ స్టయిల్ రాజేష్ గొంతులో ఎంత ప్రతిఫలిస్తుందో ఈ పాటలో మరింత ప్రస్ఫుటంగా తెలుస్తుంది. (రచనా పరంగా కవులు) ఎందరో వాడేసి ఒదిలేసిన మేనకని ఉపయోగించకుంటూ కులశేఖర్ వరకూ మంచి చమత్కారమే మరి!

కలువ కృష్ణ సాయి రాయగా బాలు పాడిన 'మనసన్నదే లేదు ఆ బ్రహ్మకు' పాట శివరంజని రాగచ్ఛాయలలో శోకరసానికి న్యాయం చేస్తూ వినడాని కేఇబ్బంది లేకుండా సాగిపోతుంది.

భువనచంద్ర రాయగా రాజేష్, చిత్ర పాడిన 'మందాకినీ మందాకినీ మనసంత నువ్వేలే' పాటకి - క్యాచీ ట్యూన్, మ్యాచీ లిరిక్ ఎసెట్‌లు. యూత్ తెగ పాడుకునే పాటయిది. టీనేజీ వాళ్ళేకాదు రౌటీనేజ్ వాళ్ళుకూడా ఎన్‌జాయ్ చెయ్యగల పాట యిది. టోటల్‌గా అన్నిపాటలూ ఏదో ఒక చోట మంచి మార్కులు వేయించుకుంటూ సక్సెస్‌ఫుల్ ఆడియో అనడానికి దోహదం చేశాయి.

---

**విడుదల: ఆదిత్య**
**వెల: రూ. 38/-**




మణిరత్నం, ఎ.ఆర్.రెహమాన్ కాంబినేషన్‌కి ఉన్న విలువని మరింతగా పెంచే 'అమృత' సినిమా ఆడియోను ఆదిత్య మ్యూజిక్ వారు విడుదల చేశారు. మాధవన్, సిమ్రాన్, జె.డి. చక్రవర్తి, నందితాదాస్ ఈ చిత్రంలో ముఖ్యతారాగణం. తెలుగు వెర్షన్‌కి సంబంధించిన పాటలను వేటూరి రాశారు.

'మరుమల్లెల్లో ఈ జగమంతా విరియగా' అనే పాటతో క్యాసెట్ మొదలవుతుంది. పాట ట్యూను, ఎ.ఆర్.రెహమాన్ పాడిన పద్ధతి, రికార్డింగు ఎంత గొప్పగా ఉన్నాయో వర్ణించి చెప్పటం కంటే డైరెక్ట్‌గా విని ఆ అనుభవాన్ని పొందమని చెప్పడమే బెటర్. హంసధ్వని రాగాన్ని - అక్కడక్కడ కళ్యాణి రాగాన్ని పాలు, తేనెలా కలుపుకుంటూ తయారుచేసిన ఈ పాట విన్నకొద్దీ వినాలనిపిస్తుంది. బీట్ అస్సలు లేకుండా కేవలం గిటార్ వాంపింగ్‌తో పాటను నడిపించిన పద్ధతి, మూడో చరణానికి ముందు ఫ్లూటుని ఉపయోగించిన తీరు అద్భుతం, అమోఘం... చాలాకాలం పాటు పాడుకోదగ్గ మంచి పాట యిది.

సుజాత, శ్రీనివాస మూర్తి, టిప్పు, కార్తిక్, ఎమ్. మధుమతి పాడిన 'సుందరి... జంట తోకల సుందరి' పాట రెహమాన్ కీర్తి కిరీటంలో మరో అదిరిపోయే పాట. ఈ పాటను గాయనీ గాయకులతో పాడించిన విధానం, ఫ్లూటుని, అకార్డియన్‌ని, బీట్‌ని ఉపయోగించిన పద్ధతి చూస్తుంటే సంగీత ప్రపంచంలో రెహమాన్ ఎందుకు సంచలన సంగీత దర్శకుడయ్యాడో అర్థం అవుతుంది. అతిత్వరలో పబ్లిక్ ప్లేసుల్లో మారుమోగి పోబోయే గీతమిది.

చిన్మయ్, హరిహరన్ పాడిన "ఎంత చక్కిల్‌గిల్ గిల్ కళ్ళు జిల్ జిల్ జిల్ జిల్" పాట ఓ




ప్రయోగాత్మక గీతం. విషాదాన్ని, హుషారుని మేళవిస్తూ, ఓ వైపు సన్నివేశానికి తోడ్పడేలా మరోవైపు బైట పాడుకునేలా చక్కగా తయారుచేశాడు రెహమాన్. ఈ పాటకి మధ్యలో మియా మల్హార్ రాగాన్ని (ఉదా: బోలోరే పపీహరా - గుడ్డి), మెయిన్‌గా బహార్ రాగాన్ని (ఉదా: 'సువర్ణ సుందరి'లో 'ఏమో తటిల్లతిక మే మెరుపు చరణం) వాడుకోవటాన్ని చూస్తే 'ఎంత థ్రిల్ థ్రిల్ థ్రిల్ థ్రిల్' అని పాడాలనిపిస్తుంది.

మహమ్మద్ రఫీ, వోయేల్, స్వర్ణలత, అనుపమ ('కొంచెం నిప్పు' పాట ఫేమ్) పాడిన 'ఓ యారు వెన్న ఎన్న యారువో' పాట తమాషా గీతం, హుషారు గీతం. రెహమాన్ ట్యూన్స్‌లో సాహిత్యం కన్నా సంగీతానికే బలం ఎక్కువని ఋజువు చెయ్యబోయే పాటయిది. ఎందుకంటే ఈ పాటలోని సాహిత్యం చాలామందికి అర్థం కాకపోయినా అదే పదాలతో పాడుకోవటం జరుగుతుంది కనుక ఆ విషయాన్ని ఒప్పుకొని తీరాలి. ఈ పాటకి స్వర్ణలత వాయిస్ ఎస్సెట్. పాట రచనలో వేటూరితో పాటువున్న బి.హెచ్. హమీద్ తెలుగేతర పదాల్ని కాంట్రిబ్యూట్ చేశాడనుకోవాలి.

ఒకానొక రోజుల్లో శోక గీతాలు కూడా పదిమందిలో పాడుకునేంత గొప్పగా ఉండేవి. రాను రాను ఆ విషాద గీతాలకు ఆదరణ పోయింది. ఇటువంటి సమయంలో ఆకట్టుకోవాలంటే టెక్నిక్ ఒక్కటే శరణ్యం. ఒకవైపు టెక్నిక్‌ని, మరోవైపు బహుగళాల్ని ఏకకాలంలో ప్రాజెక్ట్ చేస్తే వచ్చే ఫోర్స్‌ని, సమతూకంలో వాడుకుంటూ 'కడసారిది వీడ్కోలు - కన్నీటితో మాచే వ్రాలు' పాటని రెహమాన్ ట్యూన్ చేశాడు. ఈ పాటలో బాలుతోపాటు బలరామ్, పెభి, రెహనా కూడా పాల్గొన్నారు. బాలు గళానికున్న రేంజ్ ఎంతటిదో తెలిపే పాటయిది. హై పిచ్‌లో బాలు పాడిన పాటలు కొన్ని ఉన్నా ఆయన వాయిస్ ఎక్కువ సేపు హైరేంజ్‌లో నిలుపుతూ పాడే విధంగా తయారయిన పాట ఇప్పటికి తెలుగులో ఇది ఒక్కటేనేమో!

క్యాసెట్ చివర్నగల 'ఎంత చక్కిల్ గిల్ గిల్' పాట నిజానికి రిపీట్ సాంగ్‌గా భావించరాదు. ఈ పాటని బాలు, బృందం పాడేరు. చిన్మయ్, హరిహరన్ పాడిన పాటకి, ఈ పాటకి కొన్ని తేడాలున్నాయి. బాగా గమనిస్తే రిథమ్‌కు పాట్రన్‌లో కొంత, బాలు పాడే విధానంలో కొంత ఆ తేడాలు తెలుస్తాయి.

ఇంట్లో మంచి మ్యూజిక్ సిస్టమ్ ఉంటే సిడీ కొనుక్కుంటే క్వాలిటీ మరింతగా తెలిసే ఆడియోగా 'అమృత' మ్యూజిక్‌ని చెప్పుకోవాలి.



(ఫిబ్రవరి 23 లారెల్ వర్ధంతి సందర్భంగా)



# లాఫింగ్ జోడీ లారల్-హార్డీ

ఇంగ్లీషు సినిమాలలో హాస్యనటుల గురించి తలవగానే మనకు ముందుగా గుర్తుకు వచ్చేది - లారెల్ హార్డీ, వాళ్ల ఆకార వికారాల వల్ల చిన్న పిల్లలకు సైతం నవ్వు తెప్పించగల హిట్ పెయిర్ వాళ్లది. చార్లీ చాప్లిన్ సినిమాలలా వారి సినిమాలలో బుద్ధికి గానీ, హృదయానికి గానీ పని చెప్పవలసిన అవసరం పడదు కాబట్టి వారి కామెడీని హాయిగా ఎంజాయ్ చేయవచ్చు.



లారెల్ సన్నగానూ, హార్డీ లావుగానూ ఉండడం వల్ల కాస్త సన్నవాళ్లూ, లావు వాళ్లూ కలిసి వెళుతుంటే లారెల్ - హార్డీ జంట వెళుతోందని కావెంట్ చేయడం కూడా పరిపాటి అయిపోయింది. మన వాళ్లకు తెలుగు సినిమాలలో రమణారెడ్డి ఫన్నగా రివటలా ఉండేవాడు. కాబట్టి అతనూ, రేలంగీ కలిసి లారెల్-హార్డీలలా కొన్ని సినిమాలలో వేయడం జరిగింది కూడా. 'అంతస్తులు' వాటిలో ఒకటి. లారెల్ - హార్డీ 20వ శతాబ్దపు తొలినాళ్ల నాటి నటులైనా, ఇప్పటికి కూడా వారి సినిమాలు చూస్తే పగలబడి నవ్వక మానం. శతాబ్దం మారినా వారి హాస్యం పాతబడలేదని ఒప్పుకోక తప్పదు.

అంతకుముందు కూడా ఓ బక్కనటుడు, ఓ దుక్కనటుడు కలిసి జంటగా కలిసి నటించిన సందర్భాలు లేకపోలేదు. మూకీ చిత్రాల కాలంలో ఆంగికానికే ప్రాధాన్యం కాబట్టి ఆ రకం హాస్యం ఒక గొప్ప తమాషాగా ఉండేది. కొంతకాలం విడివిడిగా నటించాక లారెల్ - హార్డీ జత కట్టారు. అప్పటినుండి వారి జంటకు మాత్రం ఎనలేని ఖ్యాతి లభించింది. వారు నటిస్తుండగానే చలన చిత్రాలకు శబ్దం చేరింది. వాళ్లిద్దరి మాట్లాడే యాసలో కూడా తేడా కొట్టొచ్చినట్టు ఉండడంతో వారి అకారభేదానికది తోడయి మరింత నవ్వు పుట్టించింది. తెరపై వాళ్లిద్దరూ ఒకరి కోసం మరొకరు సృష్టించినట్లు కనబడినా - వారి తెర జీవితానికి, నిజ జీవితానికి పోలికే లేదు.

ఈ హాస్య జంటలో సన్నటివాడు స్టాన్లీ లారెల్. అసలు పేరు కావాలంటే ఆర్థర్ స్టేన్లీ జెఫర్సన్. జననం జనవరి 16, 1980. ఇంగ్లండులో ఉలవర్స్టన్‌లో. ఇంగ్లండు మ్యూజిక్ హాల్స్‌లో పెరిగి పెద్దవాడయ్యాడు. ఫ్రెడ్‌కార్నో మ్యూజికల్ కామెడీ ట్రూప్‌లో సభ్యుడిగా తొలిసారి అమెరికా పర్యటించాడు. (చార్లీ చాప్లిన్ కూడా అదే టీములో ఉండేవాడు) పర్యటన ముగిసాక లారెల్ ఇంటికి వెళ్లటం ఇష్టం లేక అమెరికాలోనే స్థిర పడి పోయాడు. సినిమాలలో ఓ చిన్న వేషం కూడా దొరికింది. 1917 నాటి 'లక్కీడాగ్' సినిమాలో హార్డీ కూడా ఉండడం సంభవించింది. లారెల్ ఒక్కడే నటించిన చిత్రాలు చూస్తే మంచి హాస్యనటుడే అనిపిస్తాడు కానీ అతనికి అంతగా గుర్తింపు రాలేదు. దానికి కారణం అతని నీలం రంగు కళ్లు ఆ నాటి ఫిల్మ్ కెమెరా పరిమితుల వల్ల నిర్జీవమైన కళ్లగా కనబడడమే అంటాడు ఆనాటి ప్రఖ్యాత హాస్య చిత్రాల నిర్మాత హాల్‌రోచ్. 1926 నాటికి లారెల్ అతని వద్దనే హాస్యరచయితగా, అప్పుడప్పుడు దర్శకుడిగా పని చేసేవాడు.



ఇక హార్డీ విషయానికి వస్తే - అతని జననం జనవరి 18, 1892, అమెరికాలోని హార్లెమ్‌లో. జార్జియాలో ఓ సినిమా థియేటర్ నడిపే వాడు. అతని వాయిస్ బాగుందని అందరూ అనటంతో సినిమాలలో నటించడానికి లూబిన్ ట్రూప్‌తో చేరాడు. అతనికి ఆకారమే హాస్యస్ఫోరకంగా ఉండడంతో సైలెంటు కామెడీ సినిమాలలో అతనికి మంచి పేరు వచ్చింది. దాంతో అతను హాలీవుడ్‌కి ప్రయాణం కట్టాడు.

అక్కడ చాప్లిన్‌ను అనుకరించే బిల్లీవెస్ట్, లారీసేమన్ వంటి వారితో కలిసి హ్రస్వ కామెడీ చిత్రాలలో నటించ నారంభించాడు. 1920 ప్రాంతంలో హాల్‌రోచ్ స్టూడియోలోని హాస్య చిత్రాలలో నటిస్తుండగా లారెల్‌తో పరిచయమయింది. వాళ్లిద్దరూ కలిసి నటించాలనే ఐడియా ఎవరిదో తెలియదు. కానీ వాళ్ల జంట తెరపై ప్రత్యక్షమయిన ఏడాదిలోగానే హిట్ అయికూచుంది. అఫ్‌కోర్స్, వాళ్ల వెనక్కాల హాల్‌రోచ్ స్టూడియో తాలూకు రచయితలు, దర్శకులు ఉన్నారనుకోండి. అది వేరే విషయం.

ఆ జంటను చూసి ప్రేక్షకులు కడుపుబ్బ నవ్వడానికి కారణాలు ఉన్నాయి. - హార్డీ నెమ్మదిగా కదలడం, అతి స్లోగా రియాక్ట్ కావడం, లారెల్ వెర్రి మొహం వేసి చూసేచూపులు, హార్డీ అతిశుభ్రంగా ఉండాలని తంటాలుపడితే లారెల్ వచ్చి అంతా చెడ గొట్టేయడం, ఒకళ్ల మీద ఒకళ్ళకు కోపం వచ్చి టిట్‌ఫర్ టాట్ అన్నట్టు కొట్టుకుని ఇద్దరూ కలిసి అన్నీధ్వంసం చేసేయడం.... ఇలా ఎన్నో.

మూకీ చిత్రాలు టాకీలయ్యే పరిణామాన్ని లారెల్ -హార్డీ చక్కగా తమ కనువుగా మలచుకున్నారు. చాప్లిన్ వంటి వారు టాకీలను దూరంగా పెట్టినా లారెల్ హార్డీ శబ్దం ద్వారా తమ వైవిధ్యాన్ని మరింత చాటుకుని ప్రేక్షకులను విపరీతంగా నవ్వించారు. అప్పట్లో కామెడీ చిత్రాలు హ్రస్వ చిత్రాలనే వచ్చాయి. కానీ అంతర్జాతీయంగా వీరికి ఖ్యాతి రావడంతో హాల్ రోచ్ వీరిని పెట్టి ఫుల్ లెంగ్త్ ఫీచర్ ఫిల్ములు తీయసాగేడు. Pardon Us (1931), Pack Up Your Troubles (1932), Babes in Toyland (1934), The Bohemian Girl (1936), A Chump at Oxford (1940) అటువంటివే. అవన్నీ విజయవంతమైన చిత్రాలే. అయినా విమర్శకుల దృష్టిలో హ్రస్వ చిత్రాలలోనే వారి ప్రతిభ short and sweet అన్నట్టు బయటపడింది. The Music Box (1932) లో వారు పియానోని మెట్లెక్కించే దృశ్యం ఎకాడెమీ అవార్డు గెలుచుకుంది.



'ద మ్యూజిక్‌బాక్స్' చిత్రంలో...

అలాగే ఇంకో చిత్రం Brats. దీనిలో వాళ్ల పిల్లలుగా వాళ్లే నటిస్తారు. హాల్‌రోచ్‌తో కాంట్రాక్ట్ సమస్యలు రావడం వల్ల, 20th Century Fox వాళ్లు ఆహ్వానించడం చేత వాళ్లు హాల్‌రోచ్ సంస్థ నుండి బయటకు వచ్చేశారు. కానీ 1940లలో కొత్త సంస్థతో వారు నటించిన చిత్రాలు సెకండ్‌రేట్ అనే చెప్పాలి. Great Guns (1941), Jitterbugs (1943) వంటి చిత్రాలు బాగున్నా, అవి వారి పూర్వ చిత్రాలకు ఇమిటేషన్స్ కావడం గమనార్హం. తర్వాత MGM వారి కోసం వారు నటించిన Air Raid Wardens (1943), Nothing But Trouble (1944)



కూడా ఇలాటివే.

ఇంతలో ఆశ్చర్యకరమైన మార్పు వచ్చింది. హాలీవుడ్‌లో వారితో చిత్రాలు నిర్మించడానికి ఆసక్తి చూపడం మానేశారు. వాళ్లు ఇంగ్లండు పర్యటించి అక్కడ మ్యూజికల్ హాల్స్‌లో ఇచ్చిన ప్రదర్శనలు మాత్రం విజయవంతం అయ్యాయి. చివరిసారిగా 1952లో ఫ్రాన్సులో Utopia చిత్రంలో నటించారు.

1950లలో టివి రావడం, లారెల్ హార్డీల పాత చిత్రాలు ప్రేక్షకులు ఎగబడి చూడడం చూసిన హాల్ రోచ్ కుమారుడు వీళ్లిద్దరినీ పెట్టి మళ్లీ సినిమాలు తీద్దామని ఉబలాట పడ్డాడు. కానీ వారి అనారోగ్యం వల్ల అది సాధ్యం కాలేదు. హార్డీ 1957 ఆగస్టు 7న, లారెల్ 1965 ఫిబ్రవరి 23నమరణించారు. తాము నటించిన చిత్రాలు తర్వాతి తరం ప్రేక్షకులను కూడా అలరిస్తున్నాయని తెలుసుకున్న సంతోషంతోనే కన్నుమూసారు వారు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం - అల్‌బేలా
బ్యానర్ - భగవాన్ ఆర్ట్ ప్రొడక్షన్
గీతం - రాజేంద్ర కిషన్
సంగీతం - సి.రామచంద్ర
గానం - చితల్కర్
అభినయం - భగవాన్

# ఓ బేటా జీ ... (అల్‌బేలా)

హాస్యనటుడిగా పేరు కెక్కిన భగవాన్ హాస్యనటుడు మాత్రమే కాదు, దర్శకుడు, నిర్మాత కూడా. అన్నిటినీ మించి మంచి డాన్సరు కూడా. ముంబయ్‌లో గణేశ ఉత్సవాలలో డాన్సు చేసేవాళ్లు అనుకరించేది అతని స్టయిలునే. గతపక్షంలో 89 వ యేట కన్నుమూసిన భగవాన్ పేరు చెప్పగానే గుర్తుకు వచ్చే సినిమా - "అల్‌బేలా". పాటల పరంగా గానీ, నృత్యాల పరంగా గానీ ఆ సినిమా సాధించిన విజయం అపూర్వం.

అప్పటిదాకా స్టంటు సినిమాలు స్వంత డైరక్షన్‌లో నిర్మిస్తూన్న భగవాన్ రాజ్‌కపూర్ హెచ్చరిక మేరకు సోషల్ సినిమా తీశాడు. గీతాబాలి వంటి అందగత్తె పక్కన హీరోగా నటించాడు. సినిమాకథను అందుకు అనుగుణంగా మలుచుకున్నాడు. అతని వయస్సు, (దాదాపు నలభై), స్థూల కాయం,అందహీనత- ఇవేమీ ప్రేక్షకుడు పట్టించుకోని విధంగా ఉర్రూతలూగించే గీత, సంగీతాలను సమకూర్చుకోవడానికి అతని మిత్రుడు సి. రామచంద్ర ఎంతో సహకరించాడు. 'నా శక్తి అంతా ధారపోసి, నీకో సంగీతభరిత చిత్రాన్ని అందిస్తాను. సోషల్ పిక్చర్ తియ్యి' అని హామీ ఇచ్చాడు రామచంద్ర. అప్పట్లో వారిద్దరూ బిజీనే! అయినా సాయంత్రాలు ఇద్దరూ కూచుని విదేశీ సంగీతం వినడం, రామచంద్ర హార్మోనియం వాయిస్తూ పాడుతూంటే (రామచంద్ర గాయకుడు కూడా. పాటలు పాడేటప్పుడు ఆయన ఇంటిపేరు చితల్కర్ ఉపయోగిస్తాడు. ఈ పాట ఆయన పాడినదే) భగవాన్ సలహాలివ్వడం జరుగుతూండేది. లతా మంగేష్కర్ అప్పుడప్పుడే ఖ్యాతిలోకి వస్తున్న గాయని. రామచంద్రకు మంచి స్నేహితురాలు. ఆమె ప్రతిభను చక్కగా ఉపయోగించుకున్నాడు రామచంద్ర.



పాట సందర్భం గురించి చెప్పాలంటే ఆర్టిస్టు కావాలనే కోరికతో ఇంట్లోంచి బయటకు వచ్చేసిన ఓ పల్లెటూరి కుర్రాడు వేషాలు దొరక్క దెబ్బ తినేసి తనను తాను ఓదార్చుకుంటూ పాడే పాట ఇది. అతను తిండి గడవక ఓ ప్రఖ్యాత నాట్య నటీమణి ఇంట్లో వంటవాడిగా చేరతాడు. వంట చేయడం రాక తబ్బిబ్బు పడి, విధి చేసే తమాషాల గురించి ఈ పాట సరదాగా పాడతాడు. ఈ పాట విన్న ఆ నటీమణి (గీతాబాలి) ముగ్ధురాలయిపోయి, స్టేజికి పరిచయం చేస్తుంది.

విధి విలాసాల గురించి పాడే పాటలు సాధారణంగా విషాదంగా ఉంటాయి. కానీ ఈ పాట సరదాగా రాసాడు రాజేంద్ర కిషన్. అంతకంటె సరదా ట్యూన్ కట్టి, పాడాడు చితల్కర్ రామచంద్ర.

కభీకాలీ రతియా కభీ దిన్ సుహానే
కిస్మత్‌కే బాతోంకో కిస్మత్ హీ జానే

ఓ బేటా జీ అరే ఓ బాబూజీ
కిస్మత్‌కీహవా కభీనరమ్ కభీగరమ్
కభీనరమ్ నరమ్ కభీ గరమ్ గరమ్
నరమ్ గరమ్ నరమ్ గరమ్

బడే అకడ్‌సే
ఘర్‌సే నికలా బేటాజీ ఏక్టర్ బన్‌నే
వాహ్‌రే కిస్మత్ కిస్మత్ మే లిఖీ బర్‌తన్ ధోనే
ఓ బేటాజీ
జీనేకామజా కభీనరమ్ కభీగరమ్ ॥ఓ బేహాజీ॥

దునియాకే ఇస్ చిడియా ఘర్‌మే
తరహ్ తరహ్ కా జల్వా
మిలే కిసీకో సూకీరోటీ మిలేకిసీకో
పూరీ హల్‌వా అరేభయ్
కిచిడీకా మజా కభీనరమ్ కభీగరమ్
దర్ద్‌దియా తో థోడా, ఖుశీ జీథోడీ థోడీ
వాహ్‌రే మాలిక్ దుఃఖ్ ఔర్ సుఖ్‌కీ
ఖూబ్ బనాఈ జోడీ
జీనే[illegible]కీ నశా కభీనరమ్ కభీగరమ్

రాత్ (రాత్రి) ని బహువచనంలో జానపద ఫక్కీలో రతియా అని కూడా అంటారు. దిన్ అంటే పగలు. సుహానా అంటే హాయి గలిగించేవి.

కాళరాత్రులొకసారి,
హాయైన సూర్యకాంతులొకసారి
విధి చేసే విలాసమేమిటో
విధికే తెలియాలిలే



అని సాకీ ఎత్తుకుని తన (బేటా) నుద్దేశించి తానే పాడతాడు. మధ్యలో బాబూ అంటూ తండ్రికి కూడా హితవు చెప్తాడు. కిస్మత్ కీ హవా అదృష్టం అనే గాలి. నరమ్ అంటే మెత్తనిది, కోమలమైనది. గరమ్ అంటే వేడైనది. లక్కు అనేది బ్లో హాట్, బ్లో కోల్డ్ అన్నట్టు ఉంటుందని భావం. నాయనా, అదృష్ట మంటే

ఓ సారి చల్లని గాలి,
ఓ సారి వెచ్చని గాడ్పు

తన గతం, ప్రస్తుతం చెప్పుకున్నాడు చరణంలో. అకడ్ అంటే మిడిసిపాటు, బరతన్ ధోనా అంటే పాత్రలు కడగడం.

కుర్రాడు బలే పొగరుగా
బయటికొచ్చాడు ఏక్టరవుదామని
తీరాచూస్తే గిన్నెలు తోమడం
రాసివుంది నుదుటిపై
బతుకుఆట చూడబోతే
ఓ సారి ఇలా, ఓ సారి అలా

చిడియాఘర్ అంటే పక్షులు మాత్రమే ఉంటాయనుకోకూడదు. జూని చిడియాఘర్ అంటారు. జల్వా అంటే షో. ప్రదర్శన.

సూకీ అంటే ఎండిపోయిన అని అర్థం. కిచిడీ అనేది మహారాష్ట్రులకు ఇష్టమైన వంటకం. మన పులగంలా ఉంటుంది.

ప్రపంచమనే ఈ జూ లో రకరకాల వేషాలు.
ఒకడికి ఎండురొట్టె, మరోడికి పూరీ, హల్వా.
కిచిడీ రుచి ఓసారి కమ్మగా, ఓ సారి కారంగా.

మూడో చరణంలో సుఖదుఖాల గురించి ప్రస్తావించాడు. దర్ద్ అంటే దుఖం. మాలిక్ అంటే యజమాని, దేవుడిని కూడా అలాగే పిలుస్తారు.

కొద్దిపాటి బాధ, మరి కొంచెం హాయి ఇచ్చావయ్యాదేవుడా
సుఖదుఃఖాల జోడీ భలేగా కుదిర్చావులే.
జీవితం మజా ఓసారి గొప్పగా,
ఓ సారి చప్పగా..

అల్‌బేలాను తెలుగులో నాటకాలరాయుడుగా తీసారు నాగభూషణం. పాటలన్నీ ఆత్రేయ చేత రాయించారు. ఈ సందర్భంలో ఆత్రేయ రాసిన పాట చాలా హిట్ అయిన 'ఓ బుచ్చి బాబూ!' నరమ్, గరమ్ లో జోలికి పోకుండా తల రాత ఒకే తికమక మకతిక ముఖముఖానికి రకరకాలుగా తికమక అని రాశారు. సాకీ కూడా

ఇదీ జీవితమురా, ఇదే దాని కతరా,
తంటాల బ్రహ్మయ్యా, తకరార్లు ఇవిరా
అని సాగుతుంది.

'బడా యాక్టరు అవుతానంటూ బడాయి కొట్టి వచ్చావు,' అని హిందీ పదానికి తెలుగు పదానికి ముడిపెట్టి,

'భలే భలేరా కొళాయి దగ్గర అంట్లే తోమేవు..,
తోము తోము తకతోం' అని మాట తోము లోంచి నాట్యపరిభాషకు లింకు పెట్టి చక్కగా చమత్కారం చేశారు ఆత్రేయ.

అన్నిటికంటె ముఖ్యంగా నాటకరంగం లోంచి వచ్చిన నాగభూషణం, ఆత్రేయ కలిసి కళాకారులందరికీ ఇచ్చిన మహత్తర సందేశంగా రెండో చరణం అమరింది.

ప్రపంచమే ఒక నాటకరంగం
కదిలిస్తే చదరంగం
నవాబు వేషం వేసేవాడు
జవాను పనిచేస్తాడు
చివరకు గరీబుగా ఛస్తాడు
ఓ అబ్బాయి, కళాజీవితం లక్కు ఒక ట్రిక్కు
ఒకరికి లక్కు ఒకరికి ట్రిక్కు

అలాగే ఆఖరి మాటలతో శబ్దాలతో ఆడుకున్నారు ఆత్రేయ.

నీ లీలలే గడబిడ - ఎడాపెడ
నీ గడా బిడ - మా కెడా పెడా

భావం మంచిది దొరికితే ఆత్రేయ ఎంత చక్కగా తెలుగైజ్ చేయగలరో ఇది మరొక ఉదాహరణ. నాటకాలరాయుడుకి సంగీతం అందించినది జి.కె.వెంకటేష్.

అల్‌బేలా విషయానికి వస్తే ఇంతటి సూపర్, డూపర్ హిట్ (కొన్ని ఊళ్లల్లో ఈ సినిమా రాజ్‌కపూర్ 'బర్‌సాత్' ని మించి ఆడింది.) అందించిన భగవాన్ ఈ సక్సెస్‌ను రిపీట్ చేయలేకపోయాడు. అదే టీముతో ఝమేలా (1953), తర్వాత 'లాబేలా' (1966) (పేర్లలో సామ్యం గమనించండి) తీసినా ఏవీ విజయం కాలేదు. ఉన్నదంతా ఊడ్చుకుపోయి, దారిద్ర్యం లోనే మరణించవలసివచ్చింది. లక్కు గురించి అందరినీ హెచ్చరించిన కళాకారుడు కూడా అదృష్టదేవత ఆడిన తమాషాలకు బలయి పోయేడు.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**






ప్రతిభకు తగిన గుర్తింపు లభించని సంగీత దర్శకులలో అశ్వత్థామ ఒకరు. ఆయన సంగీత దర్శకత్వం వహించిన చిత్రాల పాటలన్నిటినీ సంపాదించి ఏక బిగిన వినగలిస్తే - కొన్ని కొన్ని పాటలలో - ఆయనకు సమకాలీనులుగా ఉన్న సంగీత దర్శకులతో సమానమైన డెప్త్ కనిపిస్తుంది. ఆయన ప్రతిభకు అద్దం పట్టే చిత్రాలలో ఒక చిత్రం ప్రతిభా వారి




ఇది ఘంటసాల బలరామయ్య గారి చిత్రం. కథ, బ్యానర్ ఆయనవే. ఘంటసాల బలరామయ్య అంటే ఈ తరం వారికి తెలియక పోవచ్చు గాని, అక్కినేని నాగేశ్వరరావుకు చలన చిత్ర జీవితాన్ని ఇచ్చిన వ్యక్తిగా - బాలరాజు వంటి చిత్రాన్ని తీసి ప్రతిభా సంస్థకు గుర్తింపు తెచ్చిన నేతగా పరిచయం చేస్తే కొందరికి అర్థం అయ్యే అవకాశం ఉంది.

1954లో విడుదలయిన 'రేచుక్క'లో ఎన్.టి.రామారావు, అంజలీదేవి, దేవిక (అప్పుడామె పేరు ప్రమీల) ముఖ్య తారాగణం. అక్కినేని కూడా ఓ సన్నివేశంలో కనిపిస్తారు. సంగీత సాహిత్యాలపై మక్కువున్న ప్రతి వారికి ప్రాతః స్మరణీయులైన స్వర్గీయ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు ఈ చిత్రానికి మాటలను పాటలను రాశారు. మనసులో మననం చేసుకుంటే 'స్వర్గీయ' అనే మాటను ఏ సంకోచం లేకుండా ఆయన పేరు ముందు ఉంచదగ్గ మహోన్నతమైన వ్యక్తిత్వం, పుంభావ సరస్వతి అనే మాటకు నిస్సందేహంగా ఓ నిర్వచనంలా నిలబడ్డదగ్గ మేధోసంపద గల మల్లాది రామకృష్ణశాస్త్రి గారు రాయగా, అశ్వత్థామ స్వరపరచిన 'రేచుక్క'లోని పాటలలో అయిదింటి గురించి:

ఎక్కడిదీ-!
ఎక్కడిదీ అందం! ఎవ్వరిదీ ఆనందం!
వెలిగే అందం - చెలరేగే ఆనందం!
ఎక్కడిదీ అందం!
లోకంలో కన్నెలకూ లోపాలెన్నే చిన్నది ॥లోకంలో॥
మారుని జవరాలికైనా -
వంకలు దిద్దే వన్నెది ॥మారుని॥
వెన్నెల దీపల్లె - మెరుపూ తీవల్లె
ఏడు మల్లెపూవులెత్తు - తూగే
బంగారు పాప ఎవరో!
ఏలేవారెవరో - కల లేలేవారెవరో! ॥ఏలే॥
ఎన్నెన్నో ఊహలు - కొసరేకోరికవేళ ॥ఎన్నెన్నో॥
మేల్ మేల్ నెయ్యములు - మిడిసే వేడుక వేళ ॥మేల్॥
చిక్కని మక్కువల - చక్కలిగింతలవేళ ॥చక్కని॥
ఊహల ఉయ్యాలలో - ఊగే బంగారుపాప
ఎవరో -
ఏలేవారెవరో - కలలేలేవారెవరో
ఏలేవారెవరో!

ఈ పాటను జిక్కిపాడగా దేవిక (ప్రమీల)పై చిత్రీకరించారు. 'లోకంలో కన్నెలకు లోపాలెన్నే చిన్నది / మారుని జవరాలికైనా (రతీదేవికైనా) వంకలు దిద్దే వన్నెది' అనే వాక్యాలు ఆ పాత్రకు మల్లాది వారు అద్దిన జిలుగులు. ఈ పాట మోహనరాగం ఆధారంగా స్వరపరచబడింది. ఈ రాగం పోకడ తెలిసిన వారికి పాటలోని - 'బంగారు పాప' అనే మాట తర్వాత నుంచి 'ఎవరో ఏలేవారెవరో కలలేలే వారెవరో' అనే వాక్యాల దాకా స్వరపరంగా తీసుకున్న అందమైన మలుపులు అశ్వత్థామ సామర్థ్యానికి గీటురాళ్ళుగా నిలబడతాయి. దొరికితే ఈ పాటను సంపాదించి వినండి. మళ్ళీ మళ్ళీ వినాలనిపించే విధంగా ఉంటుందో లేదో మీకు మీరే బేరీజు వేసుకొని చూడండి.

ఎటుచూచినా బూటకాలే - ఎవరాడినా నాటకాలే ॥3॥
తలక్రిందుల మారి - కలికాలంలో
చెడిపోలేని వారూ - చేతకాని వారే! ॥తలక్రిందుల॥
అంటుంది నానా - నమ్మమంటూంది నానా!!॥అంటుంది॥
రూకలసంచీ రొండిన గ్రుచ్చితే
రొమ్ము విరుపొచ్చిందా మొనగాడా
కరుకుందా - కాళ్ళకు కదనుందా
ఒరతీయని చురకత్తికి పదనుందా
మనలో కదనుందా పదనుందా
పాగా చుట్టావ్ పగిడీ పెట్టావ్
వేషం కటావ్ మీసం మెలేశావ్ దొరకొడుకా
అడవుల్లో పులికి ఆకలేసి నీ మీదికి ఒక దుముకు దుమికితే
నిలబడి కలబడతావా?
లాలించి లంచం పెడతావా - హోయ్ ॥నిలబడి॥
ఆ.... లేకలేక ఓపిక చేసుకు
రాకరాక రానే వచ్చావ్‌గాని - ఏం లాభం!॥లేకలేక॥
మీ జగం కాదు - ఈ యుగం వేరు తాతా!
తరాల్ మారి సం - బరాల్ మీరినయ్ తాతా॥॥మీ॥ ॥ఎటుచూసినా॥



'రేచుక్క'లో అక్కినేని నాగేశ్వరరావు, ఎన్.టి.రామారావు, అంజలీదేవి

ఈ పాటను పి.లీల పాడేరు. సినిమాలో అంజలీదేవి (పాత్ర పేరు నానా) పాడుతూ నృత్యం చేస్తూ చూడ్డానికి వచ్చిన వాళ్ళ దగ్గర ధనాన్ని దొంగిలిస్తూ ఉంటుంది. ఆ నృత్యానికి హాజరయిన వాళ్ళలో కథా నాయకుని పాత్ర ధరించిన (పేరు కన్నయ్య) ఎన్.టి.రామారావు, బాటసారిగా వచ్చిన అక్కినేని నాగేశ్వరరావు ఉంటారు. 'పాగాచుట్టావ్, పగిడీ పెట్టావ్, వేషం కట్టావ్, మీసం మెలేశావ్ దొరకొడుకా' అంటూ అంజలీదేవి ఉద్దేశించి పాడినది అక్కినేని గురించే! అలా పాడుతూ ఆయన రొంటిన ఉన్న సొమ్ముని అంజలీదేవి కాజేస్తుంది. అది చూసి ఎన్.టి.ఆర్. ఆ సొమ్ముని తిరిగి అక్కినేనికి ఇప్పిస్తారు. ఈ ఒక్క సన్నివేశంలో మాత్రమే వచ్చే ఈ పాత్రని ఘంటసాల బలరామయ్యగారి మీద గౌరవంతో అక్కినేని ధరించారు. విశేషం ఏమిటంటే ఆయన పేరు పాటల పుస్తకంలో గాని సినిమా టైటిల్స్‌లో గాని చూపించలేదు.

ఇక పాట పరంగా చెప్పుకోవాలంటే సంగీతపరంగా రకరకాల పోకడలు పోతుందీ గీతం. మధ్యమధ్య కవ్వాలీ బాణీ కూడా కనిపిస్తుంది. 'తలకిందుల మారి కలికాలంలో చెడిపోలేని వారు చేతకానివారే' అని మల్లాది వారు విసిరిన చెళుకుని ప్రత్యేకంగా గమనించి తీరాలి.

ఒంట రొంటరిగ పోయెదానా
ఒకమాట వినిపో ॥ఒంట॥
ఒకమాట వినిపో
ఆడే పాడే యాడున ॥ఆడే॥
తోడుండాలి సైదోడుండాలి నానా ఓ నానా
అదిగదిగో చిట్టడవి అల్లదిగో నట్టడవి
సింహాలుంటయ్ శివంగులుంటయ్
రేచులుంటయ్ దోబూచులుంటయ్
నానా... రేచులుంటయ్ దోబూచులుంటయ్
ఉసుకోమంటే...
ఉసుకోమంటే ఉలిక్కిపడతావ్ నానా ఓ నానా -
తేరతేరగా దొరికిందంటూ దోర మనసూ దోచుకుపోతావ్
తేరగా దోచుకుపోతవ్ ॥తేరతేరగా॥
నిన్నేనంటే కన్నెత్తనంటావ్ పలుకరిస్తే పన్నెత్తనంటావ్
ఓ మైనా యీ పైన చీటికి మాటికి కోపాలైతే
చిరాకు పెడితే చిక్కున పడతావ్ నానా
ఓ నానా--!!



'రేచుక్క'లో అంజలీదేవి, ఎన్.టి.రామారావు, పేకేటి శివరాం
(ఫోటోల కర్టెసీ వరుసగా:- 1. శ్రీ సంజయ్ కిషోర్, 2. శ్రీ నందగోపాల్)

ఈ పాటను ఘంటసాల పాడగా ఎన్.టి.రామారావు, అంజలీదేవి అభినయించారు. మధ్యమావతి రాగంలోని మాధుర్యాన్నంతా పిండి మరీ తయారు చేశారనిపిస్తుందీ పాటని వింటుంటే! ఈ పాటని అప్పుడు, ఇప్పుడు మాత్రమే కాదు ఎప్పుడు విన్నా ఒకే రకం రసస్పర్శ కలుగుతుంది. అందుకు కారణం అశ్వత్థామ ట్యూన్ మాత్రమే కాదు ఘంటసాల పాడిన పద్ధతి కూడా! ముఖ్యంగా 'నానా..." అంటూ ఆయన పలికిన ప్రతిసారీ- మార్దవంగా మాధుర్యంతో ఇన్నిరకాల ఎక్స్‌ప్రెషన్స్‌తో పాడొచ్చా అని మ్యూజిక్ ఇయర్ ఉన్న ప్రతి వారికీ అనిపించి తీరుతుంది. మొదటి చరణంలో 'ఉసుకోమంటే...' అంటూ ఘంటసాల ఎత్తుకోగానే 'ఇప్పుడే చెబుతా ఇనుకో బుల్లెమ్మా' (లేచింది నిద్ర లేచింది - గుండమ్మ కథ) అనే లైను శ్రోతలకు గుర్తొస్తే వారికి చక్కని 'శ్రుత పాండిత్యం' ఉన్నట్టనుకోవాలంతే!....

అయ్ సంబరమే
అయ్ సంబరమే అయ్ పండుగలే
చినదాన! వన్నెదాన!
నిను రమ్మనెనే ఇది నమ్మకమే
మనసైన వాడె ఆ రాణా ॥అయ్॥
మరోసారి వాదులాడ వేడుకైనదో ఏమో
ఆ జాణకు!
సరేకాని ఇంకోపాటా పాడించనా
దరిజేరి ఇంకో ఆటా ఆడించనా
కంటికి బందం వేసే బలేపిల్ల గీర ॥కంటికి॥
ఎటు మారిపోవునో ఏమో! - !! ॥అయ్॥
తనో అందగాడేలే చిందులాడి చిన్నదాన్ని
ఒక్కచూపులోనే మెచ్చి తలక్రిందులాయెనే ॥తనో॥
దారికి రానేరానీ సరాగాల బాణి ॥దారికి॥
ఎటు మారిపోయినా కానీ అయ్ సంబరమే!!



ఈ పాటను పి.లీల పాడగా అంజలీదేవి అభినయించారు. ఆ రోజుల్లో ప్రతివారి నోట బాగా నలిగిన పాటయిది. పాట వింటుంటే ఉత్తరాది సంగీత దర్శకుల ప్రభావం చాలా చోట్ల కనిపిస్తుంది. 'ఒక చూపులోనే మెచ్చి తలక్రిందులాయెనే' అనే వాక్యం 'తలక్రిందులాయెనే' దగ్గర ట్యూన్ వింటుంటే మనకు సలిల్ చౌధురి స్టయిల్ గుర్తొస్తుంది. కేవలం భావసారూప్యం గల మనసులకు మాత్రమే అవగతమయ్యే అనుభూతుల్లో ఇదొకటి. సాహిత్యాన్ని బాగా ఒకటికి పదిసార్లు గమనించి చూడండి. మల్లాదివారి ప్రభావం అటు వేటూరి లోనూ, ఇటు సీతారామశాస్త్రిలోనూ ఉందేమోనని సాహితీ ప్రియులందరికి అనిపించి తీరుతుంది. కంటికి బందం వేసే బలే పిల్ల గీర / సరే కాని ఇంకో పాటా పాడించనా / తనో అందగాడేలే ఈ వాక్యాలు ఆ భావానికి బలంగా నిలబడతాయి. ఇవాళ 'బంధం' అని 'భందం' అని 'భంధం' అని రకరకాలుగా పలుకుతున్న ఈ తరం 'బందం' అంటూ ఈ పాటలో మల్లాది రాసిన మాటని, దాన్ని అలాగే పలికిన లీల ఉచ్ఛారణని ఒకసారి గమనించక తప్పదు.

ఆ మనసేమో ఆ సొగసేమో ।ఆ॥
గారామో అది మారామో
ఆ తీరే వేరేమో--॥
మనసేమో సొగసేమో
లాలనగా రా రా రమ్మని ॥లాలనగా॥
మాలిమైన జవరాలిపైన ॥మాలిమైన॥
జాలి లేదో మరీ మరీ బ్రతి
మాలించుకోవాలో బ్రతిమాలించుకోవాలో ॥ఆ మనసేమో॥
నేరనితనమా నెరజాణ తనమా! ॥నేరని॥
సరసాల వేళలో చెరసాలె సుఖమేమో ॥సరసాల॥

ఈ పాటను జిక్కిపాడగా దేవిక (ప్రమీల) అభినయించారు. ఎక్కువగా కళ్యాణి రాగంపై ఆధార పడుతూ కావలసిన చోట మోహనరాగచ్ఛాయల లోకి వెళుతూ విన్నవారి హృదయాలపై 'రసపట్టు'ని సాధించే విధంగా అశ్వత్థామ ఈ పాటను స్వరపరిచిన విధానానికి 'హ్యాట్సాఫ్' అన్నది అతి చిన్నమాట అవుతుంది. ఈ పాటను విన్నవారికి - 'చోరీచోరీ'లో శంకర్ - జైకిషన్ స్వరపరచిన 'రసిక్ బల్‌మా' పాట, 'పేయింగ్ గెస్ట్'లో ఎస్.డి.బర్మన్ స్వరపరచిన 'చాంద్ ఫిర్‌నిక్‌లా' పాట గుర్తొస్తే - మనం గర్వంగా కాలరెత్తు కోవచ్చు. ఎందుకంటే రేచుక్క రిలీజయింది 1954లో, చోరీ చేరీ, పేయింగ్ గెస్ట్ రిలీజయింది 1956 లోను, 1957లోను కాబట్టి! ఏది ఏమైనా 'ఆ మనసేమో ఆ సొగసేమో' సంగీత పరంగా, సాహిత్యపరంగా, గానపరంగా ఏ విధంగా చూసిన మంచిపాట, హృదయాన్ని ఆకట్టుకునే పాట!

పైన ఉదహరించిన పాటలే కాక 'ఒంటరొంటరిగా పోయేదాన', 'ఓరయ్యో బంగారుసామి' పాటలు కూడా ఇవాల్టికీ బావుంటాయి.



# అవ్వ తిరునాళ్ళలో తప్పిపోయింది

దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి

మా అవ్వ నెరగరూ మీరు, అవ్వని హయ్యో! సుబ్బమ్మవ్వని మా వూళ్లో ఆవిణ్ణి యెరగని వాళ్ళు లేరే! అసలు వూరంగా అవ్వనే పిలుస్తారావిణ్ణి. కొద్దిమంది 'సుబ్బమ్మవ్వగారూ' అని కూడా అంటారు. ఆవిడికి కోపం వచ్చినప్పుడు, 'ఆఆఆ! యెవర్రా అవ్వ! నువ్వు నాకేవవుతావురా చస్తే దెయ్యవవుతావుగాని' అని గద్దిస్తుంది. అప్పుడు చటుక్కున సర్దుకుని 'సుబ్బమ్మగారూ' అంటారు. ఒక్కొక్కప్పుడు, 'సుబ్బమ్మగారూ' అని పిలిస్తే 'హోరి గాడిదా! వేలెడంతలేవు, బొడ్డు కోసి పేరెడతావురా నాకూ!" అని దులిపేస్తుంది. వెంటనే దిద్దుకొని 'అవ్వగారూ!' అంటారు.

ఏవయితేనేం ఆవిడంటే అందరికీ యిష్టమే, అవ్వంటే.

అవును. అందరికీ యిష్టమే మరి! వాళ్ళకేం పోయింది యిష్టం గాక! యెప్పుడో కనిపిస్తుంది వాళ్ళకి. కనిపించినప్పుడు యంచక్కా కుశల ప్రశ్నలూ అవీ వేస్తుంది. సావెతల్తో సాతాళించి కబుర్లూ కథలూ చెపుతుంది. మాంచి ఫారమ్‌లో వుంటే - అంటే వొడుపులో వుంటే పాటలు పాడుతుంది. పావు పాటా అవీ. ఆ కాస్సేపూ వాళ్ళకి కులాసాగా వుంటుంది. వింటారు. పోతారు. వాళ్ళకేం! రాత్రీ పగలూ ఆవిడతో యింట్లో వుండే వాళ్ళం. మేం వేగలేక చస్తున్నాం గాని!

అన్నట్టు - అవ్వంటే మీరెరగరన్నారు కదూ సుబ్బమ్మవ్వని - ఆవిడ మమ్మల్నెలా యేడిపిస్తుందో చెప్పే ముందు, ఆవిడ రూపు రేఖలూ ధోరణీ మీకు తెలియద్దూ అసలు మా అవ్వంటే, మా నాన్నగారి మేనత్త. ఆయన్తాలూకు అయిదెకరాల పొలం, అప్పారం లోగిలీ వగైరా ఆస్తితో అవ్వ కూడా నాకు సంక్రమించింది. మా నాన్న మేనత్తంటే దాదాపు డెబ్భైపై మాట గదా. అయితేం నడుం నిటారుగ్గా కదురులా నిలబెడుతుంది. యిష్టం లేనప్పుడు మాత్రం తెలగులో 'ఐ' అక్షరం లేదూ 'ఐ' దానిలాగా వొంగిపోతుంది. తరుచు కంఠం రైలు గంటలాగా గణగణా మోగించేస్తుంది. యిష్టం లేనప్పుడు పీలగా మూలుగుతుంది. ఈ మధ్య కొంచెం చెడ్డా, గెద్ద చూపులాంటిది అవ్వచూపు. అయితే పళ్ళు మాత్రం తీయించెయ్యడవో రాలిపోవడవో జరిగింది. వొఖటే వొఖపై పన్ను మాత్రం - ముందుది - కింది పెదిమ మీదికి వొంగి, అక్కడ కాలూది, మాట్లాడుతున్నప్పుడు రవ్వంత తలాడిస్తూ వుంటుంది. అది అందానిక్కాబోలు వుంచేసిందవ్వ. మా యింటికొచ్చిన వో పెద్దమనిషి - అప్పన్న శాస్తుర్లని మాంచి కవి గూడా - ఆయనొకసారన్నాడూ చెమత్కారంగా "ప్రెపంచంలో యే ప్రెభుత్వపూ చెయ్యలేని పని నుబ్బమ్మవ్వగారు



చేసిందండీ, వొకేవొఖట్టి తప్ప యేపన్నూ లేకుండా చేసిందీ!" అని అయితే, అవ్వ మాట్టాడుతుందే మాత్రం అతి స్పష్టంగా తెలుస్తుంది.

కొందరు పళ్ళు లేని వాళ్ళ నోరు లక్క పిడతలాగా డొల్లగా వుంటుంది. మాట్టాడుతుంటే యేవీ తెలీదు. రొచ్చులో నడుస్తున్నట్టు పుసుకూ

పుసుకూ గాలిపోసుకుంటుంది. అంతే, పాత రబ్బరు బొమ్మ కడుపు నొక్కితే చప్పుడైనట్టు. అవ్వలాగాదు.

అయినా వో లోపం వుంది. అవ్వమాటల్లో 'ప' 'ఫ' అని పలుకుతుంది. 'తప్పూ, వప్పూ, చెప్పూ' అంటుంది, ఈ వొంటిపన్ను వల్ల.

అసలు అవ్వదీ - మా సుబ్బమ్మవ్వదీ - పెద్ద జాతీయ నాయకుడి వుపన్యాస ధోరణి. అయితే అవ్వ తెలివిగా మాట్టాడుతుంది. వోసారీ, వుపన్యాసాల్లో దేశాన్నంతనీ తల దిమ్మెక్కించే వో పెద్ద మనిషి మా యింటికొచ్చాడు. ఆయన సభలోనే గాక సభ యివతల కూడా సభలో అంతా మాట్లాడతాడు. మా యింటి కొచ్చిన పది నిమిషాల్లో మొదలెట్టాడు ప్రసంగం. మరి పది నిమిషాల్లో అవ్వ కలుగజేసుకుని రంగ స్థలంలో విరగబడింది. ఆయనగారు తోకజాడించి, నాటికీ నేటికి అవ్వకి 'నమస్తే'. అంతే! ఆవిడ సన్నిధానంలో నోరు విప్పడు.

వెనకటికి వో కవిగాడు చెప్పినట్టు 'నిప్పుల', 'నీళ్ళను' చపిడుప్పిళ్ళను, తీర్థాల, తిరునాళ్ళ త్రిప్పటలను, గడిదేరి గడ్డకట్టిన ఘటం అవ్వ. పెళ్ళికా కాస్త ముందో వెనకో పోయాడు పెనివిటి. డెబ్భై యేళ్ళపైని యేకథాటీగా అంటే యేక టాకీని వైధవ్య రాజ్యాన్ని వరిపాలించి పారేసిన రాణీబహద్దర్. గడ్డబ్రహ్మచారిణి. యాక్సిడెంట్, అంటే ఏ కారో రైలో కలుగజేసుకుంటే తప్ప మార్కండేయాది చిరంజీవుల లిస్టులో మనిషి మా అవ్వ.

నాలుగ్గంటలకే లేచి తొలి కోడిని లేపడం, తలుపులన్నీ తెరిచి పారేసి పాచి పనులు అవీ చెయ్యడం, చెంబులూ, గిన్నెలూ చప్పుళ్ళు చెయ్యడం, స్నానం చెయ్యడం, పత్తిరాట్టం లాంటి కంఠవెత్తి 'ప్రాతస్మరామి' వగైరా శ్లోకాలు చదవడం, మా నిద్దర తగలెయ్యడం - ఇలాగ రోజంతా జరిగే తంతుని గూర్చి అట్టే చెప్పడం నాకిష్టం లేదు. ఈ వివరాలు కూడా మీకు చెప్పక పోదును. కాని మీకోసమే చెప్పా యిదంతా. అవ్వ ధోరణిలో చెప్పవలసి వొస్తే యెప్పుడైనా అవ్వ యెదురయితే చప్పున తప్పుకుని మీరు దాటిపోవచ్చుని! అంతేగాక, ఇవన్నీ చెప్తేగాని, మేవావిడతో యెలా వేగిపోతున్నావో మీకు తెలీదని గూడా యిన్నీ వివరాలిచ్చా మీకు. ఇంట్లో మమ్మల్ని ప్రతిఘడియా యేడిపించే పనుల్ని గూర్చి నేను చెప్పనే లేదు. హయ్యో బాబో! యే నవ్వండీ బాబూ! కోటయ్యగారు క్లీన్గా భోంచేసిన విస్తట్లేనే కొత్తదనుకున్నానని, మా శాషమ్మ దొడ్డమ్మకి మళ్ళీ వొడ్డించడం, యెంగిలి విస్తళ్ళన్నీ కట్టగట్టి గోడ మీద నుంచి వీధంట వెడ్తున్న మేస్త్రీటు వీర్రాజు గారి తల మీద పడేటట్టు విసిరి వేయడం - ఈ గొడవలన్నీ ముందు ముందు మీకు తెలుస్తాయి. అలాగే సినిమాకు వెళ్ళడం, సర్కస్ వాళ్ళ బోనుల దగ్గిర కదలకుండా నిలబడి అక్కడ జెంతువుల్లో జెత కట్టడం, శాసనసభ సీటు కోసం మా వూళ్లో చేసిన పెద్ద ఎన్నికల సభలో రభస చెయ్యడం - యిలాంటివన్నీ కూడా యిప్పుడు కాదు, తర్వాత చెప్తా.

అయితే, వో చిన్న సంగతి చెప్పి, అది చెప్పితీరాలి - ఆవిడ తిర్నాళ్లలో తప్పిపోవడం దగ్గిరకొస్తా.

అప్పన్న శాస్తుర్లు గారని చెప్పానే ఇందాక కవిగారు, ఆయన వోసారి అవ్వమీద పంచరత్నాలు చెప్పాడు భోజనాల దగ్గిర సరదాకి!

"సుగుణమణిగణ నికురంబ సుబ్బమాంబ"
అనిన్నీ.
సుజన సేవావలంబగం, సుబ్బమాంబ"
అన్నిన్నీ.

"గం" అంటే గంగాభాగీరథీ సమానురాలట. ఆయన వద్యాలు చెప్తుంటే, అవ్వ ముసిముసినవ్వుల్తో అటు యిటూ తిరుగుతూ, ఏదో తనగొడవ కాదన్నట్టూ నిర్లక్ష్యంగా పట్టించుకోనట్టూ విననట్టూ అంతా విని, "అవి కాయితం మీద రాసిపారెయ్యండి బాబూ, మా నాన్నిగాడికివ్వండి" అంది.

నాన్నిగాడంటే మా పెద్దబ్బాయి. వాడంటే మా అవ్వకిష్టం. మా నాన్నపేరని! వాడూ గడుసు రాస్కెల్, యేం చేశాడూ! ఆ పద్యాలు తీసుకుని, వల్లించి అడపా తడపా పెద్ద రాగవరస పెట్టి అవ్వ దగ్గిర చదవడవూ, ఆవిడ దగ్గిరేదేనే కొట్టేడవూ. ఈ పద్యాల వెర్రి అవ్వనెంతదాకా పట్టుకుందీ అంటే, వో సారి నాతో అందీ - "వొరే అబ్బాయీ! నేనుపోయాక వదకొండో రోజున యీ కవుల్నందర్నీ పిలిపించి నా మీద పజ్యాలు చెప్పించరా" అని.

ప్రెస్తుతమేవిటంటే, నాన్ని గాడు శివరాత్రి తీర్థాని కెళ్దామని అవ్వని రెచ్చగొట్టాడు. నా కిష్టం లేదు. "తీర్థములు మానసములు ముక్తి ప్రదములు" అంటూ "సత్యము తీర్థము" అంటూ కవి చెప్పిన మాటల్లో నమ్మకం వున్న వాణ్ణియెను. అయితే యేం జెయ్యను అవ్వా నాన్ని గాళ్ళల్లో యే ఒక్కళ్ళనీ లొంగదీయడమే కష్టం! యిద్దరూ పట్టుకున్నారాయె!! పోనీ యిల్లేనా ఆనాటికి విశ్రాంతిగా ఉంటుందనిన్నీ దారి పొడుగునా అస్తమానపూ అవ్వకోసం పంచరత్నాలు పద్యాలు చదివి నాన్నిగాడి తెగ్గులు కుదురుతుందనిన్నీ సరేనన్నాను, చివరికి.

ఆ తీర్థానికే వెళ్తున్న రావయ్య కాపుని బతిమాలుకొని, అతని రెండెడ్ల బండిలో మా వాళ్ళనీ కుక్కాను. తోవలో అవ్వ కునికీ పాట్లు పడి కిందపడకుండా రావయ్యకాపు పెద్దకొడుకుని బండి చివర బిరడాలాగా బిగించాను. ఈ బిరడా సంగతి తర్వాత చెప్తా.

వాళ్ళు తెల్లారగట్టే వెళ్ళారు. సాయంకాలవో, రాత్రి వడుతుంటేనో రావాలి. మూడు నాలుగ్గంటలకి యేదో పని వుంది వీధిలోకి వచ్చా. వీథరుగు పక్కని బిక్కమొహం వేసుకుని, యేడిచి యేడిచి వాచిన యెర్రకళ్ళూ వాడూ, నాన్నిగాడు వొదిగి నిలబడి వున్నాడు.

"ఏమిరా అవ్వేదిరా" అన్నాను.

"త-త-త-" అన్నాడు.

"ఏమిట్రా తతత తప్పిపోయిందా ఛఛఛ కాదుగదా, అంటే చచ్చిపోలేదు గదా" అనడిగాను.

"తీర్థంలో అవ్వకనబళ్ళేదు" అన్నాడు వాడు మెల్లిగా.

'ఆ' అన్నాను. నా గుండె గుబేలుమంది. గోదార్లో పడిందేవో! కారు కింద పడిందేవో! గుండె ఆగిపోయిందేవో, ముసల్ది నాకు మహజాలీ, దుఃఖం వేసుకొచ్చాయి. అసలు అవ్వంటే మా అందరికీ యెంత యిష్టవో అప్పుడు తెలిసొచ్చింది



నాకు. అవ్వని తీసేస్తే లోకం యెలా వుంటుందో మాకు తెలియదు. పాపం ఆవిడకెవరున్నారు నిజానికి నాకు ముసలాళ్లను జూస్తే ఎంతో దిగులు. ముందుకు చూసుకుంటే నోరు తెరుచుకుని దగ్గరగా వొచ్చే చీకటి భూతంగాక వాళ్ళకే వుంది!

మా అవ్వ చూపులు వొక్కక్కప్పుడు, దూరాన ఆకాశాన పోయే పక్షుల్లాగా వుంటాయి. యెక్కడికో యెక్కడికో పోతూన్నట్టు, అప్పుడు నాకు భయం వేస్తుంది. అవ్వ వొక్కక్కప్పుడు పొడుగ్గా నిట్టూర్చేది! ఆ నిట్టూర్పు చిన్నతనం నుంచీ యెనభై యేళ్ళ దార్లోబడి పాకి వచ్చినట్టుండేది. ఇప్పుడు ఈ మాటలన్నీ స్తిమితంగా అంటున్నాను గానీ అప్పుడు....

"యేవిట్రా, యేం జరిగిందీ" అని నాన్నిగాణ్ణి అడిగాను.

గోదావర్లో స్నానం చేసొచ్చారట. గుళ్ళోకూ్కడా వెళ్ళొచ్చారట. స్వామి దర్శనమయ్యాక, గుళ్ళో మండపం మీద కూచుని వాడి చేత సరదగా పంచరత్నాలు కూడా చదివించుకుందిట. తర్వాత యివతలికి వొచ్చాక, రంగుల రాట్నం దగ్గరికొచ్చేటప్పటికీ నాన్ని గాడు అదెక్కుతానన్నాట్ట. వాడు కాసేపు దాని మీద తిరిగొచ్చేసరికి అవ్వక్కడ లేదు. వాడు మొదట యిక్కడా అక్కడా చూసి, కనబడకపోతే కంగారు పడి, "అవ్వా, అవ్వా" పిలుస్తూ తీర్థవంతా తిరిగీ, బళ్ళు విప్పిన చోట దగ్గిరికొచ్చి అక్కడ కూడా ఆవిడ కనబడకపోతే అయిదు మైళ్ళు నడచి యింటికొచ్చేశాడు. యిదీ కథ.

వెంటనే రావయ్య కాపొచ్చాడేమో వాళ్ళింటిక్కబురు చేశాను. కావిగాణ్ణీ గోవిందునీ తిర్నాళ్ళకి పరిగెత్తించాను. అవసరమైతే పోలీసుల్తో గూడా చెప్పమన్నా, ఇంట్లోనూ మా ఆవిడ పిల్లలూ నిశ్శబ్దంగా కూచున్నారు, కుక్కిన పేనుల్లా. నేను శివ స్మరణ చేస్తూ బయటికెళ్తు, లోపలికొస్తూ మతిపోయినట్లు తిరగడం మొదలెట్టాను.

రాత్రి పదయింది. అవ్వ లేకుండా రావయ్య కాపు బండి వొచ్చేసిందట. కావిగాడూ గోవిందు వర్తి చేతుల్తో, అంటే అవ్వ లేకుండా వొచ్చేశారు. ఇహ వూరుకుంటే బావుండదని, మా ఆవిడ లోపల్నించి కొంచెం కూనిరాగం యేడుపు ప్రారంభించింది. చంటి పిల్లాడు గూడా యథాశక్తి వాళ్ళమ్మకి తోడయ్యాడు. చూడ్డానికీ, ఉబుసుపోకా, సొహం గ్రామం మా యింటి దగ్గిర చేరి, అవకాశం రాగానే సరదగా పరామర్శలోనూ, అవ్వ దివ్య స్మృతుల్ని నెమరు వేసుకోడంలోనూ, అప్పుడే పడిపోయారు.

ఇదీ తీర్నాళ్ళ రోజున అర్ధరాత్రి మా స్థితి.

అంతలో "సన్యాసిరాజుగారిల్లిదేనా" అని దూరాన్నుంచి గద్దిస్తున్న మాటలు వినబడ్డాయి. అందరూ అటు తిరిగి చూశారు.

"యెవరు బాబూ, యేవిటి" అని గావుకేక పెట్టాన్నేను. చీకట్లోంచి వొస్తూ పోలీసు జెవాను కనబడ్డాడు. కూడా ఠీవిగా నడుస్తూ, చీకట్లో దీపస్తంబం లాగా, జెవానుకంటే ధాటీగా అవ్వ సాక్షాత్కరించింది. "అవ్వొచ్చింది" అని కేకేశాను. లోపల్నించి అందరూ "ఘొల్లు" మని యివతలికి వొచ్చారు.

కొందరు మాత్రం 'అరెరే! అవ్వ అప్పుడే దొరికేసిందే. నాల్రోజుల పాటు సరదా పోయిందే' అని దిగులు మొహం వేశారు.

పోలీసు జెవాన్, 'యిదుగోనండీ ముసలావిడ. నా ప్రాణాలు తోడేసిందీ ఈవిణ్ణి తిర్నాళ్ళకీ తీర్థాలకీ పంపి, దేశం మీద వొదుల్తారేమిటయ్యా యీవిడకంటే మా సూపరెంటు నయం" అని చీదరించుకుంటూ అన్నాడు.

"పోరా! నే సూపరింటునే. నాకేంరా బహద్దర్ని! శెలవిచ్చాను ఫో" అంది అవ్వ. వాడు పళ్ళు బిగించి కొరకొర చూసి, చీకట్లోకి నడిచి, అక్కడ ఖాండ్రించి వుమ్మేసి చక్కాపోయాడు.

ఇహ తీర్థంలో జరిగిన కథేమిటంటే....

నాన్నిగాడు రంగులరాట్నం తిరుగుతూంటే పిల్లలందరికీ జీళ్ళూ, జంగిడీ మిఠాయీ, తొక్కుడుండలూ కొందామని, ఆ కొట్టకెళ్ళి వొక్కక్కళ్ళకి పేరు పేర్నా వొక్కక్క పొట్లాం కట్టించిందట అవ్వ. అక్కడ చిల్లర విషయంలో కొట్టువాడితో పేచీ వొచ్చి, వాణ్ణి భూశెయనం చేసి పారేసి, దమ్మిడీలతో సహా వాడి దగ్గర్నుంచి రాబట్టి, పాత్ర సామాను దుకాణం వైపు దండ యాత్ర మళ్ళించి, అక్కడ ఆ దుకాణం మీద పడిందట. అక్కడ రాగి చెంబూ గరిటా బేరం తేల్చడానికి రావరావణ యుద్ధం చేసి, రాచ్చిప్పల కొట్టువైపు ద్రుష్టి తిప్పి, అటు దాడి చేసింది. దారిలో డక్కీ డమడమలబండీ వాడు తారసిల్లితే, అన్నీ వాయించీ, నడిపీ చూసీ, అమ్మేవాడు బారుమని యేడ్చేదాకా వాణ్ణి ఆపి, అంతలో వుప్మాకయ్య గారి కుటుంబం కనబడితే వాళ్ళతో వూసులాడి, అట్టే నాలుగడుగులేసే సరికి నాన్నిగాడు గ్యాపకానికొచ్చాడు. అప్పటికప్పుడే పొద్దువాల్తోంది.

"నాన్నిగా నాన్నిగా" అని తీర్థవంతా తిరగడం మొదలెట్టింది. బళ్ళ దగ్గరికొచ్చి చూస్తే, రావయ్య కాపు బండీ వెళ్ళిపోయింది. మళ్ళీ తీర్థంలోకి వొచ్చింది. "మా నాన్నిగాడు కనబడ్డాడా" అనడుగుతూ, ఎవళ్ళనడిగినా వాళ్ళు పట్టించుకోలేదు. అప్పటికి కంగారు పడ్డం మొదలెట్టిందవ్వ. ఇంతలో కనబడిన పోలీస్ జెవాన్ని కూడా అడిగింది. వాడు వూరూ పేరు అన్నీ అడిగి పోలీస్ స్టేషన్ దగ్గిర కూచోబెట్టాడు.

"అమ్మా! భై పడకండి. ఇంటికి తీసికెడతాం" అని పోలీసు వాడంటే, "ఎవరికి భయం" అని ధీమాగా మొదట అన్నప్పటికీ, నాన్నిగాడి కోసం లోపల్లోపల కంగారు పడిపోయంది. అవ్వ పోలీస్ స్టేషన్లో కూర్చున్న సమయం లోనే కావిగాడూ గోవిందూ అవ్వకోసం గాలించి పోయా

రు. యిదంతా చెప్పాక యిలాగంది అవ్వ: 'ఆ రాచ్చిప్పల దుకాణం దగ్గిరాలస్యవయి పోయిందర్రా! అక్కడే వొళ్ళు మరిచిపోతుంటాను. ఏవిరా నాన్నిగా! శివరాత్రి గూడాను. అప్పన్న శాస్త్రుర్లుగారి పద్యాలు నా మీద రాసినవి చదవరా" అంది. అందరూ పకాపకా నవ్వారు. నాకు మాత్రం వొళ్ళు భగ్గుమంది. ఆవిడ గొంతుక పట్టుకుని ఆ రాత్రిని ఆవెని శివసాయుజ్యం పొందిద్దావనుకున్నాను. దిక్కుమాలిన పాపభయవో, దండన భయవో వొచ్చి పడీ మళ్ళీ తమాయించుకున్నాను. అంతకంటే గూడా నా లోపల పిచ్చి యిష్టం గూడా యేడిసిందాయెను అవ్వ మీద, మా సుబ్బమ్మవ్వ మీద!



# 'జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ.... కృష్ణశాస్త్రి'

**చూసే మనసున్న ప్రతి మనిషినీ భావ కవితా జగతిలో విహరింపజేసిన దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి వర్ధంతి (ఫిబ్రవరి 24)ని పురస్కరించుకుని వారి (సినీ) కవితా సౌందర్యానికి రచయిత, నటుడు తనికెళ్ళ భరణి తనివీతీరా పట్టిన నిలువుటద్దం ఈ వ్యాసం....**

కన్నీటి బిందువు మీద ఖండకావ్యం రాయగల కరుణరసార్ద్ర మూర్తి కృష్ణశాస్త్రి....

'ఏకోరసః కరుణః' అన్న ఆర్యోక్తిని మనసావాచాకర్మణా పాటించి తెలుగు సారస్వతాన్ని పరిమళింపజేసిన భావ కవితా సామ్రాట్టు కృష్ణశాస్త్రి.



తెలుగు కవిత్వం వరకు శ్రీశ్రీ మండే సూర్యుడైతే కృష్ణశాస్త్రి పండు వెన్నెల... ఆయన మాట బాణం అయితే ఈయన పాట వీణ! ఆయన కవిత్వం పెనుతుఫానైతే ఈయనది మలయమారుతం!.... ఆయనది మిరియాల కషాయం అయితే.... ఈయనది జీడిపప్పు పాయసం! (ఇద్దరూ రెండు కళ్ళు.... ఒకటి కుంకుడు రసం పడి ఎర్రవడ్డట్టుంటే రెండోది చనుబాలతో తెల్లబడ్డట్టు!!)

తెలుగు సినిమా భాషని శిష్టులు వెలేస్తే.... ఇదిగో ఇలాటి కవితా వశిష్టులు పౌరోహిత్యం చేసీ, సాహిత్యం పోసీ, తెలుగు సినిమా భాషకి కావ్య గౌరవం కల్పించి శభాష్ అనిపించారు!!

మల్లీశ్వరి... తెలుగు చలనచిత్ర చరిత్రకి సంబంధించినంత వరకూ అది 'కాళిదాసు మేఘసందేశం'. ఆ పాటలు రాయటానికి కలం ఒక్కటీ చాలదు. కలలు కావాలి!! స్వాప్నిక జగత్తులో విహరించి... విరహించి - రమించి - దహించి ఆ అనుభవాలను అమృతంలో ముంచి దానిమీద నక్షత్రపు రజను జల్లి, పాళీలో పోస్తే... అదొక పదమై... పాదమై.... నాదమై... మల్లీశ్వరి పాటై... ఆంధ్రదేశపు ప్రతీనోటా మోగింది!!

కృష్ణశాస్త్రిగారిని చదువుతున్నప్పుడు మనకు... తరవాణి కుండలో దబ్బాకులేస్తున్న బామ్మ.... మల్లెపూలతోపాటు మరువం కలిపి మాల అల్లుతున్న మరదలు... గవ్వలూ, కజ్జికాయలూ చేస్తున్న దొడ్డమ్మ.... బోగిపళ్ళు.... రాగికాణీలూ పోసుకున్న తమ్ముడి కూతురు..... గోదారి పక్కన కొబ్బరిబొండాం తాగుతున్న ఫారిన్‌వాడూ..... పట్టుపరికిణీ కట్టుకున్న ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలు పాడే అందమైన తెలుగు పిల్లా గుర్తుకొస్తారు.!!

జులాయి వెధవ జులపాలు పెంచినా.... కవిగారేమో అని కంగారుపడేట్టు చేశాడు కృష్ణశాస్త్రి తన గెటప్పుతో!

సరస్వతి మగాడైతే... కృష్ణశాస్త్రిలా ఉంటుంది!

గంధర్వుడు భూమ్మీద పుడితే కృష్ణశాస్త్రిలా ఉంటాడు!!

కవి అనేవాడు ఉంటే కృష్ణశాస్త్రిలా ఉండాలి!!!

కవిత్వం వచ్చినా రాకపోయినా భావి కవికి జులపాలు చిహ్నామైపోయాయి!!!

అందుకే అంటాడు శ్రీశ్రీ

"ఉగ్గేల తాగుబోతుకు
ముగ్గేల తాజమహలు మునివాకిటిలో
విగ్గేల కృష్ణశాస్త్రికి
సిగ్గేలా భావకవికి
సిరిసిరిమువ్వా" అని.

'మనసున మల్లెల మాలలూగడం' ఏవిటండీ.... ఎంత విచిత్ర పదచిత్రం!?

'అలాగే.... నల్లని మబ్బులు గుంపులు గుంపులు....

'తెల్లని కొంగలు బారులు బారులు'- అని పాడుతూంటే....

హృదయం మయూరమై పింఛం విప్పుతుంది!!

కవిత్వం అంటే... చిటికి కర్రలు పేర్చడం కాదు!!

అనుభూతుల ఆకులు రాల్చడమూ కాదు....

పరిమళభరితమైన అక్షరాల్ని కూర్చడం....

కరువుతీర... కన్నీరు కార్చడం!

సుఖదుఃఖాలు సినిమాలో.... 'తొందరపడి ఒక కోయిల ముందే కూసింది' అన్న పాటలోని మాట... విన్నప్పుడల్లా... నాకు మేధావుల వలసా... పసిపిల్లల మరణం... సూర్యగ్రహణం... కొండమీద ఒంటరి శిలువ.... స్మృతిపథంలో కొస్తాయ్ సింబాలిక్‌గా!- ఎంత ఫిలాసఫీ ఉంది ఆ ముక్కలో....!?

ఎదిగిన పచ్చని చెట్టు.... పట్టపగలు పిడుగుపడి గుప్పెడు బూడిదగా మారిపోతే కలిగే దిగ్భ్రమ కలిగింది కృష్ణశాస్త్రిగారికీ - పెళ్ళీడుకొచ్చిన తన కుమార్తె సీత అర్థాంతరంగా అంతర్ధానమైపోతే!!- ఆ అనంత విషాదాన్ని గొంతులో నింపుకుని మాటని మాయం చేసి మౌనంగా ఎంత మథనపడ్డారో ఆ పరమేశ్వరుడికే ఎరుక!!

అలాగే 'ఉండమ్మా బొట్టుపెడతా' సినిమాలో 'శ్రీశైలం మల్లనా శిరసొంచేనా' అంటే... పడ్తోన్న ఆకాశగంగని దోసిట్లో పట్టి.... కళ్ళకద్దుకుని... తీర్థంలా తీసుకుని తలకి రాసుకున్నంత పవిత్రం ఉంది! వింటే పాపాలు పోయేంత కమ్మని పాట!!!

పొలాల్లో ఈ పాట పాడితే చాలు.... పంట పండుతుందని నా నమ్మకం.

ఇంక 'శబరి'... వెర్రి భక్తికి ప్రతీక!... వెర్రి భక్తంటే? సర్వస్వం సమర్పించుకోవడం.... తన గుండెకాయని పండుచేసి రాముడి చేతిలో పెట్టే సన్నివేశంలో కృష్ణశాస్త్రి ఎంగిలిపడని అక్షరాల్లో మంగళకరంగా వర్ణించిన శబరి పాటవింటే.... ఒళ్ళంతా కళ్ళనీళ్ళతో నిండిపోయి... రూపు కనపడదు... పాటా వినపడదు.... రామావతారంలోని నిశ్శబ్ద ఓంకారం తప్ప!! మమేకం అయిపోవడం అంటే ఇదేనేమో!! కృష్ణశాస్త్రే శబరేమో!!! అక్షరాలే అల్ల నేరేడు పళ్ళేమో!!!

నడిసేయకోగాలి - అనే మకుటాయమానమైన రాజమకుటంలోని పాట... ఆ పదాల సౌకుమార్యం.... ఆ పాటలోని లాలిత్యం.... పచ్చకర్పూరం...., జాజికాయ, జాప్రత్తి వేసి చుట్టిన తమలపాకుల చిలకలు చిటికెన వేలిపై వాలితే.... మునిపంటితో కొరుక్కుతింటున్న పారవశ్యం.... ఆ మత్తులో కలలు కంటూ కన్ను మూస్తేనేం అనిపిస్తుంది!

-ఒకసారి మద్రాస్ ఆంధ్రా క్లబ్‌లో రాళ్ళపల్లి గారు రాసిన నాటకం 'ముగింపులేని కథ' మేం ప్రదర్శిస్తుంటే చూసి కృష్ణశాస్త్రి గారు "బావుంది... మధ్య తరగతి కుటుంబంలోకి... కిటికీలోంచి తొంగిచూసినట్టుంది" అని కితాబు ఇచ్చారు- ఓ పేపరు మీద పెన్సిల్‌తో రాసి!!

నా మటుకు నాకు ఆయన పాటలన్నీ ఒకెత్తు....

'జయజయజయ ప్రియభారత జనయిత్రీ' ఒక్కటీ ఒకెత్తు

ఆ పాట భరతమాత పాదాలకి పూస్తే పారాణి అవుతుంది!

అరచేతులకి రాస్తే గోరింటాకులా పండుతుంది!

మెడకి పూస్తే మంచి గంధమౌతుంది!

కురులకి రాస్తే సంపెంగ నూనె అవుతుంది!!

పెదాల అరుణిమతో కలిసి తాంబూలమౌతుంది!!

జన్మనిచ్చిన భరతమాత రుణం తీర్చుకున్నాడు కృష్ణశాస్త్రి ఈ ఒక్కపాటతోటి!!

కనీసం పాటలోని పల్లవైనా వినని తెలుగువాడుంటే... ఆ పాపం కృష్ణశాస్త్రిది కాదు... ఆ తెలుగువాణ్ణి కన్న 'తల్లిది'!!

జాతీయగీతం కాదగ్గ స్థాయిలో ఉన్న ఆ పాట....

భరతమాత ఉన్నంత వరకూ ఉంటుంది!

ఆ పాట ఉన్నంతవరకూ కృష్ణశాస్త్రిగారుంటారు!!

(ఆయన పోయిన పూట.... నేను రాసుకున్న మాట!)

చీకటి కన్నీరు మీట
కృష్ణశాస్త్రి పాట
వెలుగంతా కన్నుగీట
పలికె మూగనోట

**-తనికెళ్ల భరణి**

**('వార్త' సౌజన్యంతో)**




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

**1. సైదోడు (రేచుక్క..ఒంటరొంటరిగ పోయేదాన)**
ఎ) సాటివాడు  బి) పొరుగువాడు
సి)సహాయపడేవాడు  డి)తోబుట్టువు

**2. మాలిమి (రేచుక్క..ఆ మనసేమో)**
ఎ) తోటపని  బి) మక్కువ
సి) చనువు  డి) సంపద

**3. తొగరు (మేఘసందేశం..శీతవేళ)**
ఎ) గర్వము  బి)ఎరుపు
సి) వగరు  డి) నవ్వు

**4. కలికి (అమృత..ఎంత చక్కని గిల్‌గిల్)**
ఎ) కులుకులాడి  బి) ప్రేయసి
సి) కళలు తెలిసినది  డి)అందమైన స్త్రీ

**5. వేసట (శ్రీ రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్..నా పేరు బికారి)**
ఎ) ఎండ  బి)అలసట
సి) విసుగు  డి) చింత

**6. దవ్వు (మల్లీశ్వరి..మనసున)**
ఎ) దగ్గర  బి) కొలను
సి) చోటు  డి) దూరము

**7. కమ్మ (బలిపీఠం ... కుశలమా)**
ఎ) జాబు  బి) కబురు
సి) ప్రేమ  డి) తీపిపదార్థము

**8. కుందమం (మేఘసందేశం..ముందు తెలిసెనా)**
ఎ) గన్నేరు  బి) తామర
సి) ముగ్గు  డి) కొమ్మ

**9. ఎలమావి (కథానాయిక మొల్ల..దొరవో)**
ఎ) మావిడి మొక్క  బి) తియ్యమామిడి
సి) కోకిల  డి) పెద్దచెట్టు

**10. ముంగురులు (కలసిన మనసులు..ఒక క్షణం)**
ఎ) ఆభరణము  బి) చేయి
సి)నుదుటిపై వాలే వెంట్రుకలు
డి) కనుబొమలు

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

## అమెరికా అమ్మాయి

సంగీతం: జి.కె. వెంకటేష్ గానం: పి. సుశీల

పాడనా తెలుగుపాట - పరవశనై - నే
పరవశనై మీ యెదుట మీ పాట ॥పాడనా॥

కోవెల గంటల గణగణలో - గోదావరి తరగల గలగలలో
మావుల తోపుల, మూపులపైన - మసలేగాలుల గుసగుసలో
మంచిముత్యాల పేట - మధురామృతాలతేట... ఒకపాట ॥పాడనా॥

త్యాగయ - క్షేత్రయ, రామదాసులు -
తనివితీర వినిపించినదీ
నాడు నాడున కదిలించేది - వాడవాడలా కరిగించేదీ
చక్కెరమాటల మూట - చిక్కని తేనెల ఊట... ఒకపాట॥పాడనా॥

ఒళ్లంత ఒయ్యారి కోక - కళ్లకు కాటుకరేఖ
మెళ్ళోతాళి - కాళ్లకు పారాణి - మెరిసే కుంకుమ బొట్టు
ఘల్లు ఘల్లున కడియాలందెల - అల్లనల్లన నడయాడే
తెలుగుతల్లి పెట్టనికోట - తెనుగునాట ప్రతినోట ఒకపాట॥పాడనా॥

## బలిపీఠం

సంగీతం: చక్రవర్తి గానం: బాలు, సుశీల

ఆ: కుశలమా నీకు కుశలమేనా?
మనసు నిలుపుకోలేక
మరీమరీ అడిగాను అంతే... అంతే... అంతే...
అ: కుశలమా మీకు కుశలమేనా?
ఇన్నినాళ్ళు వదలలేక,
ఏదో ఏదో వ్రాశాను అంతే... అంతే... అంతే
ఆ: చిన్న తల్లి ఏమంది?
అ: నాన్న ముద్దు కావాలంది
ఆ: పాలుగారు చెక్కిలిపైన పాపాయికి ఒకటి!
తేనెలూరు పెదవులపైన దేవిగారి కొకటి
ఒకటేనా... ఒకటేనా...
అ: ఎన్నైనా... ఎన్నైనా
ఆ: మనసు నిలుపు కోలేక మరీ మరీ అడిగాను
అంతే... అంతే... అంతే...
అ: కుశలమా నీకు కుశలమేనా
ఆ: పెరటిలోని పూలపొన్న
అ: త్వర త్వరగా రమ్మంది
ఆ: పొగడ నీడ పొదరిల్లో
అ: దిగులు దిగులుగా ఉంది ఎన్ని కబురులంపేనో...
ఎన్ని కమ్మలంపేనో...
పూలగాలి రెక్కలపైనా నీలిమబ్బు పాయలపైనా
అందేనా... ఒకటైనా
అ: అందెనులే... తొందర తెలిపెనులే
ఇన్నినాళ్ళు వదల లేక
ఏదో ఏదో వ్రాశాను
అంతే... అంతే... అంతే... కుశలమా...

## అమ్మ మనసు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: బాలు, సుశీల

అ/ఆ: అరె, చిక్‌చిక్ చిక్‌చిక్ రైలుబండీ!
అది, చకచక వెళ్తుందండీ... రైలుబండీ...
అ: పప్పూ బువ్వా తిన్నావంటే, తిన్నావంటే
పండరిపురమే వెళ్ళొచ్చు - వెళ్ళొచ్చు
పాండురంగని చూడొచ్చు
ఆ: పాలూ మీగడ పెట్టొచ్చు...
అ: జైజై విఠలా...
పండరినాథా...
అ: జైజైవిఠలా...
పాండురంగా... కూ... కూ... ॥అరె చిక్‌చిక్॥
ఆ: బుద్ధిగ నువ్వు బజ్జున్నావా,
బృందావనమే వెళ్ళొచ్చు...
అ: బుజ్జి కృష్ణునీ చూడొచ్చు...
బోలెడు వెన్న అడగొచ్చు...
ఆ: తారంగం - తారంగం
అ: తాండవ కృష్ణా తారంగం ॥అరె చిక్ చిక్॥
అ: చప్పుడు చేయక రావాలీ
చెప్పినట్టుగా చేయాలి...
ఆ: ఏమిటి
ఆ: దానిస ససస సరిసదసనిసస
పాదని నినినిని నిదని సదనిస
వేళాపాళా ఉండాలి
వెర్రికి హద్దు ఉండాలి...

## ధనవంతులు-గుణవంతులు

సంగీతం: పెండ్యాల గానం: పి. సుశీల

తెరచి యుంచేవు సుమా
పొరబడి నీ హృదయము!
బిరబిర ఏ సుందరియో
చొరబడితే ప్రమాదము! ॥తెరచి॥
పూలవాకిళ్ల తుమ్మెదలు
పొంచి ముసిరేవేళ,
నేలపై దిగి అచ్చరలు
లీలగా తిరిగేవేళ,
ఆదమరచి నిదరోయినా
హాయి కలలలో మునిగినా
ఆపద సుమ్మా... ॥తెరచి॥
కన్నుదోయి నల్ల కలువలుగా
కనుపించు ప్రాయము నీది,
సన్నజాజి పువ్వు నవ్వులనీ
అనిపించు భావన నీది -
చీరచెరగు గుసగుస మన్నా
కాలిఅందియల సడి విన్నా
చిక్కులు సుమ్మా ॥తెరచి॥

## ఇదెక్కడి న్యాయం

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: పి. సుశీల, వి. రామకృష్ణ

ఎపుడైనా ఒక క్షణమైనా
ఏకాంత దర్శన మీవా
ఎదురెదురుగా ఎదురెదురుగా
నీవూ నేనే నేనూ నీవే ॥ఎపుడైనా॥
ఈ చిరుగాలిలో ఏమున్నదో
ఈ పరిమళము ఏ తోటదో
నిలువదు నాలో ఈ హృదయం
పలువరించుచు పరుగిడు నీ కోసం ॥ఎపుడైనా॥
విను విను జుమ్మను తుమ్మెదలా -నిను
మరి మరి రమ్మను తీగలా
నాపై కురిసే పున్నమి వెన్నెలా - ఇవి
నాలో పొంగె నీ ప్రేమ జల్లులా... ॥ఎపుడైనా॥
ఎపుడైన యే క్షణమైనా
ఏకాంత దర్శన మేలా
ఎదురెదురుగా ఎదురెదురుగా
నీవూ నేనే నాలో నీవే

## శ్రీ తిరుపతి వేంకటేశ్వర కళ్యాణం

సంగీతం: పెండ్యాల గానం: పి. సుశీల, బాలు

ఇది నా హృదయం
ఇది నీ నిలయం
ఇది సురముని యోగీశ్వరులు చూపులకు అందని
ఆనందనియం ॥ఇది నా॥
ఇది నా శ్రీనివాసం
ఇది నా రాణివాసం
నాపైనీకింత అనురాగమా
నాపై నీకింత ఆధారమా
ఇది నా ప్రణయడోల ॥ఇది నా॥
ఇది నా ప్రభువు లీల
ఎల్ల లోకములు ఏలే వారికి
ఈడా... జోడా... ఈసిరి
నీకుంలీ పురిలో విభువక్షస్థలి
విడిది చేయు నా దేవేరి
ఇది నా భాగ్యం
ఇది మన భోగం ॥ఇది నా॥

## సంపూర్ణ రామాయణం

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

ఊరకే కొలను నీరు ఉలికి ఉలికి పడుతుంది
ఓరగా నెమలి పింఛ మారవేసుకుంటుంది
ఎందుకో ప్రతిపులుగు ఏదో చెప్పబోతుంది
వనములో చెట్టు చెట్టు కనులు విప్పి చూస్తుంది
ఉండుండీ నా ఒళ్ళు ఊగి ఊగి పోతుంది
అదుగో రామయ్యే ఆ అడుగులు నా తండ్రివే
"ఇదిగో శబరీ శబరీ" వస్తున్నా నంటున్నవి
కదలలేదు వెర్రిశబరి, ఎదురుచూడలేదని
నా కోసమె నా కోసమె నడిచి నడిచి నడిచీ
నా కన్నా నిరుపేద నా మహరాజు పాపం అదుగో
అసలే ఆనదు చూపు
ఆ పయి ఈ కన్నీరు
తీరా దయచేసిన నీ రూపు తోచ దయ్యయ్యో
ఎలాగో నా రామా! ఏదీ? ఏదీ? ఏదీ?
నీల మేఘమోహనము నీ మంగళరూపము
కొలను నడిగీ తేటనీరు
కొమ్మనడిగీ పూలచేరు
చెట్టు నడిగి పట్టు నడిగీ
పట్టుకొచ్చిన ఫలాలు పుట్టతేనె రసాలు
దోరవేవో-కాయలేవో
ఆరమగ్గిన వేవోగాని
ముందుగా రవ్వంత చూసి
విందుగా అందియ్యనా

## కళ్యాణ మంటపం

సంగీతం: పి. ఆది నారాయణరావు గానం: పి. సుశీల

"సరిగమ పదనిస నిదప మగరిస" అని
పలికే వారుంటే, హృదయము తెరిచే వారుంటే,
వలచే మనసుకు బదులుగ, బదులుగ,
పిలిచే కనులకు ఎదురయి, ఎదురయి
పలికే వారుంటే, హృదయము తెరిచే వారుంటే ॥సరిగమ॥
"ఒక కోవెలలో ఒకడే దేవుడు!
ఒక హృదయములో ఒకడే ప్రియుడు!
జీవననేత, ప్రేమవిధాత"
అను గుడిగంట! విను ప్రతిజంట! ॥ప॥
"తీగా తీగా పెనగీ పెనగీ.
రాగధారగా సాగీ సాగీ,
జీవన గంగవాహిని కాదా!"
అను ప్రతి జంట! విను గుడిగంట! ॥ప॥

## శ్రీ వినాయక విజయం

సంగీతం: యస్. రాజేశ్వరరావు | గానం: పి. సుశీల

ఎవరవయా! ఎవరవయా! ఏ దివ్య భువినుండి దిగి
ఈ అమ్మ ఒడిలోన ఒదిగి - ఎవరవయా! ఎవరవయా!
ఆ కనుల వెలిగేవి ఏ జ్యోతులో గాని
ఆ నవులు పలికేవి ఏ వేద మంత్రాలో
వేల్పులందరిలోనా తొలివేల్పువోయేమో
పూజలలో మొదటి పూజ నీదేనేమో! ॥ఎవరవయా॥

చిట్టిపొట్టి నడకలు - జిలిబిలి పలుకులు
ఇంతలో ఔరౌర - ఎన్నెన్ని విద్యలో - ఎన్నెన్ని వింతలో
ఎన్నెన్ని కోరికలు నిండి - నే కన్న
ఎన్నెన్నో స్వప్నాలు పండి - చిన్నారి ఈ మూర్తివైనావో
ఈరేడు లోకాలు ఏలేవో ॥ఎవరవయా॥

## మాయని మమత

సంగీతం: అశ్వత్థామ | గానం: పి. సుశీల, బృందం

ఆమె: ఎవరో వచ్చే వేళాయె
ఎదురై కాస్త చూస్తారా?
పిల్లలు: ఆఁ...
ఆమె: వాకిలి తెరచి ఉంచారా
మరియొక సారి చూస్తారా...
పిల్లలు: ఆ, ఆ, ఆ...
అసలే నల్లని ఒడలాయె
ఆపయి మెల్లని నడలాయె
ముసిరే చీకటి మబ్బులలో
పసిగట్టే దెట్లా...
ఎట్లా ఎట్లా ఎట్లా
ఆమె: నవ్వుల పువ్వులు పూస్తాయి
చూపుల దీపాలుంటాయి
నవమన్మథు డెవరో తెలిసిందో?
పిల్లలు: ఓ, ఓ, ఓ...
ఆమె: స్వాగత గీతం పాడాలి
స్వామికి సైతం నచ్చాలి
ఎవరో వీణ? సన్నాయెవరో?
తకథీం తకథీం మద్దెల?
గల, గల, గల, గల గజ్జెలు?
ఆ పిల్లన గ్రోవికి సరిగా అనగలరో
పిల్లలు: ఓ, ఓ, ఓ...
ఆమె: అత్తరు గంధాల్ తీసే దెవరని
మెత్తని చేతుల పూసే దెవరని
క్రొత్త క్రొత్త విరులూ, సరులూ, మంజరులూ
ఒత్తుగ చివురులు వేదికపై
ఒత్తకుండ పరిచే దెవరు
పిల్లలు: నీవో, మరినీవో, మరినీవో?
ఆమె: నే నెత్తెద హారతి మదిలో ఈ గుడిలోన ॥ఎవరో॥

## మేఘ సందేశం

సంగీతం: రమేష్ నాయుడు | గానం: పి. సుశీల, కె.జె. ఏసుదాసు

శీత వేళ రానీయకు - రానీయకు
శిశిరానికి చోటీయకు - చోటీయకు
ఎద లోపల పూలకారు
ఏ నాటికి పోనీయకు - ॥శీత॥
ఉగ్రమైన వేసంగి గాడ్పులు
ఆగ్రహించి పై బడినా
అదిరి పోవకు
ఒక్కుమ్మడిగా వర్షమేఘం
వెక్కివెక్కి రోదించినా
లెక్క చేయకు - లెక్క చేయకు ॥శీత॥
చైత్రంలో తొగరెక్కిన కొత్త కోర్కెలు
శరత్తులో కై పెక్కే తీయని కలలు
మనసారా తీర్చుకో - మనుగడ పండించుకో
లోకానికి పొలిమేరను - నీ లోకం నిలుపుకో ॥శీత॥
ఉదయాన కలత నిదర చెదరిపోవు వేళ
మబ్బులలో ప్రతి తారక మాయమయే వేళ
ముసలి తనపుటడుగుల సడి ముంగిట వినబడేనా
వీట లేడనీ చెప్పించు - వీలు కాదనీ పంపించు ॥శీత॥

## కళ్యాణ మంటపం

సంగీతం: పి. ఆదినారాయణ రావు | గానం: పి. సుశీల

చుక్కలు పాడే శుభమంత్రం!
దిక్కులు నిండే దివ్యమంత్రం!
ఎక్కడనో, ఎపుడో, ఎవరో
పలికిన వేద మంత్రం!
ఇక్కడనే ఇపుడే ఎవరో - నా
చెవిలో ఊదిన మంత్రం, మధు మంత్రం ॥చు॥

రెక్కలపై ఆ గువ్వలజంట,
రేకులలో ఆ పువ్వులజంట,
సాగుచునే, ఊగుచునే,
మధుర మధురముగ, మక్కువగ,
చదువుకునే ఆనంద మంత్రం ॥చు॥

కన్నులు ఒకపరి మూసుకొని - నీ
వన్నది మరి మరి తలచుకొని,
ఒక్కతెనే - నేనొక్కతెనే
అదే పనిగనే సదా మనసులో
ఆలపించే ప్రియ మంత్రం ॥చు॥

కోవెల దైవం పిలిచే దాకా,
ఆవలి ఒడ్డున నిలిచే దాకా,
నాలోనే లోలోనే
"నాతి చరామి నాతి చరామి" -
అది నా ప్రాణ మంత్రం ॥చు॥

## మేఘ సందేశం

సంగీతం: రమేష్‌నాయుడు గానం: పి. సుశీల

ముందు తెలిసెనా, ప్రభూ! ఈ
మందిర మిటు లుంచేనా?
మందమతిని, నీవు వచ్చు
మధుర క్షణమేదో కాస్త... ॥ముందు॥

అందముగా, నీ కనులకు
విందులుగా వాకిటనే
సుందర మందార కుంద
సుమదళములు పరవనా?

బ్రతుకంతా ఎదురు చూచు
పట్టున రానే రావు
ఎదురరయని వేళ వచ్చి
ఇట్టే మాయ మౌతావు
దారి పొడుగునా తడిసిన
పారిజాత సుమములపై నడిచిన
నీ అడుగుల గురుతులే
మిగిలినా చాలునూ ॥ముందు॥

## కథానాయిక మొల్ల

సంగీతం: కోదండపాణి గానం: పి. సుశీల, ఘంటసాల

ఆ: దొరవో ఎవరవో
నా కొరకే దిగిన దేవరవో
ఈవర కెరుగని తొందరలు
ఏవో సిగ్గుల దొంతరలు
అ: వలచీ పిలిచేవనీ
నను పిలిచీ పిలిచీ అలసేవనీ
నీకయి దాగిన నీ దొరనే!
గుడిలో దీపం వెలుగులో నీ,
దుడుకు సోయగం చూచేననీ
ఆ: ఎవరూ చూడని ఆ సొగసు
ఇన్నాళ్లెందుకు దాచేవనీ
అ: ఈ జంట కలియు శుభవేళ కలసిరావాలని
ఆ: ఈ దివ్యమూర్తి హృదయవర్తి కావాలని
ఇ: జగమెల్ల యిక మెచ్చుకోవాలని... ॥దొరవో॥
ఆ: ఒక కోరిక నిను వేడనీ
ఒడిలో ఎపుడూ ఒదగనీ
అ: ఒక మాట చెవిని ఊదనీ
ఒక క్షణమైన వీడననీ
ఆ: ఎలమావి చుట్టూ, ఈ బేలతీగ పెనగాలని
అ: నెలవంక పక్క ఈ తలుకుతార మెరవాలనీ
ఇ: కలకాల మీలాగే జరగాలని
ఆ: దొరవో - ఎవరవో...
వలచీ, పిలిచేవనీ...

## కాలం మారింది

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: పి. సుశీల

ఓం నమో నారాయణాయ!
ఓం నమో నారాయణాయ!
ఓం నమో నారాయణాయ!

ఆ శతసహస్ర ఘంటాహ్వానము నా కొరకేనా?
ఆ శతసహస్ర వీణాగానము నా కొరకేనా?
ఆ శతశతసహస్ర శంపాప్రభా దివ్యమూర్తి -నాకొరకేనా?

మందహాస మధురవదనా! శ్రీ సదనా!
ఇందురవినయన! ఫణిశయన! గోవిందా!
అరవింద భవవందిత పదనళిన! గోవిందా!
వందారు మునియోగి బృందా! ముకుందా!
బృందారకార్చితా! ఇందీవరశ్యామసుందరా!
భక్తప్రసన్న మందారా! భువనాధారా!

ఏదీ, ఏదీ గంగ కడిగిన పాదకంజాతమేదీ?
మెత్తని రమాకరము లొత్తిన చరణ మేదీ?
నలువపుట్టిన నాభి నళినమేదీ? ఏదీ?
శ్రీవత్స కౌస్తుభ శ్రీనివాసమ్మేదీ?
ఔనుగానీ కృపాధానీ! నీ ఉరమునం దేదీ
కలుములరాణి?... ఏది జనని?
మందహాస మధురవదనా! శ్రీసదనా!
విన్నానుగాని - కనుగొన్నాను - నేడు
నను, కన్నయ్యవని తెలుసుకొన్నాను నేడు!
నీ సన్నిధిని వీడి ఇంక కదలను!
నీ పాదముల క్షణమేని వదలను!
నీ మూర్తి నా చిత్తమును వీడి పోనీయను... పోనీయను....

## జగత్ కిలాడీలు

సంగీతం: యస్.పి. కోదండపాణి గానం: పి. సుశీల, బాలు

ఆ: వేళ చూస్తే సందెవేళ!
గాలి వీస్తే పైరగాలి,
ఏల ఒంటరి తోటకడకు - ఎందుకొరకు? ఎందు కొరకు
అ: కళ్ళు కప్పే రాత్రివేళ,
ఒళ్ళు నిమిరే పిల్లగాలీ,
మెల్లమెల్లన తోట పిలిచె! అందుకొరకే! అందుకొరకే
ఆ: అచ్చంగా వసంతమాసం వచ్చేదాకా,
వెచ్చన్నీ పూదేనియలు తెచ్చేదాకా
అ: పెదవీ పెదవీ ఎదురై ఎదురై
మధువులు వెదకే వేళా
మగువా! అదియే వసంత వేళ ॥వేళ చూస్తే॥
రెప్పల్లో దాగిన చూపులు చెప్పేదేమిటో?
గుండెల్లో గుసగుసలాడే కోరిక లేమిటో
ఆ: రారా! వెంటనే - పొదరింటికీ
ఇక రాదురా నిదుర నా కంటికీ... ॥కళ్ళు కప్పే॥

## నా యిల్లు

సంగీతం: వి. నాగయ్య, అద్దేపల్లి రామారావు　　　గానం: రావు బాల సరస్వతీదేవి, జిక్కి

అది గదిగో గగనసీమ
అందమైన చందమామ ఆడెనోయీ ॥అది॥
ఇది గిదిగో తేలి తేలి
చల్లనైన పిల్లగాలి పాడెనోయీ!
సా రి గ మ ప ద ని సా
సా దా ప మ రి గ మ రి సా
హాయి హాయి ఈ లోకం!
తీయనైన దీ లోకం!
నీయిల్లే పూలవనం!
నీసర్వం ప్రేమ ధనం!
మరవకోయి ఈ సత్యం ॥అది॥
నీ కోసమె జగమంతా
నిండె నోయి వెన్నెలలు!
తేలె నోయి గాలిపైన
తీయనైన కోరికలు
చెరుచు కోకు ఈ సౌఖ్యం!
చేతులార ఆనందం!
ఏ నాడును పొరపడ కోయి!
ఏ మైనా త్వరపడ కోయి!
మరల రాదు రమ్మన్నా
మాయమైన ప్రేమ ధనం!
చిగిరింపదు తిరిగి, వాడి
చెడిన పూలవనం
మరవకోయి ఈ సత్యం

## శ్రీ రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్

సంగీతం: పెండ్యాల　　　గానం: బాలు

నాపేరు బికారి నాదారి ఎడారి
మనసైన చోటు మజిలీ కాదన్న చాలు బదిలీ
తోటకు తోబుట్టువును
ఏటికి నే బిడ్డను
పాట నాకు సైదోడు
పక్షినాకు తోడు
విసుగు రాదు ఖుషీ పోదు
వేసట లేనేలేదు
అసలు నా పేరు ఆనంద విహారి ॥నాపేరు॥
మేలుకొని కలలుగని
మేఘాలపై నా ప్రేయసిని ఊహించుకొని
ఇంద్రధనుసు పల్లకి ఎక్కి కలుసుకోవాలని
ఆకాశవీధిలో పయనించు బాటసారి ॥నాపేరు॥
కూటికి నే పేదను గుణములలో పెద్దను
సంకల్పము నాకు ధనము సాహసమే నాకు బలము
ఏనాటికో ఈ గరీబు కాకపోదు నవాబు
అంతవరకు నేనొక నిరంతర సంచారి ॥నాపేరు॥

## మల్లీశ్వరి

సంగీతం: యస్.రాజేశ్వరరావు　　　గానం: పి. భానుమతి

మనసున మల్లెల మాల లూగెనే,
కన్నుల వెన్నెల డోల లూగెనే
ఎంత హాయి ఈ రేయి నిండెనో,
ఎన్ని నాళ్ళకీ బ్రతుకు పండెనో!
కొమ్మల గువ్వలు గుసగుస మనినా,
రెమ్మల గాలులు ఉసు రుసు రనినా,
అలలు కొలనులో గలగల మనినా,
దవ్వుల వేణువు సవ్వడి వినినా,
నీవు వచ్చేవని, నీ పిలుపే విని,
కన్నుల నీరిడి కలయ చూచితిని,
గడియ యేని యిక విడిచి పోకుమా,
ఎగసిన హృదయము పగుల నీకుమా
ఎన్ని నాళ్ల కీ బ్రతుకు పండెనో,
ఎంత హాయి ఈ రేయి నిండెనో...

## ఈనాటి బంధం ఏనాటిదో

సంగీతం: యస్. రాజేశ్వరరావు　　　గానం: పి. సుశీల

ఎవరు నేర్పేరమ్మ ఈ కొమ్మకూ
పూలిమ్మనీ రెమ్మరెమ్మకూ
ఎంత తొందరలే హరి పూజకూ
ప్రొద్దు పొడవక ముందె పూలిమ్మనీ ॥ఎవరు॥
కొలువైతివాదేవి నా కోసమూ... తులసీ...
తులసీ దయా పూర్ణ కలశీ
మల్లెలివి నా తల్లి వరలక్ష్మికీ
మొల్లలివి నన్నేలు నా స్వామికీ ॥ఎవరు॥
ఏ లీల సేవింతు
ఏమనుచు కీర్తింతు
సీత మనసే నీకు సింహాసనం
ఒక పువ్వు పాదాల
ఒక దివ్వెనీ మ్రోల
ఒదిగి నీ ఎదుట ఇదె వందనం
ఇదె వందనం

## భాగ్యరేఖ

సంగీతం: పెండ్యాల — గానం: పి. సుశీల

నీవుండే దా కొండపై!
నాస్వామి! నే నుండే దీ నేలపై
ఏ లీల సేవింతునో! ఏపూల పూజింతునో!
శ్రీ పారిజాత సుమా లెన్నో పూచె
ఈ పేదరాలి మనస్సెంతో వేచె
నీ పాదసేవా మహాభాగ్య మీవా
నాపైని దయజూపవా నా స్వామి ॥నీవుండే॥
దూరాన నైనా కనే భాగ్య మీవా
నీ రూపునాలో సదా నిల్వనీవా
ఏడు కొండలపైనా వీడైన స్వామి
నాపైని దయజూపవా నా స్వామి ॥నీవుండే॥

## పూజాఫలం

సంగీతం: యస్. రాజేశ్వరరావు — గానం: పి. సుశీల

నేరుతునో లేదో ప్రభు, నీ పాటలు పాడ?
ఇది చల్లని వేళైన, ఇది వెన్నెల రేయైన,
నిదురరాదు కనులకు! శాంతి లేదు మనసుకు!
మదిలో వేదన యేదో కదలె రాధకు! ॥ఇది చల్లని॥
నీ దయలాగున వెన్నెల జగమంతా ముంచె!
నీ మధుర ప్రేమ యమున కడలంతా నించె!
మరిమరి ముల్లోకములను మురిపించే, స్వామీ,
మనసు చల్లబడ దాసికి కనిపించవేమీ ॥ఇది చల్లని॥
నీ వేణువు కోసం - బ్రతుకంతా వీనులాయె!
నీ దరిసెనమునకై ఒడలంతా కనులాయె!
బడలే బ్రతుకున ఆశలు వెలిగించే దేవా!
సడలే వీణియ తీగలు సవరించి పోవా ॥ఇది చల్లని॥

## రాజమకుటం

సంగీతం: మాస్టర్ వేణు — గానం: పి. లీల

సడిసేయకో గాలి! సడిసేయబోకే!
బడలి ఒడిలో రాజు పవ్వళించేనే
సడిసేయకే...
రత్నపీఠిక లేని రారాజు నా స్వామి!
మణికిరీటము లేని మహరాజు గాకేమి!
చిలిపి పరుగులు మాని కొలిచిపోరాదే!
సడిసేయకే...
ఏటి గలగలలకే ఎగిరి లేచేనే!
ఆకు కదలికలకే అదరి చూసేనే!
నిదుర చెదరిందంటే నే నూరుకోనే!
సడిసేయకే...
పండు వెన్నెల నడిగి పాన్పు తేరాదే!
నీలిమబ్బుల దాగు నిదుర తేరాదే!
విరుల వీవన పూని విసిరిపోరాదే!
సడిసేయకే గాలి సడిసేయబోకే
బడలి ఒడిలో రాజు పవ్వళించేనే
సడిసేయకో గాలి...

## ఉండమ్మా బొట్టుపెడతా

సంగీతం: కె.వి. మహదేవన్ — గానం: పి. సుశీల, బాలు

అ: చుక్కలతో చెప్పాలి
ఆ: ఏమనీ?
అ: ఇటుచూస్తే తప్పనీ!
ఆ: ఎందుకనీ?
అ: ఇక్కడ ఏకాంతంలో ఏమో ఏమేమో అనీ ॥చుక్క॥
అ: చెదరే ముంగురులూ, కాటుకలూ!
నుదురంతా పాకేటి కుంకుమలూ!
ఆ: సిగపాయల పూవులే సిగ్గుపడేనూ!
చిగురాకుల గాలులే ఒదిగొదిగేనూ!
అ: ఇక్కడ ఏకాంతంలో ఏమో ఏమేమో అనీ
ఆ: మనసులో ఊహ కనులు కనిపెట్టే వేళ,
చెవిలో ఒక చిన్న కోర్కె చెప్పేసే వేళ
అ: మిసిమి పెదవి మధువులు తొణికేనని,
పసికట్టే తుమ్మెదలూ ముసిరేననీ,
ఇక్కడ ఏకాంతంలో ఏమో ఏమేమో అనీ ॥చుక్క॥

## భక్తశబరి

సంగీతం: పెండ్యాల — గానం: పి. సుశీల

నిన్ను జూచు నందాక
కన్నుల వెలుగుండేనా!
కన్నతండ్రీ! ఎన్నాళ్లని
నిలచే నీ ఉసురు ఇంక ॥నిన్ను॥
ఈ వాకిట తోరణమై,
ఈలా వేలాడి వాడి,
రామాయని పిలిచిన
నీరాకయె కరవాయెగాని ॥నిన్ను॥
అదిగో ఇదిగో యని మరి
ఎదురరయుట చేతగాదు!
ఎదురుగ వద్దామంటే
ముదుసలి ఇది కదలలేదు!
బడలిన పువ్విది వాడునో
తొడిమ వీడి పడి రాలునో
అడుగుల కడ రామాయని
పడితే అంతే చాలును ॥నిన్ను॥

## ఉండమ్మా బొట్టు పెడతా

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల, బాలు

ఆ: చాలులే - నిదురపో!
జాబిలి కూనా!
ఆ దొంగ కలువరేకుల్లో తుమ్మెద లాడేనా!
నీ సోగ కనుల రెప్పల్లో తూనీగ లాడేనా!
తుమ్మెద లాడేనా - తూనీగ లాడేనా

అంత దవ్వునుంచే అయ్యడుగులు తెలిసేనా!
ఓసి! వేలెడేసి లేవు! బోసి నవులదానా!
మూసే నీ కనుల, ఎటుల, పూసేదే నిదర! అదెర! రా!
జాబిలి కూనా! ॥ఆ దొంగ॥
అ: అమ్మను బులిపించి - నీ అయ్యను మరిపించావే
కానీ, చిట్టి తమ్ముడొకడు నీ తొట్టిలోకి రానీ!
ఆ: ఔరా - కోరికలు! కలలు!
తీరా నిజమయితే - అయితే!
జాబిలి కూనా! ॥ ఆ దొంగ॥

## ఉండమ్మా బొట్టు పెడతా

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల బృందం

ఆ: అడుగడుగున గుడి ఉంది!
అందరిలో గుడి ఉంది!
ఆ గుడిలో దీపముంది!
అదియే దైవం ॥అడుగడుగున॥
ఇల్లూ వాకిలి ఒళ్ళూ మనసూ
ఈశుని కొలువనిపించాలి!
ఎల్లవేళలా మంచుకడిగినా
మల్లెపూవులా ఉంచాలి!
దీపం మరి మరి వెలగాలి!
తెరలూ పొరలూ తొలగాలి! ॥అడుగడుగున॥
తల్లీ తండ్రీ గురువూ పెద్దలు
పిల్లలు కొలిచే దైవం!
కల్లా కపటం తెలియని పాపలు
తల్లులు వలచే దైవం!
ప్రతిమనిషీ నడిచే దైవం!
ప్రతిపులుగూ ఎగిరే దైవం! ॥అడుగడుగున॥

## బంగారు పంజరం

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: యస్. జానకి

పగలైతే దొరవేరా - రాతిరి నా రాజువురా!
పక్కనే నువ్వుంటే - ప్రతిరాత్రీ పున్నమిరా! ॥పగలైతే॥
పగలైతే నాలో నీ సొగసంతా దాగేరా!
రేయైతే వెన్నెలగ బయలంత నిండేరా!
రాతిరి నా రాజువురా!
నే కొలిచే దొరవైనా - నను వలచే నా రాజువే!
కలకాల మీలాగె నిలిచే దాననే!
పక్కనే నువ్వుంటే - ప్రతిరాత్రి పున్నమిరా ॥పగలైతే॥

## కలసిన మనసులు

సంగీతం: మాస్టర్ వేణు గానం: పి. సుశీల, ఘంటసాల

ఆ: ఒక్కక్షణం... ఒక్క క్షణం
నన్ను పలుకరించకు!
నావైపిటు చూడకు! ॥ఒక్క॥
నిన్ను తలుచుకోనీ! నా
కన్ను మూసుకోనీ!
మోయలేని ఈ హాయిని
మోయనీ ఒక్కక్షణం!...
అ: ఒక్కక్షణం... ఒక్క క్షణం
ఆ రెప్పలు వాల్చకు
అటూ ఇటూ కదలకు! ॥ఒక్క॥
ఆ కన్నులలో ఊహల
అర్థమేదో అడగనీ!
ఆ కొలనులలో నీడల
అదే పనిగ చూడనీ!
మోయలేని ఈ హాయిని
మోయనీ ఒక్క క్షణం... ॥ఒక్క॥
ఆ: ఆకులతో గాలి ఊసులాడగూడదు!
ఏటిలోని అలలు పెదవి విప్పగూడదు!
మేను మేను తాకగా మౌనముగా గువ్వలవలె,
కొమ్మపైని మాటాడక కునుకు జంటపువ్వులవలె,
మోయలేని ఈ హాయిని మోయనీ ఒక్క క్షణం ॥ఒక్క॥
అ: మోముపైన ముంగురులు ముసరవచ్చునా?
మోవి చుట్టు కోరికలు మూగవచ్చునా?
వాగులాగ ఈ సమయం సాగిపోవుననే భయం!
నాలో నిండిన నీవే నాకు చాలు నేటికి!
మోయలేని ఈ హాయిని మోయనీ ఒక్క క్షణం ॥ఒక్క॥

## బంగారు పంజరం

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: ఎ.పి. కోమల

నీ పదములె చాలు రామా!
నీ పద ధూళులే పదివేలు ॥నీ॥
నీ పద మంటిన పాదుకలు - మ
మ్మాదుకొని ఈ జగమేలు
నీ దయ గౌతమి గంగా - రామయ
నీ దాసులు మునుగంగా
నా బ్రతుకొక నావ
దానిని నడిపే తండ్రివి నీవా ॥నీ॥
కోవెల లోనికి రాలేను
నువు కోరిన కానుక తేలేను
నిను గానక నిమిషము మనలేను
నువు కనబడితే నిను కనలేను
నీ పదములె చాలు రామా
నీ పద ధూళులే పదివేలు

